సంవత్సర చందా
రు. 13-0-0
విడిప్రతిక 25న.పై

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

సంపుటము 52
సంచిక 16
11-12-57

**Founder : K. NAGESWARA RAO**

హేవిళంబి మార్గశిర, బహుళ పంచమి బుధవారం

 విషయానుక్రమణిక 

ముఖచిత్రం !

హిందీ నటి నళినీ జయవంత్





# కృష్ణానదిపై రోడ్డువంతెన

శ్రీశైలం రస్తాకు ప్రారంభోత్సవం జరిపిన నాల్గురోజులకే ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి నాగార్జున సాగరంవద్ద కృష్ణానదిపై నిర్మించిన రోడ్డు వంతెనకు కూడా ప్రారంభోత్సవం జరిపారు. డిసెంబరు 24 వ తేదీన విజయవాడవద్ద కృష్ణానదిమీద నిర్మించిన రెగ్యులేటర్ వంతెనకు కూడా ప్రారంభోత్సవం జరగబోతున్నది. మొత్తంమీద 1957 నవంబరు 24 మొదలు డిసెంబరు 24 వరకూ రాష్ట్రంలో జరిగిన పెద్ద నిర్మాణాలకు ప్రారంభోత్సవాల మాసం అనే చెప్పవచ్చు. శ్రీశైలం రస్తాకు దాదాపు 18 లక్షలు ఖర్చయితే, నాగార్జున సాగరంవద్ద నిర్మించిన రోడ్డు వంతెనకు 87 లక్షలు ఖర్చయింది. ప్రాజెక్టు స్థలానికి ఈ వంతెన ఆరు ఫర్లాంగుల దూరంలో మాత్రమే వుంది. స్తంభానికీ స్తంభానికీ మధ్య 66 అడుగుల దూరంలో మొత్తం 33 స్తంభాలున్నవి. అంటే వంతెన నిడివి మూడు ఫర్లాంగుల పైచిలుకన్న మాట. నిర్మాణానికి దాదాపు 20 నెలలు పట్టింది. దీని సరసనే మీటర్ గేజ్ రైలుమార్గ నిర్మాణానికి కూడా వీలుగా ఈ వంతెన వెడల్పును 33 అడుగులు పెట్టారు.

ఇది బ్రహ్మాండమైన కృష్ణానదిపై నిర్మించిన మొదటి రహదారి వంతెన. దీని ప్రారంభోత్సవంతో నల్గొండ, గుంటూరు జిల్లాల మధ్య ప్రత్యక్ష రహదారి సంబంధం ఏర్పడింది. వర్షఋతువులో వరదలు వచ్చినప్పుడు కేవలం బల్లకట్లద్వారా మాత్రమే అక్కడి ప్రజలు నదిని ఏలేశ్వరం, లంకమోటు అనే చోట్ల దాటుతుండేవారు; ఈ బల్లకట్లమీద, పుట్లమీద నదిని దాటడంలో అనేక ప్రమాదాలు సంభవిస్తుండేవి. స్థానిక ప్రజలు కృష్ణానదిని దాటడంలో తాము తరతరాలుగా ఎదుర్కొంటున్న అనేక విచిత్రమైన విషాద గాథలను చెబుతుంటారు.

నదీనదాలు, కొండలు జాతి సమైక్యతకు గాని, ప్రజల సమిష్టిజీవితానికిగాని ఎన్నడూ అడ్డుపడలేవు. ఎంత బ్రహ్మాండమైన నది అయినప్పటికీ ఏదో ఒక ఉపాయంతో ప్రజలు దానిని దాటి తమ అవసరాలను తీర్చుకోక మానరు.

ఒకప్పుడు ఇక్కడ కొంతమంది ఒకపుట్టిలో కృష్ణానదిని దాటుతున్నారట. వారితోపాటు ఒక పాములవాడు, కోతిని ఆడించి పొట్ట పోసుకునే బిచ్చగాడూ కూడా వున్నారట. పుట్టి నదీమధ్యభాగాన్ని చేరుతున్నదనగా కోతి చిలిపిగా పాములవాడి బుట్టమీది మూతను పైకి ఎత్తిందట. పాము బుసలు కొడుతూ పైకిలేచేసరికి పుట్టిలోవున్న వారందరూ ఖంగారుపడి ఒక మూలకు చేరుకున్నారట! పర్యవసానం పుట్టి మునగడం! కొన్ని నిండుప్రాణాలు నదికిబలికావడం! పుట్టిమునిగి మరణించిన వారిలో చాలామంది ఆసమీపంలోని ఒకేవూరికి చెందినవారవడంవల్ల ఇటీవలి వరకూ ఆవూళ్ళోపుట్టి ప్రమాదాన్ని పురస్కరించుకొని ఏటేటా శ్రాద్ధకర్మలు ఒకేరోజు ఒకేచోట జరుగుతుండేవని కూడా వినికిడి.

ఈ రోడ్డువంతెన నిర్మాణంతో ఇలాటి ప్రమాదాలు ఇక సంభవించే అవకాశం వుండదు. ఇంతేగాక, మద్రాసునుంచి విజయవాడమీదుగా హైదరాబాదుకు కారులో పోవాలంటే 435 మైళ్ళు ప్రయాణం చేయాలి. నాగార్జున సాగరంవద్ద కట్టిన ఈ వంతెనవల్ల ఇది 391 మైళ్ళు మాత్రమే అవుతుంది. నలభైనాలుగు మైళ్ళు కలసివస్తుంది.

కాశీరామేశ్వరం రహదారి పథకంలో గద్వాలవద్ద నిర్మించే వంతెనా, విజయవాడవద్ద పూర్తిఅవుతున్న రెగ్యులేటర్ వంతెనా, కలుపుకుంటే ఆంధ్రప్రదేశ్ లో కృష్ణానదిపై మొత్తం మూడు వంతెనలు ఏర్పడినట్లవుతుంది. దేవుడు మేలుచేసి కృష్ణాలోయ అభివృద్ధి పథకంక్రింద పులిచింతల ప్రాజెక్టు, శ్రీశైలసాగరం ప్రాజెక్టుకూడాఅమలుజరిగితే ఇదే నదికి మరి రెండు వంతెనలుకూడా ఏర్పడవచ్చు. ఏది ఏమైనప్పటికీ రాష్ట్ర అభ్యుదయ సాధనలో రహదారులకు, నదులపై వంతెనలకు అతిముఖ్యమైనస్థానం వున్నది కాబట్టి ఉభయగోదావరిజిల్లాలకూ వాటి పక్కనే వున్న తెలంగాణా జిల్లాలకు మధ్యకూడా రహదారి సంబంధాలు త్వరలో ఏర్పడేట్లు చూడాలి.

★

—శ్రీ—




# కృష్ణమీనన్ ధోరణి దేశప్రతిష్ఠకు దెబ్బ!

**శ్రీ కృష్ణ**

[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

హెరాల్డ్ నికల్సన్ అనే ఆయన "దౌత్యనీతి" (డిప్లొమసీ) పై ఒక గ్రంథం వ్రాస్తూ, దౌత్యనీతిజ్ఞునికి ఉండవలసిన లక్షణాలను ఇలా వివరించారు:—

"సత్యవాదిత్వం, నిర్దుష్టత, శాంతం, ఓర్పు, ఉల్లాసం, వినయం, దేశభక్తి - ఇవీ ఉత్తమ దూతకు ఉండవలసిన లక్షణాలు. అయితే పాఠకుడు ప్రశ్నించవచ్చు - 'తెలివితేటలు, బహువిషయ పరిజ్ఞానం, సూక్ష్మబుద్ధి, వివేకం, అతిథి సత్కారం, వశీకరణ శక్తి, పరిశ్రమ, ధైర్యం, నేర్పరితనం - ఇవక్కరలేదా అని. నేను వీటిని మరిచిపోలేదు. ఇవి సహజంగా ప్రతి దూతకూ ఉంటాయనే నా నమ్మకం. దౌత్యనీతి అంటే నైతికశాస్త్రం కాదు. స్వతంత్ర దేశాల ప్రభుత్వాలమధ్య వ్యవహారాలు నడిపేటప్పుడు చూపవలసిన తెలివితేటలు, నేర్పరితనము."

పైన ఉదహరించిన లక్షణాలకు శ్రీ కృష్ణమీనన్ దౌత్యనీతి అనుగుణంగా ఉందా, విరుద్ధంగా ఉందా అని భారతప్రభుత్వమూ, ప్రజలూ తర్కించాలి. శ్రీ కృష్ణమీనన్ "శాంతంతో, ఓర్పుతో, ఉల్లాసంతో" వ్యవహరిస్తున్నారా?

భారతదేశపు ప్రయోజనాలకు అపాయం ఏర్పడే పరిస్థితుల్లో మొండిపట్టుదలలు విడిచిపెట్టి కొంత నేర్పుగా వ్యవహరించాలి. భారతదేశం తరఫున వాదించడానికి శ్రీ కృష్ణమీనన్ ఒక్కరే దొరికారంటే, అది భారతీయుల బుద్ధికుశలతకే అవమానకరం. అమర్యాదగా మాట్లాడడంవల్ల, దౌత్యనీతికి భంగకరంగా మాట్లాడడంవల్ల, విరోధులను మంచి చేసుకోవడం లేకపోగా, స్నేహితులను విరోధులుగా చేసుకున్నట్లయింది. కాశ్మీర్ విషయంలో సోవియెట్ రష్యా భారతదేశాన్ని సమర్థించినమాట నిజమేననుకోండి. కాని రష్యన్ ప్రతినిధి ప్రసంగ పాఠాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే— షేక్ అబ్దుల్లా ఆశించిన 'స్వతంత్ర కాశ్మీర్' లక్ష్యాన్ని సాధించడానికే రష్యా ప్రయత్నిస్తోందని స్పష్టపడుతుంది.

నిజానికి భారత దేశ రక్షణమే ప్రమాదంలో పడిందనాలి. గోపాలస్వామిఅయ్యంగార్ చనిపోయినప్పటినుంచీ, రక్షణశాఖ అప్రధానమైపోయింది. మొదట్లో దీన్ని ప్రధానమంత్రే నిర్వహించేవారు. తరవాత డా॥ కైలాసనాథ్ కట్జూకి అప్పగించారు. ఎన్నికలైన తర్వాత శ్రీ కృష్ణమీనన్‌కు కటబెటారు. శ్రీ మీనన్ రక్షణశాఖను 'హాబీ'గా చూస్తున్నట్లుంది. ఆయన దృష్టిఅంతా విదేశీ వ్యవహారాలమీదనే ఉంది. సమితి పనిమీద శ్రీ కృష్ణమీనన్ న్యూయార్క్ వెళ్లడం ఇది రెండోసారి. ఇది ఇలా ఉండగా, భారతదేశపు బడ్జెట్‌లో సగానికి పైగా రక్షణశాఖకే ఖర్చవుతోంది.

ప్రజల సమ్మతిపై పరిపాలించడమే ప్రజాస్వామ్యం గనుక, శ్రీ కృష్ణమీనన్‌ను అడిగి ఒక విషయం నిర్ధారణగా తేల్చుకోవాలి. ఆయన రక్షణశాఖ పని ఒక్కటే చూసుకుంటారా? లేక ఏ శాఖాలేని మంత్రిగా ఉండి తనని అడిగిన విషయాలమీద సలహాలిస్తూ ఉంటారా? ఇలా అటూ కాకుండా, ఇటూ కాకుండా ఉంటే వాళ్ళనిచూస్తే ప్రధానమంత్రి ఇదివరలో చిరాకుపడేవారు.

శ్రీ కృష్ణమీనన్ తను ప్రాతినిధ్యం వహిస్తున్న గొప్ప దేశానికి తగని అసభ్యభాషలో ఇటీవల ప్రసంగించారు. దీంతో ఆయన రాజకీయజీవితానికి భరతవాక్యం పలికినట్లేనని అభిజ్ఞులు భావిస్తున్నారు.

విక్టోరియా మహారాజ్ఞి కాలంలో జరిగిన ఒక సంఘటన ఇక్కడ ఉదహరిస్తాను. దౌత్యనీతివిషయమై ఆమె తీసుకున్నంత శ్రద్ధ, తరవాత ఏ బ్రిటిష్ రాజు, రాణీ తీసుకోలేదు. విదేశాంగమంత్రి పామర్‌స్టన్ ఒకసారి ఒక యూరోపియన్ రాజుగారికి ఒక లేఖ వ్రాశాడు. ఈ లేఖ మహారాణి కళ్ళబడింది. వెంటనే పామర్‌స్టన్‌ను పిలిపించింది.

రాణి:—"ఈ రాజుగారు బ్రిటన్ మిత్రుడని నీకు తెలియదా?"

పామర్‌స్టన్:—"మహారాణీ! బ్రిటన్‌కు మిత్రులూ లేరు, శత్రువులూ లేరు, బ్రిటన్‌కు స్వప్రయోజనాలు మాత్రమే ఉన్నాయి."

భారతదేశపు ప్రయోజనాలకు భంగం కలగని విధంగా వ్యవహారాలు నడుస్తున్నాయా లేదా అనేది భారత విదేశాంగనీతికి గీటురాయి.

* * *

రక్షణశాఖ విషయం అనుకుంటున్నాము గనుక ఒక సంగతి చెబుతాను:— పార్లమెంటులోని కాంగ్రెసు సభ్యులంతా అహింసావాదులేగాని, వారిలో కొందరు మాత్రం తమకు ఆయుధాల శాసనం వర్తించకుండా మినహాయించాలని భావిస్తున్నారు. అంటే ఒక వంక 'అహింస అహింస' అని ప్రచారం చేస్తూనే తమ దగ్గిర ఆయుధాలు ఉంచుకోవాలని వీరి ఉద్దేశం.

ఇంకో సంగతి. ఈమధ్య ప్రపంచ శాకాహారుల సమావేశం ఢిల్లీలో జరిగింది. ఉదజని బాంబుకు అహింసయే రక్ష అని ఆసభలో కొందరు వాక్రుచ్చారు. వచ్చిన చిక్కేమిటంటే, ఉదజని బాంబులు గలవారేమో శాకాహారులూ, అహింసావాదులూ కారు; అహింసావాదుల దగ్గిరేమో ఉదజని బాంబులు కొనుక్కోడానికీ, తయారు చేయడానికీ డబ్బులేదు. ఇంకో చిత్రం కనిపిస్తుంది: శాకాహారులైన జంతువులన్నిటినీ— ఏనుగు, గుర్రం, ఒంటె, ఎద్దు, గాడిద మొదలైన వాటన్నిటినీ మనిషి మచ్చికచేసి

ఖరువులు మోయిస్తున్నాడు. ఇక మాంసాహారులైన జంతువుల్లో —[ఒక్క కుక్కను మినహాయిస్తే, అదీ ఒక్క స్విట్జర్లెండులోనే] దేనినీ బరువులు మోయడానికి మానవుడు ఉపయోగించడంలేదు.

*   *   *

రాజకీయాల్లో ఒక పద్ధతీ, క్రమమూ ఉండవు. జాతీయం చేసిన పరిశ్రమలను, ప్రభుత్వ వ్యాపారసంస్థను చూస్తే ఈ సంగతి విశదమవుతుంది. ప్రభుత్వ వ్యాపార సంస్థను స్థాపించాలని గడచిన పదేళ్లుగా ఆందోళన జరిగింది. ఈ ప్రతిపాదనను పరిశీలించడానికి ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించక తప్పలేదు. ఈ సంఘం కొన్ని సిఫార్సులు చేసింది. వాటిని ప్రభుత్వం అమలుచేయ లేదు. అమలు చెయ్యాలని మళ్లీ ఆందోళన జరిగింది. ప్రభుత్వవ్యాపారసంస్థను స్థాపించే నిర్ణయానికి రావడానికి ప్రభుత్వానికి అనవసరంగా చాలాకాలం పట్టింది. తీరా స్థాపించాక అది అక్కర్లేదని ఇప్పుడు ఆందోళన జరుగుతోంది. ఈ సంస్థను విమర్శించడంలో కమ్యూనిస్టులతో కాంగ్రెసువాదులు కూడా చేతులు కలిపారు.

*   *   *

ఇరాక్‌లో ఒక విమానాశ్రయాన్ని ఉపయోగించుకోడానికి భారతదేశానికి ఇరాక్ అనుమతి ఇవ్వలేదని ఒక పత్రికలో పడిన వార్త ఖరారేనని రక్షణశాఖ ఉపమంత్రి సర్దార్ సూరజిత్ మజీతియా పార్లమెంటులో ఖచ్చితంగా చెప్పేశారు. ఆమర్నాడు ఇరాకీ ప్రభుత్వం దీన్ని ఖండించుతూ, భారతీయవిమానానికి దిగే సౌకర్యాలను ఇవ్వడానికి తాము నిరాకరించలేదనీ, ఒకానొక విమానాశ్రయాన్ని ఉపయోగించడానికి మాత్రమే అనుమతి నిరాకరించామనీ, తాము ఎవర్నీ ఆ విమానాశ్రయం ఉపయోగించనివ్వడం లేదనీ ప్రకటనచేసింది.

సర్దార్ సూరజిత్ సింగ్ ఇప్పుడేమని సమాధానమిస్తారో చూడవలసి ఉంది.

*   *   *

క్రిందటివారం నేను వ్రాసినట్లు, ఢిల్లీకి సంబంధించిన వారికితప్ప అందరికీ ఢిల్లీమీద విపరీతమైన శ్రద్ధకలుగుతోంది. కార్పొరేషన్ బిల్లు మీద పార్లమెంటులో జరిగిన ప్రసంగంచూస్తే ఈ సంగతి విశదమవుతుంది. పార్లమెంటులోని కాంగ్రెసేతర సభ్యులకు, న్యూఢిల్లీలో నివసించని ఇతరులకు న్యూఢిల్లీనికూడా కార్పొరేషన్‌లో చేర్పించాలని పట్టుదలగా ఉంది. వీరి పట్టుదలకు ప్రజాస్వామ్యంపై శ్రద్ధయే కారణమట. న్యూఢిల్లీని కార్పొరేషన్‌లో చేర్పడం న్యూఢిల్లీలో నివసించే వారికే ఇష్టం లేదు. లోక్ సభలో ఢిల్లీ ప్రతినిధులయిన చౌధురి బ్రహ్మప్రకాష్, లాలా రాధారమణ్, శ్రీ కృష్ణ నాయర్



శ్రీశైలాలయం వద్ద శ్రీ నీలం సంజీవరెడ్డి, వారి సతి.

శ్రీమతి సుచేతా కృపలానీ గార్లకు కార్పొరేషన్ బిల్లుమీద ఎంత శ్రద్ధ ఉందంటే, ఈ బిల్లు కమిటీ దశలో ఉండగా వీరు సభలో లేనేలేరు.

అద్దె కంట్రోల్ విషయమైకూడా పార్లమెంటులో తర్జనభర్జన జరిగింది. కాంతినికేతన్ సిద్ధాంతాల ఏకైక ప్రతినిధి అయిన మంత్రి శ్రీ అశోకచందా ఈ విషయమై సాంఘికన్యాయం జరిగేట్టే చూస్తామని చెప్పారు.

బాగానే ఉంది. కాని ఒకటి. అద్దెలేమో 1939 లో ధరల ప్రమాణం ప్రకారమూ, జీతాలేమో 1957 ధరల ప్రమాణం ప్రకారమూ నిర్ణయించడం ధర్మమేనా?

ఈ సందర్భంలో ఒక అపోహను తొలగించడం చాలా అవసరం. పాత ఢిల్లీలో చిన్న చిన్న ఇళ్లుగలవారు చాలామంది ఉన్నారు. వీరిలో కొందరు కేవలం ఇళ్ళమీద వచ్చే అద్దెలతోనే జీవితం వెళ్ళబుచ్చే వితంతువు లున్నారు. 'సాంఘిక ధర్మం' ప్రకారం ఇంట్లో అద్దెకుండేవాడే ఇంటికి యజమానిలాగా వ్యవహరిస్తున్నాడు. ఒక ఇంట్లో అద్దెకున్నవాడు, ఆ యింట్లోనే కొంత భాగాన్ని మళ్ళీ ఎవరికో అద్దెకిస్తాడు. మొత్తం ఇంటి అద్దెమీద కంట్రోలు ఉంటుంది గాని, అద్దెకున్నవాళ్లు మళ్ళీ ఓ వాటా అద్దెకిస్తే దానిమీద కంట్రోలుండదు గనక ఇలా రెండోసారి వాటాఇచ్చే అద్దెవాళ్లు అద్దెపించేస్తారు. తమకు అద్దె లేకుండా చేసుకుని, అంతా చిన్న వాటాలో వాళ్ళకే రుద్దేస్తారు. ఒక్కోసారి లాభం కూడా సంపాదిస్తారు. ఇంటి మరమ్మత్తు ఖర్చులన్నీ ఇంటి అసలు యజమానే భరించాలి; 1939 నాటి ధరల్ని బట్టి నిర్ణయించిన అద్దె రాబడితో 1957 నాటి ధరలను భరించాలి. అద్దెల కుండేవాళ్లలో చాలామంది సొంతఇళ్లు కట్టించుకున్నారు. కొత్తఇళ్లకు అద్దె కంట్రోలుబాధ లేదు గనక తమ ఇష్టం వచ్చినంతరేటుకి తమఇళ్లు అద్దెకిచ్చి, తాము అద్దెకుండే ఇళ్లకిమాత్రం 1939 రేటు ప్రకారమే అద్దెలు చెల్లిస్తారు.

అద్దెకంట్రోలు కేసులు విచారణ చేయడానికి స్పెషల్ మేజిస్ట్రేటును వేస్తామని, బిల్లును పార్లమెంటు ఆమోదించే సమయంలో ప్రభుత్వం హామీ ఇచ్చింది. కాని ప్రభుత్వం ఆమాట నిలుపుకోలేదు. అందుచేత అద్దెబకాయి విషయమై వచ్చిన కేసులు కూడా నెలలతరబడి ఆలస్యంఅవుతున్నాయి.



## హైదరాబాదులో

# అఖిలాంధ్ర బాలల పరిషత్తు

[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

పెద్దవాళ్లకి (అంటే వయస్సులో పెద్దవాళ్ళకి) అహంభావం జాస్తి. అదేవాళ్లకున్న ముఖ్యమైన ఆస్తి. చక్కగా పనులు చెయ్యడం తమకే చాతవుతుందనీ, చిన్నపిల్లలకేం చాతకాదనీ పెద్దవాళ్లకొక దురభిప్రాయం ఉంది. ఏవిషయమైనా సరిగ్గా అర్థం చేసుకునే తెలివితేటలు తమకే వున్నాయనీ, ఈ తెలివితేటలు వయస్సుతోపాటే ఎక్కువవుతాయనీ పెద్దవాళ్ళకింకో దురభిప్రాయం ఉంది. నిజానికి తండ్రులనుంచీ, తాతలనుంచీ పిల్లలు నేర్చుకోవలసినదేమైనా వుందా? ఏమీ లేదని కిందటినెల హైదరాబాదులో సమావేశమైన ఆంధ్ర బాలబాలికలు నిరూపించారు. జీవితంలో ఎడాపెడా దెబ్బలుతిన్న పెద్దవాళ్ళ ముదురు మనస్సులకన్నా, కల్లాకపటం ఎరగని తమ లేతమనస్సులే సంఘానికెంతో అమూల్యమైనవని ఆంధ్రబాలల సమావేశం స్పష్టంచేసింది.

శ్రీ నెహ్రూ చిన్నపిల్లవాడని డా॥ రాధాకృష్ణన్ ఒకసారన్నారు. అందుచేత నెహ్రూ పుట్టినరోజు పండగ పిల్లలందరికి పండగే. ఈ పండగ సందర్భంలోనే కిందటినెల ఆంధ్రప్రదేశ్ లోని ఇరవై జిల్లాలనుంచీ, ఇంకా ఇతర ప్రాంతాలనుంచీ బాలప్రతినిధులు ఆంధ్ర రాజధానిలో సమావేశమయ్యారు. ఎగ్జిబిషన్ థియేటరు సభాస్థలం. పెద్దవాళ్ళుకూడా రావడంమూలంగా సభ అందం కొంత దెబ్బతిన్నది. అందాలపోటీలో పాల్గొనడానికి వచ్చినట్లు అలంకరించుకునివచ్చారు కొందరు స్త్రీలు. ప్లాటుఫారం దొరికితే వదలిపెట్టగూడదని నిశ్చయించుకుని వచ్చారు కొందరు పెద్దమనుష్యులు. అయితే ఉత్సాహంతో పరవళ్ళుతొక్కే పిల్లల సందడిలో వీళ్ళనెవరూ పట్టించుకోలేదనుకోండి.

సభకు ప్రారంభోత్సవం చేస్తూ శ్రీ సంజీవరెడ్డి సందర్భోచితంగా విలువైన ముక్క అన్నారు: "అసెంబ్లీనుంచి సరాసరి ఇక్కడికే వచ్చేశాను. అసెంబ్లీలోకంటే పిల్లలమధ్య ఇక్కడ ఉండటమే నాకెంతో హాయిగా వుంది. ప్రశ్నలు, ఉపప్రశ్నలు, వాటికి సమాధానాలివ్వడం, ఈ బాదరబందీ ఏమీ లేదిక్కడ. ముఖ్యంగా నేనేం మాట్లాడచ్చో ఏంమాట్లాడకూడదో, ఏంచేయచ్చో ఏంచేయకూడదో శాసించే స్పీకరు ఇక్కడలేరు. అది మరీ హాయిగావుంది నాకు."

ఇరవై జిల్లాలనుంచీ, ఇతరప్రాంతాలనుంచీ వచ్చిన ప్రతినిధులు ముఖ్య అతిథికి పూలమాలలు వెయ్యడంతో ఉదయపు కార్యక్రమం ప్రారంభమైంది. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి ప్రత్యేకంగా ఈ సందర్భానికిగాను ఒక పాట వ్రాశారు. సస్యశ్యామలమైన తెలుగు పొలాలను, జలజల పొంగుతూ ప్రవహించే తెలుగు నదులను వర్ణించే ఈ గీతాన్ని కుమారి జానకీరాణి, శ్రీమతి పేరిందేవి, శ్రీ చిత్తరంజన్ మధు



గవర్నర్ శ్రీ సచార్ సమక్షంలో బాలల వినోదప్రదర్శనం



"మీ అందరిలో నే అందగాణ్ణి! మా అన్నకంటె మరీ చిన్నవాణ్ణి!" అని పాడుతున్నాడు గుడివాడ బాలానందసంఘ సభ్యుడు చి॥ వి. సత్యనారాయణ. "మొత్తిమీద బలే తమాషా కుర్రాడులా ఉన్నాడే" అనుకొంటున్నట్టున్నారు గవర్నర్ పచార్. "ఆంధ్రబాలలంటే మరేమనుకున్నారు?" అన్నట్టు చూస్తున్నారు మంత్రి బసవరాజు. అందరూ ఆనందిస్తున్నారు పాటవిని.

రంగా పాడారు. ప్రతినిధులు పాటలను అనుసరిస్తూ వివ్యాపాలు చేశారు.

పిల్లల్ని ఎలా చూడాలో మనకి బాగా తెలుసని మనకొక నమ్మకం. కాని పెద్ద వాళ్ళపట్ల ఎలా ప్రవర్తించాలో పిల్లలకి బాగా తెలుసు. సభ ఏర్పాట్లు అవి ఎంత బాగా చేశారో చూడండి. ముఖ్యమంత్రే ముఖ్య అతిథి. సభ ప్లానింగూ అదీ సరిగ్గా చేయించడానికి గాను, ప్లానింగ్ మంత్రిని ఆహ్వాన సంఘానికి అధ్యక్షుడుగా వేసుకున్నారు. వీరిద్దరినీ పిల్లలు పుష్పమాలాలంకృతులను చేశారు. వారుకూడా తమపూల మాలలు తీసి ఆ పిల్లలకే మళ్ళీ వేశారు. సభకి అధ్యక్షత వహించడానికి వచ్చిన విద్యామంత్రి, సభకిరాగానే కొత్త ప్రాథమిక విద్య అభ్యసించారు. అందరికంటెముందుగా ఆయనకి ఒక చిన్న పాప దండవేసింది. ఆయన నవ్వుతూ ఏదో ఆలోచిస్తున్నట్లు ఉండిపోయారు. ఇంతలో ముఖ్యమంత్రి తనకు దండవేసిన అమ్మాయికే మళ్ళీ దండ వెయ్యడం విద్యామంత్రిగారి కంటబడింది. అప్పుడు తట్టిందాయనకి తనుకూడా అలా చేస్తే బావుంటుందని. వెంటనే తమనాయకుని ఉదాహరణను అనుసరించి, తనకుదండ వేసిన పాపమెళ్ళోకి దండ విసిరేశారు. కొంచెం లేటయితే అయిందిగాని నీటుగా వేశారు!

ఆంధ్ర బాలానందసంఘం చేస్తున్న పనులనుగూర్చి శ్రీమతి న్యాయపతి కామేశ్వరి ఒక చిన్న నివేదిక చదివారు. తరవాత పాటలు, నాట్యాలు,వగైరా కార్యక్రమం.

శ్రీ నెహ్రూ జన్మదినోత్సవ కార్యక్రమం మధ్యాహ్నం జరిగింది. దీనికి ఆంధ్ర గవర్నరు శ్రీ భీమసేన్ సచార్ హాజరయ్యారు.

14 వ తేదీ ఉదయం సభలో శ్రీ సంజీవరెడ్డి మాట్లాడుతూ పిల్లలసభలో పాల్గొనడం తమకెంతో ఆనందంగా ఉందన్నారు. ఆయన అమ్మాడు సభకికూడా హాజరైఉంటే మరింత ఆనందించి ఉండేవారు. మూడేళ్ళపైన, పదమూడేళ్ళలోపు వయస్సుగల బాలబాలికలు స్టేజిమీద వ్యవహరించిన విధం చూస్తే ఆయనకి కొందరు మంత్రులకంటే ఫస్ట్లే నయమని పించి ఉండేది. అందులో ముఖ్యంగా ఒక అయిదేళ్ళ కుర్రాడు (హైదరాబాదు వాస్తవ్యుడు చి॥ శ్రీరామప్రభు) రాజకీయ నాయకులుకూడా నిగ్గపడాల్సినంతచక్కగా వేదిక మీద ప్రవర్తించాడు. మైక్రోఫోను ఆ అబ్బాయికంటె ఎత్తుగా వుంది. దాన్ని దించడానికి వీల్లేక అతన్ని ఒక కుర్చీమీద ఎక్కించారు. అతడు నిర్భయంగా నిలబడి నారింజపళ్ళమీద పద్యం మొదలుపెట్టాడు. కాని మైక్ పనిచేస్తుంటేగా! తన కంఠం ఎవరికీ వినిపించడం లేదని తెలిసి, అతడు పద్యం ఆపేశాడు. 'ఆంప్లి ఫైయర్' పక్కన కూచున్న మైక్ మనిషిని పిలిచాడు. మైక్ సరిచేసిన తర్వాత సగర్వంగా మళ్ళీ పద్యం ప్రారంభించాడు. సభలో అయిదు వేలమంది బాల బాలికలు, ఇంకా ఎందరో పెద్ద వాళ్లు ఉన్నారు. వీళ్ళందరూ ఇలెగి రిపోయేట్టు కరతాళ ధ్వనులు, హర్షధ్వానాలు చేస్తూంటే, అవేమీ వినిపించుకోనట్లు ఆ అబ్బాయి కుర్చీదిగి వెళ్ళిపోయాడు. ఆ నాటి సాయంత్రం నరసాపురం తాలూకా,ఓతాన గ్రామంలోని శ్రీరామలింగేశ్వర బాలానంద సంఘానికి చెందిన ఒక ఎనిమిదేళ్ళ బాలిక, తనకంటె పొడుగా ఉండి, తనకంటే పెద్ద వాళ్ళయిన బాలికల బృందానికి నాయకత్వం వహించి నృత్య ప్రదర్శనం ఇచ్చింది. ఏలూరునుంచి వచ్చిన ఒక బాలిక 'సినిమా పిచ్చి' అనే నాటికలో చేసిన నటన గొప్పలు చెప్పుకునే పెద్ద పెద్ద నటీనటుల్ని కూడా దిగదుడుపు అనిపించేంత అద్భుతంగా ఉంది. అయితే ఆ వేళ శ్రీ సంజీవరెడ్డి రాకపోవడం చేత ఇవన్నీ చూసి ఆనందించే అవకాశం ఆయనకు లేకపోయింది.

శ్రీమతి సంజీవరెడ్డి మాత్రం ఆ రోజు హాజరై, సాయంత్రం సభకు అధ్యక్షత వహించారు. డా॥ బి. రామకృష్ణరావుగారి సతి శ్రీమతి బి. అనంతలక్ష్మీదేవి బహుమతి ప్రదానం చేశారు. శ్రీమతి బ్రహ్మానందరెడ్డి కూడా వేదికమీద ఉన్నారు. వీరు ఆ నాటి కార్యక్రమంలోని ఉత్సాహకరమైన అంశాలన్నిటినీ తమ తమ భర్తలకు తెలిపే ఉంటారని మనం ఆశించవచ్చును.

ఆంధ్రప్రదేశ్ బాలల నాల్గవ మహాసభ ఎనిమిది తీర్మానాలు చేసింది.

పటాస్కర్ నివేదిక ప్రకారం మద్రాసు రాష్ట్రంలో చేర్చబడే గ్రామాల్లో ఈమార్పు మూలంగా పిల్లల విద్యా సౌకర్యాలకు ఏమీ భంగం కలగకుండా ఉండేట్లు చూడమని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతూ ఒక తీర్మానం. రిజిస్టరు చెయ్యని బాలానంద సంఘాలకుకూడా ఆంధ్ర బాలానంద సంఘం ద్వారా సహాయం మంజూరు చేయాలని కేంద్ర సంక్షేమ సంఘాన్ని కోరుతూ మరో తీర్మానం. సంఘాలు తమ వాటాగా ఇచ్చుకోవలసిన మొత్తాలను చెల్లించడం బాలాకష్టంగా ఉందనీ, అందుచేత తగిన ధనసహాయంచేయాలని ప్రదేశ్ ప్రభుత్వాన్ని అర్థిస్తూ మూడో తీర్మానం. బాల్కన్‌జీ బారీ అధ్వర్యాన విజ్ఞానార్జన యాత్రలుచేసే పిల్లలకు రేటుతగ్గింపు సౌకర్యాలను రైల్వేశాఖ కలగజేస్తోందనీ, కేంద్రబాలానంద సంఘానికి అనుబంధమైఉన్న సంఘాలకుకూడా ఇటువంటి సౌకర్యాలనే కలిగించాలని కోరుతూ నాలుగో తీర్మానం. జిల్లాసంఘాల యాజమాన్యాన నడిచేటట్లుగా ప్రతిజిల్లాలోనూ ఒక బాలనాటక మందిరాన్ని నిర్మించాలని కోరుతూ అయిదో తీర్మానం.

(56-వ పేజీ చూడండి)

# ఎర్ర గులాబి

శీలా వీర్రాజు

ఇంట్లోదిగిన తర్వాత అదే మొదటిసారి యింటివాళ్ళతో దెబ్బలాడడం! నాకు కోపం రానేరాదు. ఒచ్చిందంటే...అంతే! ఆ అమ్మాయి అలా అంటుంటే ఎలా ఊరుకునేది? ఏదో వంకబెట్టి అంటుందా అంటే అదీగాదు. ఎవరితోనో చెప్తున్నట్లుగా గట్టిగానే అంటుంది. పోనీ మగాడిని నేను కల్పించుకోవడం యెందుకని ఊరుకుందామనుకున్నా నన్నే పేరెట్టి మరీ అంటుంటే యింకా ఊరుకోనా?

పెద్ద విషయం కూడా కాదు! పువ్వుల్ని కోశానని అరగంట బట్టి దులిపేస్తోంది. వెధవ పువ్వులు ఎవడిక్కావాలి? అలా అంటుందని తెలిస్తే తియ్యకేపోదును.

ఉన్న ఆమూడు వాటాలకి ఒకటేదొడ్డి. ఆదొడ్లో కాస్త వాళ్ళవైపుగా ఉందని, మల్లెపువ్వమీద అధికారం అంతా వాళ్ళకే ఉండాలా? అటూ యిటూ ఉన్న వాటాల వాళ్ళెవరూ ఒక్క పువ్వు కోయడానికి వీల్లేదూ? నేను చెప్పడమేమిటి వాళ్లే అంటేను! “రోజూ అమ్మాయి మల్లెపూలు పెట్టుకొని కాలేజీకి వెళ్ళడం అలవాటు. దానికి తెలిసిఉండగా మరెవరినీ ఆపువ్వుల జోలికి పోనీదు” ఇంటావిడమాటలబట్టే తెలుస్తుంది, ఎవరూ పువ్వులుమాత్రం కోయకండి అని.

“కోస్తే ఏమవుతుందేం?” అని ఎడంవైపువాటాలో కాలేజీ కుర్రాడిలా కోశాగనీకనా? ప్రొద్దుటే స్నానంచేసి దేవుడిమీద అక్షింతలు వేద్దాం అనుకుంటే మా ఆవిడ ఏచేత్తో పెట్టిందో గాని అవి కనుపించలేదు! సోమవారంపూట వట్టిచేతుల్తో దణ్ణం పెటడం ఎందుకని నాలుగు మల్లెపూవులు తెచ్చే ఉద్దేశంతో వెళ్ళి కోస్తుంటే ఆ అమ్మాయి నిక్కచ్చిగా అనేసింది! “మల్లెపూలు ఎవర్ని కొయ్యనివ్వడం లేదండి” అని.

అలా అన్నమాత్రాన కోసినపువ్వుల్ని వదిలిపెట్టి వచ్చేరకాన్ని కాదని యింకా ఆవిడకు తెలీదుగాబోలు! మస్తుగా కావలసినన్ని కోసుకుని మరీ వచ్చాను. ఆ అమ్మాయికి కళ్ళనీళ్లపర్యంతం అయి ఉంటుంది. ఉడికిపోయి అరగంటబట్టి ఒకటేతిట్టడం. బండబూతులు తిట్టకపోయినా ఎంతైనా కాలేజీపిల్ల కదూ! నీతులు చెప్పే ధోరణిలో సాగుతోంది.

ఇక ఎంతకని ఆగేదీ? అంతకీ నా శ్రీమతి రెండు మూడుసార్లు తగులుకొంది. అయితే మాత్రం లాభం ఏమిటి? నేను కలుగజేసుకోక తప్పలేదు. గట్టిగానే అడిగాను! “మూడు వాటాలవారికీ ఒక్కటే దొడ్డయినప్పుడు అందరికీ ఆ చెట్టుమీద హక్కుం”దన్నాను.

“ఇంటివాళ్లం మేం ఉంటుండగా అద్దెకున్నవాళ్లకు దానిమీద అసలు హక్కులే”దంది, కోర్టులో బల్లగుద్ది చెప్తున్న లాయరులా గొంతుపెట్టి. ఎలా అయినా కాలేజీ పిల్ల! అందులోనూ లాయరు వాసనలు వంటబట్టే ఐ. సి. యల్. చదువుతోందాయె!

నాకు విసుగువచ్చి ఊరుకున్నాను. ఆ అమ్మాయి మాత్రం కాలేజీకి వెళ్ళే వరకూ ఆడిపోసుకుంటూనే వుంది. పోనీ అంతటితో సరిపెట్టాలా? సాయంకాలం కాలేజీనుండి వచ్చాకకూడా తిట్టడమే? ప్రొద్దున ఎలాగో అయిపోయింది. మళ్ళీ సాయంకాలం కూడానా?

సాయంకాలం కాలేజీ నుండి రావడంతోటే మళ్ళీ ఎందుకు ఇంత రభసచేస్తోందో అంతా తెలిసిపోయింది! ఎడంవాటాలో కాలేజీ కుర్రాడు ప్రొద్దుట జరిగినదంతా ఎవరో మిత్రుడి చెవిలో వేశాడట. అంతా కూడబలుక్కుని ‘మల్లేలమ్మ’ అని ఆ అమ్మాయికి నిక్ నేమ్ ఇచ్చారట! నాజూగ్గా, పొట్టిగా ఉన్న ‘శశి’కి బదులు మోటుగా, పొడుగ్గా వున్న ‘మల్లేలమ్మ’ అంటుంటే ఆ అమ్మాయికి కోపం తాళప్రమాణంలో రెచ్చిపోయింది. అయినా వాళ్లను ఏమీ అనలేక సగంలోనే ఇంటికి లేచివచ్చి నామీద ఇలా ప్రేటిచింది.

ఇక ఆ యింట్లో ఒక్క క్షణం వుండాలనిపించలేదు. నా శ్రీమతి నా వాదాన్నే బలపరచింది. వరుసగా రెండు రోజులు ఊర్లో అద్దెకు ఇల్లేమయినా దొరుకుతుందేమో వనిష్ఠ తెగతిరిగాను. మరోవిధంగా నా మనస్సు బాధపడుతూనే వుంది. అంత మంచి యిల్లు అన్ని సౌకర్యాలు ఉన్నది, అంత తక్కువ అద్దెలో దొరికినదాన్ని సులభంగా విడిచిపెట్టగలమా? అయినా తప్పనిసరి. ఒకసారి యిలా ఎవరైనా వెళ్ళిపోతేగాని ఆ అమ్మాయికి బుద్ధి వచ్చేట్టు లేదు.

నేను ఇల్లుగురించి తిరుగుతున్నా నన్న సంగతి ఇంటావిడ ఎప్పుడు విందోగాని, సాయంకాలం కార్యాలయంనుండి రావడంతోటే, ఇంటావిడ అంతసేపూ శ్రీమతితోటి జరిపిన సంభాషణాసారాంశాన్ని నాకుకూడా వప్పగించింది. “చూడు నాయనా! నువ్వేదో కోపంవచ్చి వెళ్ళిపోదామనుకుంటున్నావు. నీకు తెలీదుగనుకా? మాపిల్ల బుద్ధే అంత. ఏమీ అనుకోకు. ఏదో ఆకతాయతనంగా అంది.” ఇంటావిడ మాత్రం మంచిదే. అయితేనేం? అమ్మాయిది మాత్రం అంతా కోతిబుద్ధే!

ఆమె అంత ప్రాధేయపడుతూ అడుగుతూ ఉంటే ససేమిరా అంటే ఏమి బావుంటుంది? మరి అమ్మాయి...ఏదోలే కుర్రతనంగదా అని ఉండక తప్పలేదు. నేను మాత్రం ఆ యిల్లెలా విడిచిపెడతాను? దొడ్లో కుళ్లాయి. ఇంటికి కరంటు, మేడమీది వాటాకి చెరోగది ఇన్నీ ఉండి కార్యాలయానికి అంత దగ్గర్లో మరో యిల్లు కావాలంటే దొరుకుతుందా? ఏదో వ్యవహారజ్ఞానంలేని పిల్ల. దీనికి ఇంతగా బాధపడాలా?’ అనుకున్నాను.

మా శ్రీమతి చెప్పేవరకూ యీ విషయం ఎందుకు జ్ఞాపకం రాలేదో నాకు ఆశ్చర్యంగా ఉంది! భేషయిన సలహా యిచ్చింది! రామస్వామి దగ్గర కెళ్ళి రేపీపాటికి మొక్క తేనూ? మరో నాలుగునెలల్లో యింత చెట్లా అంత చెట్టైపోదూ? ఇక పూయడం మొదలు పెట్టిందా సంవత్సరం తరబడి పూతే! పెట్టుకొనేవాళ్లు ఉండాలిగాని పువ్వులకేం లోటు!

సాయంకాలం యింటికొస్తూ చేత్తో మొక్క గూడా పట్టుకొచ్చాను. వెధవది చేతిలోకి వచ్చేసరికి దుంపతెగింది. వేన [illegible] కూడా ఉండేదు. అయినా వాడికా

# ఎర్రగులాబి

పట్టుదల యెందుకో? మల్లె అంటు యివ్వమంటే గులాబీ మొక్క విడిగా ఉందని తీసి యిచ్చాడు. ఊరికే వస్తే వద్దనడం ఎందుకు? ఏదో ఒకటి వెంటబెట్టుకు చక్కా వచ్చాను.

వస్తున్నప్పుడే అనుకున్నాను ఆ అమ్మాయి చూడాలని. శ్రీమతి, నేనూ గొయ్యి తీసి, మొక్క పాతి పెట్టి నీళ్లు పోసే వరకూ పడ్డ శ్రమంతా మేడమీదనుండి చూసి మూతి మూడు వంకర్లు త్రిప్పుతూ లోపలికి పోయింది.

నేను మొక్క వేస్తే మొలవకపోవడం అంటూ ఉండదు. మూడు నెలల్లో నా అంత యెత్తు పెరిగింది. అసలు ఈ సంగతి ఎందుకు జ్ఞాపకం వచ్చిందంటే ఓ రోజు శ్రీమతి నా దగ్గరకు వచ్చి "చూశారా రెండు నెలలకే నా అంత ఎత్తు పెరిగిపోయిందండోయ్!" అంది. అప్పటినుండీ నా అంత యెత్తు ఎప్పటికి పెరుగుతుందోనని రోజూ కొలవడం మొదలుపెట్టాను. సరిగ్గా లెక్కకట్టేటప్పటికి మొక్క నాటిన మూడు నెలలకి నా యెత్తులోకి వచ్చింది. అందుచేతే యింత ఖచ్చితంగా నాయెత్తు-అంటే ఐదడుగుల ఎనిమిది అంగుళాలు ఎదిగిందని చెప్పగలుగుతున్నాను.

రోజూ సాయంకాల అయ్యేటప్పటికి కచ్చ బిగించి నీళ్లోయడం నావంతు. మొగ తొడిగిందో లేదో, యింకా ఎంతకాలానికి తొడుగుతుందో ఊహించి లెక్కలు కట్టడం శ్రీమతి వంతు. చిన్న పిల్లవాడంటూ ఎవడూ లేడు గాని, ఉంటే మొక్కను సగానికివిరిచేయడం వాడి వంతులోకి వెళ్ళేది.

ఏమిటో, ఈమధ్య నాకళ్ళకు సులోచనాలు తగిలించాల్సిన అవసరం వస్తూన్నట్టుంది! లేకపోతే నాకు కనిపించని మొగ్గ శ్రీమతికే ఎలా కనిపించింది? శ్రీమతి నా దగ్గరకు పరుగెత్తుకొస్తుంటే కొంప లెక్కడన్నా అంటుకున్నాయోఏమోననుకున్నా. శ్రీమతిని ఇంకొస్సేపు పరుగెట్టిద్దామనితలుపు వెనకాలే నుంచున్నాను. సరాసరి వీధిలోకి పోయిన శ్రీమతి మళ్ళి వెనక్కు పరిగెత్తుకొచ్చి "ఏమండోయ్! మిమ్మల్నే! మొక్క మొగ్గతొడిగిందండి," అంది.

శ్రీమతి చేత్తో పంచదార జిలేబీ చేసినా ఏడిసినట్టే ఉంటుంది గాని ఆమాటల్లో రసగుల్లా రుచి అంతా ఉంది. డర్బీస్వీపు పందెంలో ఎనిమిదో నెంబరు గుర్రంలా పరుగెత్తికెళ్ళి చెట్టంతా వెతికాను. ఈ సారి నిజంగా సులోచనాలు కావలసివచ్చాయి. ఎంతకీ కనిపించందే! 'బాగా మోసంచేశావే'

(56-వ పేజీ చూడండి)






రాజా, కొలంబస్ అలా కొంచెందూరం నడిచేసరికి సన్నగా, పొడుగ్గా, వయొలిన్‌లా సొగసుగా ఉన్న చిన్నవాడొకడు ఎదురై 'హలోసార్' అన్నాడు కొలంబస్‌ని చూసి.

"ఏం బ్రదర్ కులాసానా?"

"ఆహాఁ మీదయవల్ల. రాత్రి పి. ఎన్. పి. వాళ్ళ ఫిల్ము కత్తిరించాను. ఇంకో గంటలో ప్రొజెక్టునుంది. ఈలోగా ఓసారి చూడాం వస్తారా" అన్నాడు."

"ప్రొజెక్టునా?...ఎన్ని రీళ్ళం."

"నాలుగు."

"బావుంటుందా."

"నా మటుకు నాకు బాగుంది."

"ఫిలిం కాదోయ్. నేను చూడటం. వాళ్లేమనుకుంటారో అని."

"అదా. ఫర్వాలేదు రండి. మీ బావ వాళ్ళకి బాగా తెలుసు. ఆయన్తో పనుంది కూడాట."

"అందుకని నన్ను దువ్వుతున్నావా ముందు" అన్నాడు కొలంబస్.

"సార్ దువ్వటం చేతనైతే ఈ పాటికి ప్రొడ్యూసర్ డైరక్టర్ని అయి ఊరు కుందును....ఊరికె పిలిచాను."

అంతవరకూ వింతగా చూస్తున్న రాజా, అపుడు కొలంబస్‌కి గుర్తొచ్చాడు.

"ఓ, అయామ్ సారీ...ఈయన రాజా గారు...రాజా! వీరు బాబీగారు. అసలుపేరు-నాకు గుర్తులేదు. మేమంతా ఎడిటర్ బాబి అంటాం లే. బ్రిలియంట్ ఫెలో. ఎడిటరన్న మాట" అన్నాడు కొలంబస్ పరిచయం చేస్తూ.

"నమస్కారం" అన్నాడు బాబి.

"నమస్తే సార్...అయితే ఎడిటర్జీ, ఎన్. టి. రామారావు కన్న నాగేశ్వరరావు ఆర్నెల్లు పెద్దవాడని నేనూ, కాదని నా మిత్రుడు ముత్యం వాదించుకుంటున్నాం. మీ రెవరితో ఏకీభవిస్తారెడిటర్జీ?" అన్నాడు రాజా.

"హోల్డాన్ బ్రదర్! మిస్టేక్. గ్రేట్ మిస్టేక్. పొరబడితివి. ఈ ఎడిటరు వేరు. ఈయన ఫిలింపత్రికల ఎడిటరు కాదు. ఉత్తి ఫిలిం ఎడిటరు. ఇక్కడ తయారయే సినిమాల్లో కొంత చెత్త కత్తిరించి మిగతా దాంతో కథలాంటిదిచేసి ఇస్తాడన్నమాట. ప్రొడ్యూసరు నీకు వేషమిచ్చినా, ఈయనకి గిట్టకపోతే నీకు మామూలుగా దిక్కుండదు. అమాంతం కత్తిరించి అవతల పారేస్తాడంతే అదీ సంగతి" అన్నాడు కొలంబస్.

"ఓ, తెలిసింది సార్. ఎడిటర్ అంటే జంబులింగం, తిలక్, మాణిక్యం, వీళ్లందరూ కదూ. తెలుసునండి. దర్శకులుగా గూడా ప్రసిద్ధికెక్కిన చలనచిత్ర ఎడిటర్లెవరూ అని మేం అడిగితే సి. హెచ్. నారాయణ మూర్తి, తిలక్ అని రిప్లయి కూడా వచ్చిందండి...సార్ ఎడిటరుగారూ యక్స్క్యూజ్ మీ. వి మను కోకు సు మీ. అయామే మిస్టేక్...అయితే చలనచిత్ర నటీ నటుల భవిష్యత్తు మీ చేతులో ఉంటుంది అంతే నంటారా?"

"మీ ఇష్టం. అనమంటే అంటాను" అన్నాడు ఎడిటరు అతనికేసి చిత్రంగా చూసి.

"పోనీ ఓసారి అందురూ. మీ సొమ్మేంపోయె. కౌనుగాని ఎడిటరుగారూ దువ్వడమనగా నేమిసార్. కొంచెం వివరంగా సెలవిస్తారా?"

"ఆ? ఏమిటదీ?" అన్నాడు ఎడిటరు బాబి త్రుళ్లిపడి.

"మీ రిందాక చెప్పారుగదు సార్. ప్రొడ్యూసరు డైరెక్టరు అయిపోడానికి దువ్వడం రావాలని...అయామె బ్రిలియంట్ యంగ్ మాన్...దారుణమైన తెలివితేట లున్నాయని మా ఊళ్ళో అందరూ అంటారండి. ఇది నేర్చుకుని ప్రొడ్యూసర్ డైరెక్టరయిపోదామని...అంతకన్న ఇంకేం లేదు."

"అది చాలు. ఊహ మంచిదేగాని, మీరడిగిన ప్రశ్నకి జవాబు బాగా తెలీదుకాని, అదుగో ఆ లావుపాటి ఆసామిని చూశారా. ఆయన క్రాపింగు అసలు దువ్వుకోలేదుగదా. ఆయన అలా మలుపుతిరిగి వచ్చేలోగా ఏంజరుగుతుందో చూడండి" అన్నాడు బాబి.

అంతలోకే, ఆలావుపాటి ఆయనకి ఇద్దరు ఎదురై నమస్కారంపెట్టి ఏదోచెప్పారు. ఆయనతలతాటించాడు అలాగాఅని. వాళ్ళో అరనిమిషం మాట్లాడి వంగివంగి దండాలు పెట్టి వెళిపోయారు. చూస్తుఉండగా, ఆయన క్రాపు దానంతటదే సర్దుకొని, పాపిడతీసుకుని, నున్నగాదువ్వబడి ముస్తాబైపోయింది. ఆయన మొహం,హీరోయినుపాటఅయిపోయినపుడు వెలిగే హీరోవదనంలా ప్రకాశించింది.

"అదీ దువ్వడంఅంటే. మళ్ళీ వాళ్ళ చేతులో దువెన్న ఉందా? లేదు. వాళ్ళా యన తలకాయను చేత్తో ముట్టుకోనైనా ముట్టుకున్నారా? లేదు. చూచారా! అయినా ఆయన చింపిరిజుత్తు దానంతట అదే దువ్వబడింది. అదీసంగతి రండి టైమైంది"

# ★ విక్రమార్కుడి మార్కు సింహాసనం ★

అన్నాడు ఎడిటరు బాబీ.

* * *

థియేటర్‌లో ఆ నాలుగురీళ్ళు వేస్తున్నారు.

మొదటిసీనులో నిర్మల బి. య్యే అని పించేరకం అమ్మాయి వయ్యారంగా ఉయ్యాల ఊగుతోంది. పెద్దహాలులో

“ఆమె. రామయ్య అనే రైతు కూతురు నిర్మల బి. య్యే” అన్నాడు బాబీ.

“జమిందారుగారింటికొచ్చిందికాబోలు” అన్నాడు రాజు.

“అబ్బే వాళ్లిల్లే. జమీందారు ఇల్లు సెట్టు ఇంకా చిన్నది” అన్నాడు బాబీ.

“మరిబీదరైతుకి అంత పెద్దఇల్లుంటుందా?” అన్నాడు రాజు.

“ఉష్” అంటూ రాజు మోచేయిగిల్లాడు కొలంబస్.

“ఏం ఎందుకుండరు. రైతులుమాత్రము మనుజులు కారా. వారికిమాత్రము మేడలు లేవా...సార్! దేశంలో ఇలాంటిభావాలు ఉన్నంతకాలం ఈ దేశం బాగుపడదు” అన్నాడు బాబీ. ఇంకోక్షణం ఆగాక ‘అస లింకోటిలెండి. ఇది ఫస్టుసెట్. అందుకని బెస్టుసెట్ వేయించారు. అవేళ షూటింగ్‌కి జెమిందారు రోలువేసేఆయనరాలేదు. అందు కని ఈ సెట్‌ని పేదరైతురామయ్యఇల్లులాగా వాడుకున్నారు, అఫ్‌కోర్సు తరవాత కొంచెం మనకి ట్రబులొచ్చిందనుకోండి. డిస్ట్రిబ్యూటర్స్ వేళకిడబ్బుపంపలేదు. అంత లోనే హీరోయిను, హీరో ఇద్దరూ కాల్షీటు ఇచ్చారు. వరసగా త్రీడేసు. ఆమూడు రోజులూ వాడుకోపోతే, మళ్లీ మూణ్ణెల్ల దాకా కలిసిరారు. అందుకని నూతుల్కంలో మొత్తంగా చిన్నసెట్టు వేయించేశారు. జెమిందారు ఇంటికి, అంటే కొత్త డబ్బు జాగర్తగా వాడే జమీందారన్నమాట. ఇంక ఆ బీదరైతు చూస్తే వాడి అంతస్తుకి తగని మూడంతస్తులమేడ సెట్‌మీద కాపరం ఉంటున్నాడుగదా మాడండి. ఎంత దుబారా మనిషో. ఈరోజున దేశంలో బీదవాళ్లే ఎక్కువడబ్బు కర్చుపెడుతున్నారు. ఓమూల ప్రణాళికకు పొదుపుచేసి మిగల్చండని ప్రభుత్వం గోలపెడుతూంటే వీళ్ళు ఇలా ఖర్చుపెట్టడం తగునా...అందుకే ఈ రెండు సెట్టింగులూ జాక్‌స్టాపోజుచేసి సిక్స్‌మినిట్ సాంగు పిక్చరైజ్ చేస్తాం. ప్రభోదం అన్న మాట. బీదరైతుల్లారా! మూడంతస్తుల మేడల కోసం డబ్బు దండుగచెయ్యకండి. కావలిస్తే ఈ పిక్చరులో జమీందారు కొంప, రైతు భవంతిమూసి భుద్దితెచ్చుకోండి అని చెప్పి హిట్‌లు కొడతాం. ఆ పాట ఏరువాక సైపులో రాయిస్తున్నాంలెండి. హిట్ అవుతుంది. తెలిసిందా?”

“లేదుసార్ ఏమీ తెలీలేదు నాకు.” అన్నాడు రాజు.

‘ఒంటికి మంచిది. మరేంఫర్వాలేదు’ అన్నాడు కొలంబస్.

అంతలోకే లైట్లువెలిగాయి.

‘అరె సినిమా అయిపోయిందే. మనవేం చూళ్ళేదు. ఇంతచిన్నపిక్చరేంటి’ అన్నాడు రాజు.

‘సారీ, కబుర్లగొడవలో చూళ్ళేదు. ఆప రేటరు నాలుగురీళ్ళు తీసేశాడు కాబోలు. మళ్ళీ వేయిద్దాం ఉండండి” అన్నాడు బాబీ.

(సశేషం) ★

# జారిన అహం

కలకత్తా మెయిల్లో మద్రాసునుంచి ఫస్టు క్లాసులో బయలుదేరేడు శ్రీనివాసమూర్తి. అతడు వచ్చి కూర్చున్న తరువాత మరో యువకుడు కూడ సామాన్లు పోర్టర్లతో పట్టించుకుని అదే కంపార్టుమెంటులోకివచ్చి, సామాన్లు జాగ్రత్తగా పెట్టించేడు. ఆ సామానులు సర్దేటప్పుడు అతను పోర్టర్ల మీద ఏదో పెద్ద అధికారం వున్నట్లు వాళ్ళను గదమాయిస్తూ, అప్పటి "ఇక్కడ పెట్టు; అరె దాన్ని అక్కడ పెడతావేం? నీబుర్రలో మెదడు లేదూ?; ఏయ్ ఈ పెట్టెను దీనిక్రిందికితోయ్. ఏం తోయ లేకపోతున్నావేం? కేవను రోజులు కాదుగా! వూం!" అంటూ ఏమేమో అనడం మొదలుపెట్టేడు. పోర్టర్లుకూడ చాలా భయభక్తులతో పనులు పూర్తిచేసి ఆఖరున కూలికి చేతులు చాచేరు. వాళ్ళ చేతిలో ఆ యువకుడు ఏమిపెట్టేడో శ్రీనివాసమూర్తికి కనుపించలేదు. కాని డబ్బు తీసుకున్న పోర్టరుమాత్రం ఆశ్చర్యంగా ఆ యువకుని ముఖంలోనికి చూచేడు.

"ఏం! అలా చూస్తావు?"

"కష్టం చాలదుబాబూ! చాలాసామాను వుంది." అన్నాడు పోర్టరు.

"అంతే ఇస్తాను. మరో దమ్మిడీ ఇమ్మన్నా ఇవ్వను. వెళ్ళు" విసుగ్గా అన్నాడు యువకుడు.

"లేదు బాబూ! మీలాంటివారే అలా అంటే ఎలాగండీ! మా పొట్టలు ఎలా నిండుతాయ్."

"చాల్లే! నోరుమూసుకుపో! మీపొట్టలు నిండాలంటే ఎంత ఇచ్చినా చాలదు."

"అలా అంటారేమిటి బాబూ! ఇంకొక రూపాయి ఇస్తేగాని వీల్లేదు" కొంచెం తీవ్రంగా అన్నాడు పోర్టరు.

"ఏయ్ ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసుకో"

"ఎవరైతే మాకేం భయం బాబూ! మా కష్టానికి తగినకూలి మాకు ఇవ్వండి! అంతే!"

ఇదరూ ఆ కూలి డబ్బులకొరకు తీవ్రంగా ఘర్షణ పడుతున్నారు. వారు అరవంలో మాట్లాడుకుంటున్నప్పటికీ అయిదు సంవత్సరాలు తాను మద్రాసులో చదువుకున్న కారణంగా శ్రీనివాసమూర్తి ఆ భావను అర్థం చేసుకోగలుగుతున్నాడు. యువకుడు చూస్తే మంచి దర్జాగా వున్నాడు. సామాను చూస్తే శ్రీమంతుడని తెలుస్తూనే వుంది. అలాంటప్పుడు "ఒక్క రూపాయి కొరకు ఇంత హంగామా చేస్తున్నాడేమిటి?" అనుకున్నాడు శ్రీనివాసమూర్తి!

"ఆశ్టే గట్టిగా వాగకయ్యా! ఇస్తావా మరో రూపాయి ఇయ్యి! లేకపోతే ఇది కూడా నీవే తీసుకో" అంటూ పోర్టరు తన చేతిలోని రెండురూపాయల నోటును విసురుగా అతని సీటుమీద విసిరివేసేడు. యువకుడు ఆ నోటును కూడా తీసుకుని "ఏమిటి ఆపాగరు! నేనివ్వను పో" అని అరిచేడు. అదేటైములో ఒక యువతి ఆ కంపార్టుమెంటులో ఎక్కుతూ "ఏమిటది?" అంది తీక్షణంగా.

## కావూరి నరసింహశెట్టి

"చూడండి అమ్మగారు. బండెడు సామాను లోపలికి చేర్చేము. తీరా కూలి ఇవ్వవలసి వచ్చేసరికి రెండు రూపాయలు చేతిలోపెట్టి, మరో రూపాయి ఇమ్మనేసరికి తన నోటికి వచ్చినట్లు ప్రేలుతున్నాడు" అన్నాడు కోపంగా పోర్టరు.

"నోరుముయ్! మాటలు తిన్నగారానియ్" గట్టిగా అంది యువతి.

"మరేమిటమ్మా! మాకు కావలసింది మా కష్టానికి తగిన ఫలం! మీరెవరైతే మాకేం కావాలి?" అన్నాడు పోర్టరు కొస్త తగ్గు స్థాయిలో.

యువతి ముఖం ఎర్రగా జేవురించింది కోపంతో. ఆ యువకునివైపు తీవ్రంగా చూచింది. అతను మాట్లాడలేదు. ఆమె ఇంగ్లీషులోమాట్లాడింది. అతనితో "నీకు బుద్ధిలేదు. ఎన్నిసార్లు చెప్పినా ఇలా తక్కువజాతివాళ్ళతో నానా మాటలు పడతావు. సిగ్గులేదూ? నీతాహతు ఏమిటి? ఆ కూలివాడి తాహతేమిటి? ఒక్కరూపాయికొరకు ఇంతమాట అనిపించుకుంటావా? ఛీ! అంటూ ఛీదరించుకుంది. యువకుడు మాట్లాడకుండా మరో రూపాయి తీసి పోర్టరు చేతిలో పెట్టేడు. పోర్టరు వెళ్ళిపోయేడు.

గార్డు పచ్చలైటు చూపించేడు. రైలు గట్టిగా కూతవేసి ఒక్కసారి వెనుకకు వూగి నెమ్మదిగా బరువుగా ప్లాటుఫారంనుంచి బయలుదేరింది. తన సీటులో ఆమె కూర్చుని ఇంకా అతన్ని సాధిస్తూనే వుంది.

"చేస్తున్నావు పెద్ద ఇంజనీరు వుద్యోగం. ఎందుకు? నీక్రింది వుద్యోగులు, కూలీలు నిన్నుచూచి గడగడలాడుతారు. అంత మాత్రంచేత ప్రతీచోట ప్రతీకూలివాడు నీకు భయపడాలి అంటే ఎలా కుదురుతుంది. ఒక్కరూపాయి వాళ్ళముఖాన పడవేస్తే నీపుట్టి ఏం మునిగిపోతుంది? ఒక్కవుద్యోగం మీదనే నీవూ నేనూ ఆధారపడిలేముగదా! నీకూ నాకూకూడ కావలసినంత ఆస్తివుంది పెద్దలు సంపాదించి ఇచ్చినది. పైగా మరో పెద్దమనిషి ఎదురుగా ఆ కూలివాడు అంత తిరస్కారంగా మాట్లాడితే నీవు ఎలా సహించుకోగలిగేవు?"

ఇంజనీరు కిక్కురుమనలేదు. నూటు మార్చి నైటు డ్రస్సు వేసుకుని తన బెర్తుమీద నడుంవాల్చేడు. శ్రీనివాసమూర్తి ఆ యువతి వైపు ఇంతకుముందు చూచినా, మరోసారి సౌందర్యాన్వేషణ దృష్టితో చూచేడు.

ఆమె ముఖం కోలగా ఎంతో వాజూకుగా వుంది. సన్నని, నిడుపైన, వర్గీస్ ముక్కులాంటి ముక్కు ఆ ముఖానికి ఎంతో చక్కగా అమరివుంది. సున్నితమైన ఆ శరీరం మీద మరీ సున్నితమైన జపాన్‌సిల్కు బ్లౌజు తొడిగింది. మెడ క్రిందివరకూ దిగి, భుజాలను తాకుతున్న నల్లనిజుట్టు ఆలోచన తెగని రచయిత కాల్చే సిగరెట్టుపొగలా రింగురింగులు తిరిగి ఆమె అటూ ఇటూ కదిలేటప్పుడు పింఛంవిప్పి ఆడే నెమలికి వుండే తీవిని జ్ఞాపకంచేస్తున్నాయి. ఇంత సుకుమారమైన హృదయరంజకమైన ఆకారంనుంచి, అలాంటి కఠినమైనమాటలు ఎలావస్తున్నాయా అని శ్రీనివాసమూర్తి ఆశ్చర్యపోయేడు.

"డబ్బు వుండగానే సరికాదు. దానికి తగిన గౌరవం సంపాదించుకోవడంలోనే వుంది గొప్ప" అని మరోసారి ఆమె భర్తమీద



# జారిన అహం



విసుక్కుని, తన చేతిలోని మేగజైను పేజీలు తిప్పడం మొదలుపెట్టింది.

"నిజమే! ఆమె మాటలు కఠినంగా తోచినా అందులో నిజం లేకపోలేదు" అనుకున్నాడు శ్రీనివాసమూర్తి. తనూ బి. ఇ. పరీక్షలు వ్రాసేడు. ఇప్పుడు కాకపోతే మరొకప్పుడైనా తానొక పెద్ద ఇంజనీరు హోదాకు రాగలడు. తన తల్లిదండ్రులు తొందరపడి తాను ఇంటరు చదువుతున్నప్పుడే తన వివాహం జరిపించకుండా ఆగివుంటే, ఈనాడు తానుకూడ తన బి. ఇ. డిగ్రీకి తగిన ఒక సుందరిని ప్రేమించి పెండ్లిచేసుకునేవాడు. కాని తనలాంటి కాబోయే పెద ఇంజనీరు లక్ష్మిలాంటి పల్లెటూరిభార్యతో ఎలా గడుపగలడు? లక్ష్మి! పేరైనా ఈ కాలానికి తగినట్లు నాజూకుగాలేదు. ఆ పల్లెటూరిలో ఇంటిచుట్టూ చెట్లూ, పుట్టలూ వున్నచోట పెరిగిన లక్ష్మికి పట్నవాసపు అలవాట్లు ఎలావస్తాయి? ఏమిటో! తన విషయం విచిత్రంగావుంది. తన పెద్దలు చేసిన పొరబాటు ఫలితం తాను అనుభవించబోతున్నాడు.

లక్ష్మిని కోరి చేసిన తన తల్లిదండ్రులు ఈనాడు లేనేలేరు. తన ఆనందాన్ని చూడాలని తహతహలాడేరు. తన డిగ్రీకోర్సు పూర్తి అయితేగాని సంసారంలోకి దిగనని తాను పట్టుబట్టేడు. తన పట్టుదలే నెగ్గింది. కాని తన తల్లిదండ్రులిద్దరూ అకస్మాత్తుగా భద్రాచలంయాత్రకు వెళ్ళి గోదావరి ప్రమాదంలో ప్రాణాలు విడిచిపెట్టేరు. మూర్తి కళ్లు నీళ్లతో నిండేయి. తాను ఇప్పుడు రాజమండ్రిలో తన బావగారింటికి వెళుతున్నాడు. తరువాత తన అత్తవారిఫూరు వెళ్లాలి. వెళ్లినతరువాత ఏం జరుగుతుంది? మూర్తిశరీరం గగుర్పొడిచింది. లక్ష్మి! ఈ పాటికి ఏపుగా పెరిగివుంటుంది. రెండు సంవత్సరాలక్రితం చూచేడు. చిలకలా ఎగిరిపోయింది. సరిగా చూడడానికి అవకాశం లేకపోయింది. ఇప్పుడెలావుంటుందో?

మూర్తిదృష్టులు ఎదురుగానున్న ఇంజనీరు భార్యపైకి మళ్లేయి. గుప్పున సువాసన వెదజల్లే విదేశీపౌడరు ఆమె రాసుకున్నట్లుంది. లక్ష్మి ఇంత అందంగా వుంటుందా? ఏమో! ఏదో సేషనువచ్చింది. రైలు ఆగింది. ఆ నిశ్శబ్దంలో ఇంజనీరు చేసే సన్ననిగురక నెమ్మదిగా వినిపిస్తోంది. రైలు కదిలింది. తలవని తలంపుగా మూర్తిదృష్టులు ఆ యువతివైపు మళ్లేయి. ఆమె తనసీటులో లేదు. కంపార్టుమెంటులో ఉన్న అద్దంముందు నుంచుని శ్రీనివాసమూర్తిని అద్దంలో చూస్తున్నది. అతను వులిక్కిపడ్డాడు. తాను కూడ అద్దంలో సందేహనివృత్తికొరకు చూచేడు. సందేహంలేదు. అద్దంలో శ్రీనివాసమూర్తి మూర్తి స్పష్టంగా కనిపిస్తున్నది. దానికి దగ్గరగా ఇంజనీరుభార్య నుంచుని తదేకధ్యానంగా ఆ మూర్తినే చూస్తున్నది. శ్రీనివాసమూర్తి గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. అతను చూస్తున్నట్లు తెలుసుకున్న ఆ యువతి ఎర్రనిపెదిమలు గులాబీరేకుల్లా మెల్లగా విచ్చుకుని అరమోడ్పు కన్నులతో భారమైన భావాన్ని అద్దంలో ప్రతిబింబింపజేసేయి. అలాంటి చూపులు అనుభవంలేని మూర్తి భయంతో గజగజలాడిపోయేడు. చీకటిలో దేనినో చూచి భయపడి చిన్నపిల్లవాడు కండ్లు మూసుకుని, పైన దుప్పటి కప్పుకొని ఏ సందుల్లోంచో తిరిగి ఆ భయపెట్టిన వస్తువును చూడకమానడు. అదేవిధంగా శ్రీనివాసమూర్తి కూడ భయంతోనే, చూడకూడదనుకుంటూనే, అద్దంలోని ఆమె ప్రతిబింబాన్ని చూడకుండా ఉండలేకపోయాడు. ఎందుకామె తన ప్రతిబింబాన్ని అలాచూస్తున్నది? ఇంతవరకూ తన భర్తకు చెప్పిన నీతులు ఏమయ్యేయి? ఇంతవరకూ ఆమె గురించి తనకున్న గొప్పఉద్దేశం క్షణంలో వేడితగిలిన మైనపువత్తిలా కరిగిపోయింది.

సూళూరుపేటలో రైలు ఆగింది. ఆ కంపార్టుమెంటులో మరో యిద్దరు ప్రయాణికులు ఎక్కడంతో ఆమె తన సీటులోనికి పోయి పడుకున్నది. రాజమండ్రివరకూ ఏ విశేషమూ లేకుండా శ్రీనివాసమూర్తి ప్రయాణం సాగిపోయింది. రాజమండ్రిలో బావగారింట బసచేసి ఆమరునాడు శ్రీనివాసమూర్తి అత్తవారింటికి బయలుదేరేడు.

అప్పుడే తొడిగిన ట్వీడు సూటు మడతలు నలిగిపోకుండా జాగ్రత్తగా చూచుకుంటూ సైకిలు రిక్షాలో బస్సుస్టాండుకుచేరిన శ్రీనివాసమూర్తి, ఇంకొక గంటకుగాని బస్సు బయలుదేరదని తెలిసి విసుక్కుంటూ సామానులు కారులో వేయించి ప్రక్కనున్న చెట్టు నీడను నుంచున్నాడు.

మెడ్రాసు పట్టణంలో చదువుకుని వచ్చిన శ్రీనివాసమూర్తికి అక్కడి రోడ్డుని చూస్తే రోత పుట్టుకువచ్చింది. కారు వెళ్ళిన కొంతసేపటివరకూ ధూళి ఎగురుతూవుంటే ఆరోడ్డునీ బస్సుస్టాండుచుట్టూ ఝుమ్మని వ్రాలే ఈగలనీ ఈగలనులెక్క చెయ్యకుండా జంగిలీలలోతినుబండారాలమ్మేచిన్నవ్యాపారస్తుల్నీ చూస్తూ ఎంతో చిరాకుపడుతూ అక్కడే నుంచున్నాడు.

"బాబుగారూ!" ఎవరో పిలిచేరు. చిరాకుగా శ్రీనివాసమూర్తి ప్రక్కకు తిరిగి చూచేడు. ప్రక్కనే నుంచున్న ముతకబట్టల పల్లెటూరి రైతు ఏదో అడుగబోతున్నాడు. "ఇంకేంవుంది? 'ఏవూరు, ఎవరింటికి?' వగైరా పనిలేని చొప్పదంటు ప్రశ్నలు" అనుకుంటూ, ఆ ఆసామీ ఏమి అడగడానికి అవకాశం ఇవ్వకుండా అతన్ని తప్పించుకోడానికి రెండడుగులు ముందుకు వేసేడు. అయినా ఆ పల్లెటూరిరైతు అతన్ని విడువలేదు. 'బాబూ' మళ్లీ పిలిచేడు.

ఈసారి శ్రీనివాసమూర్తి వినిపించనట్లుగా మరోవైపు చూడసాగేడు.

"బాబుగారూ" మళ్ళీ పిలుపు.

అతను వినలేదు.

పల్లెటూరిరైతు నెమ్మదిగా శ్రీనివాసమూర్తి భుజంమీద చేయివేసి తడుతూ "బాబూ" అన్నాడు. శ్రీనివాసమూర్తి ఉలిక్కిపడ్డాడు. "మూర్ఖుడు. పల్లెటూరి మొద్దు. సభ్యత తెలియని అడవిమనిషి-భుజంమీద చేయివేస్తాడా?" ఎగిరిపడ్డాడు శ్రీనివాసమూర్తి.

"బుద్ధిలేదూ! మీద చేయివేస్తావెందుకు? ఎవరనుకున్నావ్? ప్రపంచజ్ఞానంలేని మోటుజాతి" విసుక్కుంటూ కండ్లెర్రజేసేడు శ్రీనివాసమూర్తి. ఆ పల్లెటూరి రైతు విస్తుపోయేడు. ఒక్కసారి దిగాలు పడిపోయేడు.

శ్రీనివాసమూర్తి చెవుల్లో ఇంజనీరు భార్య భర్తను వుద్దేశించి అన్న మాటలు గింగురుమన్నాయి. డబ్బు వుండగానే సరికాదు. హోదాను నిలబెట్టుకొనేలా ప్రవర్తించాలి. తన హోదా తెలుసుకోకుండా ఈ పల్లెటూరి పేదరైతు భుజంతట్టి మాట్లాడతాడా? "ఇడియట్" కోపం తీరక మరోసారి ఇంగ్లీషులో తిట్టుకున్నాడు.

బస్సు బయలుదేరడానికి సూచనగా డ్రైవరు హారను వాయించడం మొదలుపెట్టడంతో తిరిగి చూడకుండా విసురుగా బస్సువద్దకువెళ్లి ఫ్రంటుసీటులో ఆసీనుడయ్యేడు శ్రీనివాసమూర్తి.

కొంతదూరం వెళ్ళినతరువాత బస్సుకు రిపేరు వచ్చింది. దాన్ని పూర్తిచేసుకుని మరో మైలు పోయేసరికి వెనుక చక్రంలోని గాలి తగ్గిపోయింది. ఇలా మూడుగంటలు చేయవలసిన బస్సు ప్రయాణం 6 గంటల వరకూ తెమలలేదు. దాని ఫలితంగా రాత్రి 7 గంటలకు చేరవలసిన బస్సు 10 గంటలకు గాని గమ్యస్థానం చేరలేదు. శ్రీనివాసమూర్తికి ఈ దైవాధీనం బస్సులమీద మితిలేని కోపం వచ్చింది. అయినా గత్యంతరంలేక ఓర్పుగా బస్సులో కూర్చుని ప్రయాణం చేసేడు. బస్సు గమ్యస్థానం చేరుకునేలోపుగా కారు మబ్బులు ఆకాశాన్నంతా అలుముకున్నాయి. చల్లనిగాలి వీస్తోంది. సరిగా బస్సు ఆగేసరికి విపరీతమైన జల్లువాన ప్రారంభించింది. ప్రయాణికులంతా దిగిపోయి ప్రక్కలకు పరుగెత్తేరు. ఆ పల్లెటూరిలో బస్సుస్టాండు వద్ద కూలీ లెవ్వరూ లేరు. కండక్టరు అందించిన తన సామానును శ్రీనివాసమూర్తి విధిలేక స్వయంగా అందుకుని ప్రక్కనున్న ఇంటి అరుగుమీదకు చేరవేసేడు. వర్షపుజల్లు విపరీతంగా కొడుతోంది. ఉండుండి మేఘ గర్జనలు సింహగర్జనలా వినిపిస్తున్నాయి. అతను నుంచున్న అరుగు చిన్నదికావడంవల్ల వర్షపుజల్లు గాలి వీచినప్పుడల్లా అతనిమీదకు కొట్టి బట్టలను తడిపివేస్తున్నది. ఏమి చేయడానికి అతనికి తోచడంలేదు. మెడ్రాసులోఅయితే టాక్సీని పిలిచి అందులో ఎక్కి పోవచ్చు, కాని ఈ పల్లెటూరిలో ఒక జట్కా అయినా కనుపించడంలేదు. ఇంకా ఒక మైలుపోతేగాని అత్తవారివూరు చేరలేడు. ఆఖరికి ఒక కూలివాడుకూడ కనుపించడంలేదు. "వెధవ పల్లెటూరి ప్రయాణం" అని అతను విసుక్కున్నాడు. కడుపులో ఆకలి దహించుకుపోతోంది. మెడ్రాసులో ఎప్పుడూ అతను ఆకలిబాధ పడలేదు. ఏ సమయంలోనైనా కావలసిన ఏ వస్తువైనా దొరికేది. ఈ పల్లెటూరిలో ఒక్క కాఫీహోటలైనా కనుపించడంలేదు. ఆకాశంలో తళుక్కున మెరిసే మెరుపులుతప్ప వీధిలో దీపకాంతికూడ కనుపించడంలేదు. రాను రాను వర్షం ఎక్కువవుతున్నదేగాని తగ్గే సూచనలు లేవు. ట్వీడు సూటు పూర్తిగా తడిసిపోయింది. ఇక అరుగుమీద వుండి ప్రయోజనంలేదు. ఈ వర్షంలోనైనా నడిచి వెళ్ళిపోవాలి. పోయి అత్తవారింటికి చేరుకోవాలి. అయితే పెట్టె, బెడ్డింగుమాట ఏమిటి? చీకటిలో ఎవరైనా చూస్తే నామోషీ అనుకోడానికి లేదుగాని తానెప్పుడూ ఇంత బరువు మోసిఎరుగడు. ఏమిచేయడం! ఒక్క కూలివాడైనా దొరికే సూచనలు లేవు. పల్లెటూళ్ళు ఇంత అధ్వాన్నంగా వున్నాయి గనుకనే ఇక్కడి మనుష్యులుకూడ అజ్ఞానంలో కూరుకుపోయి వున్నారు. ఒకసారి ఆ పల్లెటూరి మొద్దురైతు అతని స్మృతిపథంలో మెదిలేడు. ఎంత మూర్ఖుడు కాకపోతే తనను తట్టి పిలుస్తాడు అనుకున్నాడు.



ఋషికుల్యానదిపై (గంజాం) రైలువంతెన

—ఫొటో: వైశ్యరాజు సాంబమూర్తి—ఛత్రపూర్.

ధనా ధనా అని వురుములశబ్దం ఎక్కువయింది. తళుక్కున మెరసిన మెరుపులో ఆ ఇంటి రెండవ అరుగుమీద ఎవరో నుంచున్నట్లు శ్రీనివాసమూర్తికి కనుపించింది.

"ఎవరది?"

"మాది 'సైకి' బాబూ?"

"అక్కడ నుంచున్నావేం?"

"వానవస్తున్నది. తగ్గాగానే వెళ్ళిపోవాలి. మీరు ఎంతవరకూనండి?"

"వెధవప్రశ్నలు, మొదలు." అనుకున్నాడు శ్రీనివాసమూర్తి. అయినా కోపపడడానికి ఇది సమయంకాదు.

"నేనూ మీ వూరికే వెళ్ళాలి"

"ఇప్పుడెలా వెళతారుబాబూ, బండి ఏదీ దొరకదు. రాజమండ్రినుంచి వస్తున్నారు కదూ?"

"ఔను నీకెలా తెలుసు."

"నేనూ మీ బస్సులోనే వచ్చేనులెండి."

"ఓహో! మరి నన్నుకూడా మీ వూరు చేర్చాలి."

"పోనీ ఈ వానలో రాకపోతే ఈరాత్రి

(48- వ పేజీ చూడండి)

# తానొకటి తలిస్తే

కుమారి సి. కృష్ణకుమారి

**పాత్రలు**

పరంధామయ్య—తండ్రి
కామాక్షమ్మ—తల్లి
రామం—చిన్న కొడుకు
సీత—కూతురు.

[స్థలం : పరంధామయ్యగారి వసారా, అలంకరణ : మధ్యతరగతి కుటుంబీకులకు తగినట్లు వుండాలి. గోడకు ఒక కేలండరు, రెండు మూడు దేవతా పటాలు, తగిలింప బడివుంటాయి. హాలు మధ్య ఒక వాలు కుర్చీ గోడకి పక్కగా ఒక టేబులు, కుర్చీ వుంటాయి. టేబులుమీద కొన్ని పుస్తకాలు ఇంకు బాటిల్ వుంటాయి. కుర్చీ పక్కన నేలమీద ఒకచాపపరచబడివుంటుంది. రామం కుర్చీలో కూర్చుని ఏదో వ్రాస్తూ వుంటాడు. సీత చాపమీద కూర్చుని లేసు అల్లుతూ కూని రాగం తీస్తూ వుండగా తెర లేస్తుంది) పరంధామయ్యగారు చేతిలో కాగితాలు పట్టుకుని ప్రవేశిస్తారు]

పరం : ఏమేవ్ ! వసేయ్.

..................

పరం : నిన్నే ఏం చేస్తున్నా?

సీత : (కూనిరాగం ఆపేస్తుంది) అమ్మ దొడ్లో వున్నట్టుంది నాన్నా, పిలవనా?

పరం : ఊ...పిలుచుకురా.

[సీత నిష్క్రమిస్తుంది. పరంధామయ్య గారు వాలుకుర్చీలో చతికిలబడిచేతిలోవున్న కాగితాలను పరిశీలిస్తుండగా, చేతులు చీర కొంగుతో తుడుచుకుంటూ కామాక్షమ్మ ప్రవేశిస్తుంది]

కామా : ఏమిటండీ, పిలిచారుట.

పరం : ఇంకా 'పిలిచారుట, అని నెమ్మదిగా అంటావేం! కేకలు పెట్టీ పెట్టీ నాగొంతెండి పోతుంటేను.

కామా : అయ్యో రామా! గొంతెండి పోయేట్లు కేకలు పెటటానికేం కొంపలు మునిగినయ్యని? ఆ చెప్పేదేదో తొందరగా చెప్పండి. అవతల పనుంది వెళ్ళాలి.

పరం : అయితే కొంపలు మునిగి పోయేటంత ప్రమాదం జరిగిపోతేగాని నువ్వా వంట ఇంట్లో నుంచి బయటకడుగు పెట్టవన్నమాట. రామ, రామ! వంట ఇల్లూ, వంటా తప్ప వేరేవిషయమే పట్టించుకోక పోతే ఎట్లా నీతో అంట!

కామా : కృష్ణా! కృష్ణా! ఎప్పుడు దస్తావేజులు, కాగిత పుదస్త్రాలు పట్టుకుని తిరగటంతప్ప అమ్మాయి పెళ్ళివిషయమే పట్టించుకోకపోతే మీతో వేగటం ఎట్లా అంట! ఇంతకీ ఆ చేతిలోది దస్తావేజేనా?

పరం : చాల్లే! నీకు నా ఉద్యోగాన్ని వెక్కిరించటం తప్ప వేరే పనేముంది. అయినా నువ్వన్నట్లిది దస్తావేజూకాదు, దస్త్రముకాదు.

కామా : ఓహో! ఈ మధ్య వేదాంత సారమనే గ్రంథాన్ని వ్రాస్తున్నామన్నారు కదూ! బహుశ దానితాలూకు కాగితాలై వుంటాయి.

పరం: అదీ కాదు. ఈ కాగితాలను గురించి చెప్పటానికేగా నిన్ను పిలిచింది. కూర్చో సావకాశంగా విందువుగానివి.

కామా: ఫరవాలేదులెండి! నిల్చునే విన గలనుగాని తొందరగా చెప్పండి వెళ్ళాలి.

పరం: అదీ! అట్లా దారికి రా! మన పేరయ్యశాస్త్రి లేడూ—

కామా: 'మన' పేరయ్యశాస్త్రి యెవరండి? మావైపు బంధువుల్లోగాని, మీవైపు వాళ్ళల్లోగాని ఆ పేరుగలవాళ్ళెవరూ లేరే!

పరం: అబ్బబ్బ! నీతో అంతా తంటాగానేవుంది. నేనుచెప్పేది పెళ్ళిళ్ళపేరయ్యశాస్త్రి సంగతి.

కామా: ఓహో! ఆయనా! ఏమైనాడు? పాపం అసలే పెద్దతనం, కులాసాయేనా?

పరం: అబ్బబ్బ! సాంతం వినిపించుకోవేం! ఆయనకేం! పేరుకు పెద్దతనం అన్నమాటేగాని పిడుగులాగా వున్నాడు.

కామా: మరి ఆ కాగితాలకు, పేరయ్యశాస్త్రికి గల సంబంధ మేమిటండీ?

పరం: ఆ విషయమే చెప్పబోతున్నా. ఈ ఉత్తరం ఆయన వ్రాసిందే!

కామా: మీ చేతులోవున్న కాగితాల బొత్తి వుత్తరమన్నమాట. బాగానే వుంది. ఆ...ఆయన ఏమని వ్రాశాడు? అమ్మాయి కేమన్నా సంబంధంగాని వ్రాశాడా?

పరం: [భార్యమాటలు వినిపించుకోకుండా] సంబంధమంటే సంబంధమా! ఎంత గొప్ప సంబంధం! ఈ పదిపేజీలనిండా ఆ పెళ్ళివారి ఘనతే!

కామా: అబ్బా! అంతగొప్ప సంబంధమా! అమ్మాయి పుట్టినప్పుడే అనుకున్నా; అనూరాధ నక్షత్రాన పుట్టింది అదృష్టవంతురాలౌతుందని.

పరం : ఆ......నీ దొక గొడవ. నేను చెప్పేది అమ్మాయి పెళ్ళి సంబంధం గురించి కాదు. అబ్బాయి కొక సంబంధం బెజవాడలో వుందని పేరయ్యశాస్త్రిగారు వ్రాశారు. ఎంత గొప్ప సంబంధం, ఎంత దర్జా! ఎంత హోదా! ఈ సంబంధం కుదిరితే మన అబ్బాయి అదృష్టాన్ని నోటితో పొగడ గలమా!

కామా : ఏడిసినట్లే వుంది మీరుచెప్పేది. ఆడపిల్ల పెళ్ళికన్నా మగపిల్లాడి పెళ్ళికి తొందరగా వుందన్న మాట మీకు.

పరం : తొందరా! తొందరా! ఇంకో రెండేళ్ళు పోతే వరకట్న నిషేధమే వస్తుందని పెద్దలంతా అంటున్నారు. వచ్చినంత వరకే దక్కించుకోవాలి. అసలు సంగతేమిటంటే ఈ కట్నం డబ్బు చేతికొస్తేగాని మన తక్కిన కార్యక్రమాలు నిర్విఘ్నంగా సాగవు. 'ధన మూలమిదం జగత్' అన్న సామెత నీకు తెలుసుగా! చేతిలో తైలముంటేగాని మన ఆటలు సాగవు.

కామా : సరే గాని! ఆ సంబంధం సంగతి సరిగ్గా చెప్పండి. [అంటూ అక్కడే క్రింద చతికిల పడ్తుంది]

పరం : అయ్యయ్యో! నువ్విట్లా కూర్చుంటే వంట పాడైపోదూ! తర్వాత నన్ను తిట్టుకుంటావు. పాపం! తొందరగా వెళ్ళు.

కామా : ఫరవాలేదు లెద్దురూ! సీత వంటపని చూస్తున్నది లెండి!

పరం : అమ్మయ్య. ఇప్పటికి గుక్క తిప్పుకోనిచ్చావు. కొంచెం మంచినీళ్ళు త్రాగనీ చెప్తా! [లోపలికి చూస్తూ] అమ్మాయి! కొంచెం మంచి నీళ్ళు తీసుకు రామ్మా!

సీత : [లోపల్నుంచి] తెస్తున్నానా!

కామా : ఏమండీ! వాళ్ళది బెజవాడ అన్నారు కదూ! ఇంతకీ కట్నమెంతిస్తామన్నారో! అసలు మనకు తగ్గ ఘాయావాళ్ళైనా!

పరం : అబ్బో! వాళ్ళముందు మనమే పాటి? కట్నం పదివేలిస్తామని వాళ్ళే అన్నారుట. ఆ పిల్ల తండ్రి పేరయ్య శాస్త్రితో అన్నాడట 'బావగారిని ఆ అబ్బాయిని ఒకసారి రమ్మనండి. పిల్లని చూడటమే గాక అన్ని విషయాలు మాట్లాడుకోవచ్చు' అని. అందుకు మన పేరయ్య శాస్త్రి గారు అన్నారుట 'అక్కర్లే ఎందుకండీ! అబ్బాయి చాల బుద్ధిమంతుడు. తండ్రిమాట జవదాటడు. ఇక తక్కిన విషయాలంటారా, మనం ఒక నిర్ణయానికివస్తే ఆయనే వచ్చి లగ్గాలు పెట్టిస్తారు.' అని.

సీత : [గ్లాసుతో ప్రవేశించి] ఇదిగో నాన్నా మంచినీళ్ళు,

[పరంధామయ్యగారు గ్లాసందుకొని, ఒక గుక్కెడు నీళ్ళుత్రాగి, గ్లాసు క్రిందపెడతారు. సీత వెళ్ళి చాపమీద కూర్చుంటుంది.]

కామా : అబ్బో! పదివేల రూపాయిల కట్నమే!

పరం : ఆ......మరేమనుకుంటున్నావు. మనఅబ్బాయి అదృష్టవంతుడని నేను చెప్పటంలేదూ! ఎమ్. ఎ. చదువుతున్న పిల్లాడాయె, అందులో కాశీలో చదువంటే ఎంతగొప్ప! అయినా వాడిచదువుముందు పదివేల కట్నం ఏమంతగొప్ప? కనీసం పన్నెండువేలన్నా యిచ్చే ఏర్పాటుచెయ్యమని పేరయ్యగారికి వ్రాయాలి.

కామా : మీ కట్నంసంగతి ఎట్లాఅన్నావుంచండి. అత్తగారి లాంఛనాలుమాత్రం ఏ లోపం లేకుండా జరిపించాలని వ్రాయండి. అసలే పెద్దపిల్లాడిపెళ్ళి.

పరం :............

సీత : అమ్మా! అన్నయ్య పెళ్ళికి నాకు మాత్రం ఆడబిడ్డ లాంఛనాలు ఇవ్వక్కర్లేదూ?

కామా. అవునండోయ్! వున్నది ఒక్కగానొక్కపిల్ల. దానికిమాత్రం ముద్దూముచ్చట జరగొద్దూ! దానికి నూటపదహార్లన్నా తప్పకుండా ఇవ్వాలని గట్టిగా వ్రాయండి.

పరం : ఆ...ఇంకా...

కామా : అంతగొప్పవాళ్ళు వియ్యంకుడికి పట్టుబట్టలన్నా పెట్టరుటండీ! అడగటం దేనికి?

పరం : పట్టుబట్టలుకాదు. నేతబట్టలు పెట్టినా సంతోషించొచ్చు.

రామం : [వ్రాస్తున్నవాడల్లా ఆపి] సరి సరి! ఇంట్లో అందరికన్నిరకాల లాంఛనాలు. మరి నేనేనా మిగిలింది.

కామా : అవునండోయి! పెళ్ళికూతురి మరిదికి కొంచెం ఖరీదయిన బట్టలన్నా పెట్టకపోతే అసలు మనం తీసుకోనేవద్దు. అవునుగాని అబ్బాయికి అలుక పాన్పుమీద మోటారుసైకిలో, రేడియో నో అడిగించాలండోయి. మనవాడసలే బెదద్దయ్య. అడగరా అంటే పరాయివాళ్ళ దగ్గర వేధించి తీసికోవటం దేనికంటాడు. మీరే వాడిని ఒప్పడి వప్పించాలి.

పరం : వీడిసంగతికేం లే! మింగమెతుకు లేకపోయినా మీసాలకు సంపెంగ నూనె అంటారు ఈ కాలంవాళ్ళు. వీళ్ళనీ, వీళ్ళ ఆదర్శాలను చూస్తుంటేనే నాకు వళ్ళు మంట. వాడి బదులు నేనన్నా పట్టుబడతాలే! వదిలిపెడతానా?

కామా : ఇంతకీ పెళ్ళికూతురికి తోబుట్టువులెంతమందో?

పరం : అక్కర్లే! పెళ్ళికూతురికి వెనకా ముందూ ఎవ్వరూ లేరనేగా బాగాచూసి ఈ సంబంధం వ్రాశారు పేరయ్యశాస్త్రి గారు. కాబోయే వియ్యంకుడికి రెండు మిల్లులున్నయ్యట. మూడు మేడలుకూడా వున్నయ్యట. ఆయన తదనంతరం ఈ ఆస్తికి వారసుడు మనవాడే అవుతాడు.

కామా : అయ్యో రామ! వాళ్ళ పిల్లకు ఆస్తి వ్రాస్తారుగాని మన పిల్లాడి కెందుకిస్తారండీ. కూతురు మంచిదౌతుందిగాని అల్లుడు మంచివాడౌతాడా?

పరం : అదంతా నే నాలోచించే చెప్తున్నాలేవే! పేరుకు ఆస్తి అమ్మాయి పేర వున్నా సర్వహక్కులు మన అబ్బాయి సంపాదించుకోవచ్చు తెలివి తేటలవల్ల.

కామా : మరి పిల్ల బాగుంటుందో లేదో?

పరం : ఆ...పిల్ల సంగతి కేంలే! ఈ కాలంవాళ్ళు నల్లగా వున్నా ఫేషన్లుచేసి అందంగా నే తయారవగలరు. అయినా! అన్నీ కుదిరితే పిల్ల బాగుండకపోయినంతమాత్రాన వదులుకుంటామా, ఏమిటి?

కామా : అంతే లెండి! అంతా బాగానే వుందికాని...ఒక్కటే సందేహంగా వుందండీ!

పరం : ఏమిటీ?

కామా : ఎదిగిన ఆడపిల్ల పెళ్ళి చెయ్యకుండా, అబ్బాయి పెళ్ళికేం తొందరొచ్చిందని నలుగురూ నన్ను దుయ్యబట్టరుటండీ!

పరం : ఆ...ఏడిశారు లెద్దూ! వాళ్ళతో మనకేం లెక్క! నోట్లో నాలుక వున్నంత కాలం ఎవ్వరూ మన నేమీ అనలేరు. అయినా మన మేం చేస్తాం! ఎక్కడికెళ్ళినా విధవలు నేలమీద కూర్చుంటారాయె. ఈ ఆడపిల్లల్తో వచ్చిన చిక్కయిది.

[సీత ముఖం ముడుచుకుంటుంది.]

కామా : [సీత తల నిమురుతూ] చాల్లెండి! మీరు మరీను. ఒక్కగానొక్క ఆడపిల్ల.

పరం : అయినా ఎందుకూ! అబ్బాయి పెళ్ళయిన ఆరునెలల్లో అమ్మాయికి పెళ్ళి చెయ్యకపోతే నేను పరంధామయ్యనే కాదు. ఇప్పుడు నన్ను దుయ్యబట్టిన వాళ్ళంతా అప్పుడు 'ఓహోహో! పరంధామయ్యగారు! ఎంత సమర్థులండీ!' అని పొగడరూ!

రామం : అమ్మా! మనంకూడా అక్కయ్యపెళ్ళి అన్నయ్యకు వాళ్ళు చేసినంత ఘనంగా చేద్దామే.

పరం : ఏడిసేవులే! వెధవా! పిట్ట కొంచెం, కూత ఘనమూను, డబ్బు నీళ్ళలాగా వాడటానికి బావిలో దొరకటం లేదు.

రామం : (చిన్నబుచ్చుకుని) మరివదినా వాళ్ళు బావిలోనుంచి తెస్తున్నారా డబ్బు.

పరం : వాళ్ళ కేం రా! వదిన తాత, తండ్రి లక్షలకు లక్షలు కుప్పలుగా పడేశారు మనకెక్కడిది?

కామా : పోనిస్తురూ! చిన్న పన్యాసి! అక్కయ్యపెళ్ళి హుషారుగా చేస్తే చూద్దామని వుత్సాహంగా అన్నాడుగాని వాడికేం తెలుసు? అయినా అబ్బాయిపెళ్ళికి నాలుగైదు వేలన్నా మనకు ఖర్చుకావండీ?

పరం : చాల్చాల్లే! అయిదువేలేనా! ఇంకా నయం పదివేలనలేదు. ఏమైనా సరే రెండువేలల్లో అయిందనిపించాలి.

కామా : అదేమిటండీ! మరీ అసాధ్యంగా మాట్లాడుతారు. అంతకట్నం వాళ్ళిస్తుంటే మనం పెళ్ళికూతురికి సొమ్ముగా అయిదారు వందలన్నా పెట్టద్దుటండీ! ఇంకో అయిదువందల రూపాయల్లో చీరలు పెట్టాలి. గృహప్రవేశం, బంధువులకు, ఇంకా పెళ్ళిఖర్చులు వీటికే కావాలి పదిహేను వందలు. ఇంకా మనకు గుడ్డలు అవీ కావాలా!

పరం : చాలా పెద్దలిస్టే తయారుచేశావే! నీ లెక్కప్రకారం ఒక్క అబ్బాయి

#  తానొకటి తలిస్తే.. 

పెళ్ళికే మూడు వేల ఖర్చు తేలుతున్నది. ఆఖరిమాట నేను చెప్తావిను. పెళ్ళికూతురికి గొప్పవాళ్లు కొబట్టి వాళ్లు నగలు బాగా చేయించే వుంటారు. కనుక మనం ఒక మూడొందలు డబ్బు రూపంలో యిచ్చేద్దాం. ఇంకో మూడొందలకు తగ్గట్టుగా రెండు పట్టుచీరెలు, రెండు మామూలు జరీ చీరలు పెడ్తేసరి. ఇంకో 15 వందల్లో తక్కిన ఖర్చులు సరిపుచ్చాలి.

కామా: ఏం మాటలు చెప్తారండీ! అంత గొప్పవాళ్లు పెళ్లికొడుకు తల్లి మెడ పచ్చగా అన్నా కనిపించకపోతే నవ్వరుటండీ! నాలు గేళ్లయింది అబ్బాయి చదువుకోసం నా గొలుసు కుదువపెట్టారు. ఇప్పుడు అసలుకువడ్డీ రెట్టింపై కూర్చుంది. ఏమైనాసరే! ముందు దాన్ని విడిపించుకోవాలి. అయినా ఇటువంటప్పుడే వీలుకాకపోతే ఇక జన్మలో మనం విడిపించగలమా? ఒక వంద రూపాయల్లో అమ్మాయికి ఒంటిపేట గొలుసన్నా చేయించాలండీ! లేకపోతే దాని మెడ మరీ అసహ్యంగా వుంటుంది.

పరం: [కోపంగా చూస్తూ] ఇంకేం! అమ్మాయికి, నీకు చీరలు లేవు. నాకు పంచెలు కొనాలి. రామానికి చొక్కాలు, లాగులు కుట్టించాలి. పెద్దవాడు పెళ్లికొడుకు కొబట్టి సూట్లు కుట్టించాలి. గుడ్డలకే కావాల్లేవుండే ఒక రెండు వేలు.

కామా: [కోపంగా] అవునులెండి! ఉట్టెప్పుడు ఎట్లాగో ఈ చింకిపేలికలు, ఈ దరిద్రపు ముఖాలు తప్పనే తప్పవు. ఇహ పెళ్లికన్నా కొంచెం మంచివి కొనరన్నమాట. అయినా నాదేముంది, అంతా మీ ఇష్టం. మీ ఇష్టమొచ్చినట్లు చేసుకోండి! [లేచి పోబోతుంది.]

పరం: [కొంచెం తగ్గి ముఖంలో నవ్వు తెచ్చుకుని] అదికాదే! నా మాట పొంతం విను. మీకు కావలసినవన్నీ కొనుక్కోండి. అసలు ఖర్చునిగురించి పూరికినే చెపుతున్నా! ఇంకా ఏమిటి?

కావా: [కూర్చుంటూ] ఇంతవరకు చాలు.

పరం: సరే! ఇప్పటికి మన లెక్కల ప్రకారం అబ్బాయి పెళ్ళికి దగ్గర దగ్గర అయిదువేలు ఖర్చు తేల్తోంది.

కామా: మరి అమ్మాయి పెళ్ళి...

పరం: అదే నేనూ చెప్పబోతున్నా! అమ్మాయి పెళ్లికి కట్నంగా రెండువేలు, పైన పెళ్ళి ఖర్చుగా ఒక వెయ్యి రూపాయల్లో తేలిగ్గా జరిపిద్దాం! ఇంకా మిగిలిన డబ్బు బాకీలకు సర్దాలి కొంతవరకన్నా!

[బయటనుండి "పరంధామయ్య గారు, పరంధామయ్యగారు" అనే పిలుపులు వినిపిస్తాయి.]

పరం: సుబ్బయ్య గొంతులాగా వుంది! ఒరేయి రామం నువ్వెళ్ళి నేను వూరికి వెళ్ళావని చెప్పు.

(రామం నిష్క్రమిస్తాడు).

కామా: ఇప్పుడుకూడా భయపడవలసిన ఖర్మేంపట్టిందండీ! మీ రేవెళ్ళి అబ్బాయిపెళ్లి దాకా ఆగమని, అప్పుడే పొంతంతీరుస్తామని దర్జాగా చెప్పక?

పరం: సరేలే! ఈ మిగిలేదాంతో ఎన్ని అప్పులని తీర్చగలము. కట్నంలో మిగిలేది చిన్న చిన్న అప్పులు సర్దటానికే సరిపోతుంది. ఇక పెదపెక్కడ తీర్చగలము? ఈ సుబ్బయ్య తనిచ్చిన నాలుగు వేలకోసం నన్ను నిన్న నడిబజార్లో నిలేసి పెద్దగా అరిచాడు. ఇవ్వాళ మళ్ళీ ఇక్కడ సిద్ధమయినాడు.

కామా: సరేగాని, అవీ ఇవీ చెప్తున్నారుగాని మన పొలంసంగతి ఎత్తరేం. నేడో రేపో ఆసావుకారు ఆరెండెకరాలుకూడా "గుటకాయిస్వాహా" చేస్తాడు. సరిపోతుంది.

పరం: పోనిద్దూ! నిండా మునిగిన వాడికి చలేమిటి?

కామా: అట్లా అని బంగారం లాంటి పొలం చేజేతులా పోగొట్టుకుంటారన్న మాట. అందుకే పన్నెండు వేలన్నా వాళ్లిని అడగండి.

[రామం చేతిలో టెలిగ్రాంతో ప్రవేశిస్తాడు.]

పరం: ఎవర్రా అవచ్చింది! సుబ్బయ్యేనా?

రామం: కాదునాన్నా! టెలిగ్రాం వచ్చింది.

పరం: [టెలిగ్రాం చింపి చదువుతూ వుంటాడు.]

పరం: పెళ్ళిగాంచి [చదివి ఒక్కసారిగా కుర్చీలో చతికిలపడి] అరి నిర్భాగ్యుడా!

కామా: ఎక్కడనుండి వచ్చిందండీ! ఏమయిందండీ?

పరం: .........

కామా: మాట్లాడరేమండీ! అంతా కులాసాయేనా!

పరం: [తెప్పరిల్లి] ఆ మనబంధువులకు వద్దేళ్ళదాకా ఏం డోకాలేదని నేను గ్యారంటీ ఇవ్వగలనులే! మహా పరహితాభిలాషివి భయపడేరావు, ఒకచెంప కొంపలు మునుగుతుంటే!

కామా: ఇప్పుడేం కొంప మునిగిందండీ! అదేగా నేనూ అడుగుతున్న దీను!

పరం: ఇంకోరి కొంప మునిగితే మన మెందుకు బాధపడ్తాం? మన కొంపే మునిగింది!

కామా: ఇంతకీ అదెక్కడినుండొచ్చిందండీ!

పరం: ఇంకా ఎక్కడినుంచీ! నీ సుపుత్రుడి దగ్గరనుంచే.

కామా: ఏమని వ్రాశాడు? కులాసాయేనా?

పరం: ఆహా! కులాసాయే! వాడికేం వాకినకుడుం లాగా వున్నాడు. ఒంటిగా రావటానికి సిగ్గేసి జంటగా వస్తున్నాడు.

సీత, రామం: [ఆశ్చర్యంగా] ఆ...

కామా: ఏమిటండీ! మీమాటలేం అర్థం కావటం లేదు.

పరం: [కుర్చీలోనుండిలేచి కామాక్షమ్మ వంక కళ్ళురిమి చూస్తూ] నీ కెట్లా అర్థమవుతుంది? నీ సుపుత్రుడి ఘనకార్యం చెపుతా విని సంతోషించు. వాడి క్లాసమ్మాయినే ఒక పేదదాన్ని రిజిస్టర్ మారేజి చేసుకున్నాడుట. రాణీసహితంగా రేపు దిగబోతున్నాడుట. మనం స్వాగతమివ్వాలట.

కామా: ఆ! ఎంతపని చేశాడు!!

[రామం, సీత తెల్లబోయి ఒకరిముఖాలు ఒకరు చూసుకుంటారు.]

పరం: [మళ్ళీ కుర్చీలో కూర్చుని తల మీద చేతులు పెట్టుకుని] అంతా కర్మ! ఒక్కడినీ సింహాసన మెక్కిద్దామని ప్రయత్నిస్తే మాత్రం ఏమౌతుంది? నా ఆశలన్నీ వమ్ముచేశాడు. అప్రాచ్యుడు ఇంకేం! అఘోరించండి. పాతకొంప, చింకి పేలికలు, మనమూ, మామూలే!

కామా: ఆ...బాగానేవుంది. ఏంచేస్తాం లేవండి! వంటయింది. [అంటూ దిగులుగా లోపలి కెళ్ళిపోతుంది. రామం, సీత ఆమె ననుసరిస్తారు. పరంధామయ్యగారు మెల్లిగా కుర్చీలోనుంచి లేచి విచారంగా దిక్కులు చూస్తుండగా తెరపడుతుంది.] ★



# శ్రీమతి స్లిప్పర్స్

ఆడవాళ్ళతో వచ్చిన తిప్పలివే సుమండీ!
అసలేమయిందంటే—

అయిదారు నెలల క్రితం...ఒక ఆదివారం నాడు...ఉదయంనుండి ఆదేపనిగా వాన పడుతుంది. ఎండ ఎంత తీవ్రంగా ఉన్నా గొడుగు లేకుండా బయటికి పోగలను కాని వాన ఏమాత్రం ఉన్నా అడుగు బయట పెట్టటానికి—గొడుగున్నా సరే - భయమూ, అసహ్యమూ. అదేమిటో అలా అలవాటయింది చిన్నప్పటినుంచీ.

ఆనాటి పేపరు సంపుటి...సంచిక దగ్గర మొదలుపెట్టి సంపాదకుని పేరుదాకా కనీసం రెండుసార్లయినా చదివాను. ఇల్లంతా నాలుసార్లు వెతికాను. చదవని పుస్తకాలేమైనా దొరుకుతాయేమోనని. నా పిచ్చి గాని నేను కొనందే యింట్లో కొత్తపుస్తకాలెలా ఉంటాయ్! శ్రీమతి ఇంట్లో ఏదోపనిచేసుకుంటున్నది! పదిసార్లు పిలవగా వచ్చి పది క్షణాలు నిల్చొని - మొక్కుబడేదో తీర్చుకున్నట్లుగా-పోతూ పోతూ ఓ సలహా ప్రసాదించి పోయింది!

"అంత తోచకపోతే ఏదన్నా వ్రాసుకో రాదూ?"

చదువుకునే రోజుల్లో నాలుగయిదు కథలు వ్రాశాను... ఎరుగున్నవాళ్ళు ముఖంమీదే చీవాట్లు పెట్టారు. ఎరగని వాళ్లు ఉత్తరాలు వ్రాశారు. ఎంత త్వరలో మానుకుంటే ఆంధ్రదేశానికి అంత మంచిదట!

కాని మా శ్రీమతికి మాత్రం నామీద అభిమానం, గౌరవం! నేను చాలా బాగా వ్రాస్తాను అంటుంది...అది ఆమె దృఢవిశ్వాసం. ఆ ఆదివారం కూర్చుని రెండు కథలు వ్రాశాను. చిలుకపచ్చ సిల్కుచీర ఒకటి; సన్నజాజుల నెక్లెస్ మరొకటి. మొదటి కథలో శ్రీమతి బలహీనతను చిత్రించాను; చీరెకు కావాల్సిన డబ్బుందిచేతిలో. తనకు కావాల్సిన చిలుకపచ్చరంగు ఉంది షాపులో. కాని ఆ చీర చీప్ క్వాలిటీ. అయినా ఆ రంగుమీదగల వాంఛకు దాసురాలై ఆ ధరతక్కువచీరే కొంటానికి సంసిద్ధురాలైంది ... కాని అంతమందిలో ఆ చీర కొనే ధైర్యంలేదు; ఇష్టంలేని గులాబి రంగు చీర కొనుక్కొచ్చుకున్నది.

రెండవ కథలో సన్నజాజుల నెక్లెస్ ఎందుకని చేయించుకోలేకపోయిందో వర్ణించాను. జీవితంలో ఏదయినా విలువయిన వస్తువు ఏర్పరచుకోవటానికి ఒకే ఒక్కసారి అవకాశం వస్తుంది. ఆ అవకాశాన్ని సద్వినియోగంచేసుకున్నారా చేసుకున్నట్లు, లేదా వారికి తిరిగి అలాంటి అవకాశం యిక ఆ జీవితంలో లభించదు. శ్రీమతి అలాంటి అవకాశాన్ని దుర్వినియోగమే చేసుకున్నది. సన్నజాజులనెక్లెస్ శ్రీమతికి అందని అందం.. పెట్టుకోవాలనే కోరిక తీరని కోరిక!

## కొండముది హనుమంతరావు

ఒకటి వీక్లీకి, రెండవది డైలీకి పంపించాను. నెల తిరిగేసరికి అచ్చయి కూర్చున్నాయి.

ఇక చూసుకోండి, శ్రీమతి సాధింపు మొదలు.

సాయంత్రం ఆఫీసునించిఇంటికివచ్చాను. శ్రీమతి పందిరిమీద ముసుగు పెట్టుకుని పడుకుని ఉంది. హడలిపోయాను. జ్వరం వచ్చిందేమో. నెలాఖరు. చేతిలో డబ్బుకూడా లేదు మందిప్పించటానికి. అదీగాక నిన్నటికి మూడు రోజులనుండి స్వహస్తం! ఈ రోజే స్నానంచేసి ఇంట్లోకి వచ్చింది. ఈ నెలకి బాధ గడిచిపోయింది. గదా అని సంతోషిస్తుంటే, ఇప్పుడిదేమిటి?

ముసుగు తొలగించి చేయిపట్టుకుచూశాను. చల్లగానే ఉంది. జ్వరమేమీ లేదు. మరి కారణం? నా మెదడుకు అందింది కాదు.

ఒక అరగంట బ్రతిమిలాడాను. శ్రీమతి విషయం కథల్లోకి ఎక్కించినందుకు నిరసన యీ అలుక! సరే శ్రీమతి విధించిన శిక్ష అనుభవించకపోవటం ఎందుకని చన్నీళ్ళ స్నానంచేసి వంట ఉపక్రమించాను. నిప్పు రాజేసి బియ్యం కడగబోతున్నాను.

అంతలోకి శ్రీమతి అమాంతంగా నా చేతిలోంచి బియ్యం గిన్నె లాక్కుంది. శ్రీమతి హృదయం నవనీతం సుమండి! ఇట్టే కరిగిపోతుంది.

ఆ తర్వాత ఒకవారం రోజుల కనుకుంటాను రాత్రిపూట అన్నది.

"శ్రీ శ్రీ తెలివిగలవాడులాగా ఉంది"

"అది నీ ఉద్దేశమా?"

"సబ్బుబిళ్ళ, అగ్గిపుల్ల, కుక్కపిల్ల కవితకనర్హం కాదని ఎంత ధైర్యంగా చెప్పాడో చూశారా?"

రెండుమూడు నెలలక్రితం 'ఏదయినా చదువుకోటానికి పుస్తకం యీయండి' అని అడిగితే డ్రాయరుమీద ఉన్న 'మహాప్రస్థానం' యిచ్చాను. కొన్నిమందులు కొందరికి చాలా ఆలస్యంగా పని చేస్తాయి. అది శరీరతత్వాన్నిపట్టి ఉంటుంది. మహాప్రస్థానం మూడు నెలలకి శ్రీమతిమీద తన ప్రభావాన్ని చూపించింది కాబోలు?

"మొదలుపెట్టిన కథ మానేశారేం?"

శ్రీమతి అనేది నాకర్థం కాలేదు; ఆ రెండు కథలవల్ల శ్రీమతి అంతగా బాధపడిందని నేనాతర్వాత ఏమీ రాయలేదు.

"నేనేం మొదలుపెట్టాను"

"అదేనండి-శ్రీమతి స్లిప్పర్స్ అని ఏదో మొదలుపెడ్తిరిగా?"

అప్పుడు జ్ఞాపకం వచ్చింది. శ్రీమతి స్లిప్పర్స్-అని మొదలుపెట్టానుగాని పూర్తిగా వ్రాయలేదు. మళ్ళీ ఏంతిరుగుబాటు వస్తుందోఅని, బాధపెట్టటం ఎందుకులే అని. పాపం! శ్రీమతి రోజూ ఎదురుచూస్తున్నది కాబోలు పూర్తిచేస్తానని.

నేను 'స్లిప్పర్స్' కథ కనర్హమనే పూర్తి చేయలేదని ఆమె ఉద్దేశం. అందుకే శ్రీశ్రీ ఉపోద్ఘాతం!

"మరి ఆవాడలా వస్నేదో పెద్దగా అవమానించినట్లు అడిగావ్! అన్నాను.

శ్రీమతి చెక్కిళ్ళు కందినయ్...బుంగమూతి పెట్టింది. కోపంవచ్చింది...ఇంట్లోకి విసవిసా పోయింది.

అందుకే మొదట అన్నాను-ఆడవాళ్ళతో వచ్చిన తిప్పలివేసుమండీ! ఇట్టే కోపం వస్తుంది!

మరి కోపం తీర్చాలిగా! కౌగిలం, కలం తీసుకున్నాను.

* * *

కరువులో అధికమాసం అన్నట్లుగా శ్రీమతి చెల్లెలు వివాహం నెలాఖరున వచ్చింది. వందరూపాయలు షాపింగ్ కి కావాలంది. తప్పేదేముంది! ఎవడికాళ్ళో పట్టుకుని వచ్చే నెలజీతంలో తీరుస్తానని చెప్పి అప్పు తెచ్చాను.

తనకు కావాల్సిన చీరలూ, అవీ కొనుక్కున్న తర్వాత స్లిప్పర్స్ కొనాలన్నది- పెళ్ళికి కొత్తవి లేకపోతే పుట్టింటివారు నవ్వుతారట! పల్లెటూరు పెళ్ళికిపోతూ కొత్తవెందుకు, ఆ హడావుడిలో పోతయ్... పెళ్ళికిపోయివచ్చాక కొనుక్కుందువుగాని లే పాతవి వాడుకో-అన్నాను. వింటేగా.

కొత్త స్లిప్పర్స్ కొన్నది. ముఖమల్ స్లిప్పర్స్-రంగు కారునలుపు; శ్రీమతి వాడేది అవే! తనమాట వింటారని నమ్మకమున్న వాళ్ళందరికీ చెప్తుంటుంది—అవే వాడండి అని-రేడియో సిలన్ ప్రకటనలాగా.

రైలుస్టేషనులో దిగాము. మా అత్తవారు స్టేషనుదగ్గఱకు బండి పంపిస్తారనుకున్నాము. పెళ్ళిహడావుడిలో తీరిందికాదు కాబోలు—బండిలేదు, కనీసం మనిషికూడా లేదు. బాడుగకువచ్చే బండ్లుండవు. పల్లెటూరుకదా మరి! ఇంటికిపోయి మనిషినెవరినయినా పంపిస్తాము అని స్టేషనుమాస్టర్ని బ్రతిమిలాడి పెట్టె స్టేషనులో పెట్టించాము.

మావాళ్ళయిల్లు నాలుగు ఫర్లాంగులుంటుంది. నడుద్దాం అని బయల్దేరాం. ఒక ఫర్లాంగు నడిచాం. అక్కడిదాకా కంకర రోడ్డు; బాగానే ఉంది. ఆ తర్వాత మట్టి రోడ్డు. అంతకుక్రితంరోజు వానకురిసిందేమో రోడ్డు తడితడిగా ఉంది. నా చెప్పులు అంతగా మట్టికి అంటుకోని కారణాన నాకు నడక సాగుతూనే ఉన్నది. కాని శ్రీమతి బాధ చూస్తే నాకు నవ్వువచ్చింది.

అనకూడదు కాని యీ చదువుకున్న ఆడవాళ్లున్నారు చూశారూ, పిల్లల్ని కంటారు గాని వాళ్లని పెంచటంమాట అలాఉంచి కనీసం చంకలోనుండి జారిపోకుండా ఎత్తుకోవటమయినా చేతకాదు; ఎంత చదువుకున్నా ఆడంబరం పోదు.

గొప్పకోసం జార్జెట్ చీరె కట్టుకుంది. ఒక పక్కన పమిట జారిపోతున్నది. చంకలోని పిల్లవాడు జారెటుచీరెదవటంవల్ల మరీ జారిపోతున్నాడు. పమిటనూ, పిల్లవాణ్ణి జారిపోకుండా సర్దుకోలేక నానాఅవస్థా పడుతున్నది. పైగా కొత్తస్లిప్పర్స్. నేల తడిగా ఉందని చెప్పానుగదూ...స్లిప్పర్స్ నేల కంటుకుపోతున్నాయి. వేసిన అడుగు తీయటానికి అయిదునిమిషాలు పట్తున్నది.

కళ్ళలో నీళ్ళు గిరగిరా తిరుగుతున్నాయి.

"కొంచెం వీడ్ని తీసుకుందురూ! మరీ చంకలో నిలవటంలేదు వెధవ."

పసివాడు జారిపోవటం వాడి తప్పట! తన చేతకానితనమని అభిమానం ఒప్పుకోనీయదు.

సరే వాడ్ని నేనెత్తుకున్నాను. నా తెలివితక్కువగాని దానికే చేతకానప్పుడు నాకు చేతనవుతుందా?! పోనీ ఆడవాళ్ళు ఎత్తుకునేటట్లు చంకనెత్తుకుందామంటే మనసు ఒప్పటంలేదు. చుట్టుప్రక్కల ఎవరూ లేకపోయినా మొగవాడ్నికదా చూస్తూ చూస్తూ పిల్లవాడ్ని చంకనెలా ఎత్తుకునేది మీరే చెప్పండి. చేతిమీద నిలుస్తేగా, ఊహు!

ఇందాక శ్రీమతి బాధను చూసి నాకు నవ్వు వచ్చినట్లే ఇప్పటి నా అవస్థను చూస్తే శ్రీమతికి జాలి కలిగి ఉంటుంది.

"అలా కాదు. ఒక పని చెయ్యండి" అని పిల్లవాడ్ని నా దగ్గఱ నుంచి తీసుకుని, స్లిప్పర్స్ విప్పి "ఇవి పట్టుకోండి" అన్నది.

చుట్టూ చూశాను. కనుచూపు మేఱలో ఎవరూ లేరు. ఊరు యింకా ఒక ఫర్లాంగు నడిస్తేగాని రాదు.

పట్టుకున్నాను - ఎందుకు పట్టుకోమందో తెలియకపోయినా.

"ఇక నడవండి...ఇద్దరికీ తేలికగా నడక సాగుతుంది"

హతోస్మి!

చేతిలో న్యూస్ పేపరయినా ఉంది కాదు - స్లిప్పర్స్ని చుట్టేందుకు వసుదేవుడంతటివాడే గాడిదకాళ్ళు పట్టుకున్నాడట. అవసరం ఎంతటి పనయినా చేయిస్తుంది. శ్రీమతి కాళ్ళు కాదుగా, కాలిజోళ్లు! ఫర్వాలేదు. నన్ను నేను ఓదార్చుకున్నాను. అంటే నా ఆత్మను నేను మోసగించానన్న మాట.

ఒక ఫర్లాంగు నడిచివచ్చాము. ఊరు వచ్చింది. ఊళ్ళో ఇంకా ఒక ఫర్లాంగు నడిస్తేగాని మా వాళ్ళయిల్లు రాదు.

పల్లెటూళ్ళలో కొత్త వాళ్లెవరయినా రోడ్డుమీద పోతున్నారంటే ఆడా, మొగా అందరూ తొంగి తొంగి చూస్తారు! నాకు సిగ్గుగానే ఉంది-ఏంతమంది నన్ను చూసి నవ్వుకుంటున్నారో! ఒకటి మాత్రం నిజం!- నూటికి పదిమందయినా నన్ను చూసి జాలి పడకపోరు! నా అవస్థ నర్థంచేసుకోకపోరు.

తలవంచుకుని సిగ్గుపడుతూ కొత్తకోడలులాగా నడవాల్సివచ్చింది. శ్రీమతి ఠీవిగా కొత్తల్లుడిలాగా నడిచింది. రోడ్డు మలుపు తిరిగాము. మా అత్తవారియిల్లు కన్పిస్తున్నది. పందిరి, మామిడితోరణాలు, రంగు కాగితాలు. పందిట్లో ఎవరో కూర్చుని ఉన్నారు.

బుద్ధి ఆలస్యంగా పని చేసింది సమయానికి లేనిది.........

స్లిప్పర్స్ శ్రీమతి చేతికిచ్చి పిల్లవాడ్ని నేను తీసుకున్నాను. అవస్థమాట అలా ఉంచి అవమానం తగ్గుతుంది కదా! ఈ పని అసలు ఊళ్ళోకి రాగానే చేయాల్సింది. పోనీ కనీసం ఇప్పుడయినా గుర్తుకు వచ్చింది. కొంతవరకు అదృష్టవంతుణ్ణే - బావమరదుల ఎగతాళినుండయినా తప్పించుకోగలాను!

"ఇదేనా రావటం! ఇంకా బండిపంపిద్దామనుకుంటున్నాను స్టేషనుకి."

పెద్ద బావమఱది పలకరించాడు.

"ఇందాక అక్కయ్య చంకలో పిల్లవాణ్ణీ బావగారి చేతిలో స్లిప్పర్సూ చూసినట్లు గుర్తే!"

చిన్న బావమఱది పరిహాసమాడాడు.

"మొత్తానికి బావ చేత నీ స్లిప్పర్స్ మోయించావన్నమాట. భలే దాని వేసే అక్కయ్యా!"

మఱదలుపిల్ల - పెళ్లికూతురు—పగలబడి నవ్వింది.

నేను వెధవ నవ్వు నవ్వి ఊరుకున్నాను.

* * *

ఆ రాత్రికి పెళ్ళి...ఇల్లంతా పిల్లాజెల్లాతో గోలగా ఉంది. వరండాలో పల్లెటూరి మేళం—చెవులు చిల్లులుపడేలా!

పందిరికి ఓ చివరగా మంచం వేసుకు కూర్చున్నాను. చిన్న బావమరదిని పట్టుకొని

# శ్రీమతి స్లిప్పర్స్

పేపరు సంపాదించాను. తెలుగు పేపరే! పల్లెటూరాయను, ఇంగ్లీషు పేపరు దొరకలేదు. తెలుగుపేపరు చదివితే చదివినట్లే ఉండదు నాకు. అసలు లేనిదానికన్నా నయమేగా. అదేచూస్తూ కూర్చున్నాను.

శ్రీమతి హడావుడిగా పరుగెత్తుకు వచ్చింది.

పిల్లవాణ్ణి మంచంమీద కూలబెట్టేసి స్లిప్పర్స్ విప్పింది.

రాత్రిళ్లా గదిలో జాగ్రత్తగా మన పెట్టె దగ్గిర దాచిపెట్టాను కాని ఇక కుదిరేటట్లు లేదు. మన పెట్టెదగ్గరే ఆ మామావయ్యగారు కూడా తమ పెట్టెలు పెట్టుకున్నారు...మా మామయ్యగారమ్మాయి మనసంతా యీ స్లిప్పర్స్‌మీదే. కాజేస్తుందేమోనని భయంగా ఉంది. పోనీ కాళ్ళకే ఉంచుకుందామంటే మా బామ్మ ఒకతె చాదస్తురాలు. 'అలా ఇంట్లోకి ముచ్చెలతో వస్తావేమే! బయట విడిచిరా' అని కోప్పడుతున్నది... మీకా పుణ్యముంటుంది,"

"సరే ఇక్కడ విడిచి పో...మంచం క్రింద."

"అలా విడిచిపోవటం కాదు. మీరు యిక్కడే కూర్చుంటారని నమ్మకమేమిటీ ...ఎక్కడికి పోతారో ఏమో! మీకాళ్ళకే తొడుక్కోండి...నాకు దిగులుండదు."

హతోస్మి!

చాలవందామన్నా, వదులవుతాయి అందామన్నా వీలులేదు. మా యిద్దరి పాదాలు ఒకటే సైజు! భగవంతుడొకడుంటే ఆడవాళ్ల పక్షమే! లేకపోతే ఏమిటి చెప్పండి—ఒ ఆది పాదాలుగల ఒక మొగవాణ్ణి ఒక ఆడదాన్ని కలపటం! కలిపితే కలిపాడు, యీ పక్షపాతమేమిటి?!

"మరి నా చెప్పులేం చెయ్యమంటావ్?"

సమయానికి బుద్ధి పనిచేసినందుకు సంతోషించాను.

"అయ్యో! ఇంత తెలివితక్కువ వాళ్లేమండి మీరు! మీ చెప్పులు కాజేసేటంత పనికిమాలిన వాళ్ళెవరండీ! నాకంటే మొఖమల్ స్లిప్పర్సాయను ... వాటి పనితనం, షోకూ చూసి అందరి మనసులు చెడిపోతున్నాయిగాని."

"నీకట్లా ఉందికాని, ఎంతలేదన్నా నా చెప్పులు ఇంకో ఏడాది పనిచేస్తాయి"

"అంతగా కాజేస్తే కాజేయనీయండి. వెధవ చెప్పులు...నాలుగు రూపాయలేగా వాటి ధర...ఇంకోజత కొనుక్కొందురుగాని లేద్దురూ మనూరు పోయాక."

తన స్లిప్పర్సు నా కాళ్ళకి తన కళ్ళముందే తొడిగించి చకచకా వెళ్లిపోయింది.

పేపరు చూస్తూ కూర్చున్నాను. కుర్ర వెధవ పీడొకడు, పేపరు చూడనీయడు. పేపరు పట్టుకు లాగుతాడు...చించబోతాడు. పేపరు మడిచి పక్కన పెట్టాను—దాని శ్రేయస్సుకోరి.

"హలో శర్మా! ఇక్కడ ఉన్నావేమిటి?"

ఎవరా అని చూశాను. సంధ్య:—కాలేజీలో మా క్లాస్‌మేట్! రెండు జడలు, లిప్‌స్టిక్, కాళ్ళకు మొఖమల్ స్లిప్పర్స్—నా కాళ్ళకున్న రకమే!

చచ్చిన చావయింది.

"ఓ నువ్వా!"

"అవును ... పెళ్ళికూతురు తరఫు నా ఏమిటి?"

"అవును... పెళ్ళికూతురు నా మరదలే."

"అల్లా చెప్పు...పెళ్ళికొడుకు మా మరిది"

సంధ్య మెడ చూశాను. మంగళసూత్రం కన్పించలేదు. రాళ్ళ నెక్లేస్ మాత్రం జిగేల్‌మంది. పెళ్ళికొడుకు మరిదెలా అయ్యాడో అర్థం కాలేదు.

అడిగి తెల్సుకుందామంటే సంభాషణ పొడిగించాల్సి వస్తుంది. అక్కడ నుంచి సంధ్య త్వరగాపోతే బాగుండుననిపించింది. ఇంకో సమయంలో అయితే త్వరగాపోతే బాధపడేవాణ్ణి. ఎక్కడ నా కాళ్ళస్లిప్పర్స్ చూస్తుందో అని నా ఏడుపు! కాళ్ళు మంచం క్రింద దాచటానికి ప్రయత్నిస్తున్నాను.

"ఏం చేస్తున్నావ్?"

కనిపెట్టింది నా అవస్థ! అసాధ్యురాలు. ఎంత అసాధ్యురాలు కాకపోతే చదవకుండా ఆనర్స్‌లో ఫస్ట్‌క్లాస్ కొట్టేస్తుంది!

"అహ...ఏం లేదు" నీళ్ళు నమిలాను.

"ఖాళీగా ఉంటున్నావా? నిరుద్యోగమా?! "ఆనర్స్ గ్రాడ్యుయేట్!"

హై గుడ్నెస్! ఉద్యోగం సంగతి సంధ్య అడిగింది. తెప్పరిల్లి చెప్పాను-ఏం చేస్తున్నది.

"నువ్వేం చేస్తున్నావ్?"

ఇప్పుడప్పుడే పొయ్యేలా లేదు ... ఏం మాట్లాడకుండా ఉంటే దృష్టి స్లిప్పర్స్ మీదికి పోతుందేమోననే భయంతో అడిగాను.

"క్వైట్ మీనింగ్‌లెస్ క్వెశ్చన్! పిల్లలెంతమందని అడిగితే ఐ ఉడ్‌హేవ్ ఎప్రిషియేటెడ్ యు."

బయటికి కన్పించకుండా దాచిన మంగళసూత్రం చూపించి "లైఫ్‌లో సెటిల్ అయిపోయాను" అన్నది. సంధ్య ఏమీమారలేదు. విచిత్రమైన మనస్తత్వం. వింత వ్యక్తిత్వం! చదువుకొన్న ఆడవాళ్ళు పెళ్ళిళ్ళుకావని భయపడుతుంటారో ఏమో పెళ్ళికాగానే మంగళసూత్రాన్ని-గర్వంగా, చూసినవాళ్లందరికీ కనపడేలా—జాకెట్టుపైనే వేసుకుంటారు; సంధ్య ఎక్కడో దాచుకుంది!

"మీ అబ్బాయా?" పిల్లవాణ్ణి చూస్తూ ప్రశ్నించింది.

"అవును...నీ కింకా పిల్లల్లేరా?"

ఏదో మాట్లాడుతూ ఉన్నానే గాని సంధ్య ఎక్కడ నా కాళ్ళ స్లిప్పర్స్ చూస్తుందోనన్న భయం క్షణక్షణానికి పెరిగిపోతున్నది.

"అంత తెలివితక్కువదాన్ని కాదు."

పిల్లల్ని కంటం తెలివితక్కువా? ఆ 'మానవుడు' ఎల్లా వేగుతున్నాడో?

"ఇక్కడ ఒక్కడివీ ఏం కూర్చుంటావ్. విడిదింటికి పోదాం. రా. మావార్ని ఇంట్రడ్యూస్ చేస్తాను"

చచ్చాంరా భగవంతుడా! పెద్దపరీక్షే! చెమటలు పోసినాయి.

"సాయంత్రం వస్తానులే"

"ఇప్పుడు రావటానికి ఏమిటి నీ అబ్జెక్షన్"

నా అభ్యంతరం నేనెలా చెప్పేది. నా అభ్యంతరం ఆమెకు తెలియకూడదు గదా! తెలియచెప్పేపక్షంలో పోనే పోవచ్చును!

"అహఁ ఏం లేదు. సాయంత్రం వస్తానన్నానుగా?"

"పోనీ మీ శ్రీమతిని చూపించు...దానికీ అభ్యంతరమా?"

ఇక తప్పేటట్లు లేదు.

"లే! త్వరగా! మళ్ళీ నేను పోవాలి."

లేచి నిల్చున్నాను. నేననుకున్నంతా అయింది. సంధ్య దృష్టి స్లిప్పర్స్‌మీదికి పోయింది.

పగలబడి నవ్వింది. పొట్ట చెక్కలవుతుందేమో ననిపించింది. నిలబడి నవ్వలేక కూలబడి మరీ నవ్వింది!.

"హాహ్హాహా....ఆ...డే...మి...టి ఆడ..వాళ్ళ...స్లిప్పర్స్"

నేను మాట్లాడలేదు...ఏడుపూ, కోపం రెండూ పోటీపడుతున్నాయి.

"మీ...శ్రీమతివా?"

...............

"పెళ్ళిసందట్లో పోతాయని మీకు తొడిగి ఉంటుంది. అంతేనా?"

"అవును" ఒప్పుకున్నాను. కాని వాదించటం తెలివితక్కువ!

"అసాధ్యురాలే! మీ శ్రీమతిని తప్పక చూడాలి! పద."

"అక్కయ్యా! బావ రమ్మంటున్నాడు" అంటూ ఒక అయిదేళ్ళ కుర్రాడు అంతలోకి వచ్చాడు.

"సాయంత్రం కన్పిస్తానులే శర్మా! మీ ఆవిడని చూపిద్దువుగాని".

ఆ పిల్లవాడు నన్ను దేముడిలాగా వచ్చి రక్షించాడు. (పిల్లలు దైవసమానులంటారు–ఇందుకే కాబోలు) లేకపోతే మా శ్రీమతిని చూపించటానికి యీ స్లిప్పర్స్ తొడుక్కుని ఆడవాళ్ళమధ్యకి సంధ్యను తీసికెళ్లవలసి వచ్చేది!.

ఇంత నవ్వులపాలు చేసిన స్లిప్పర్స్‌మీద మహాచెడ్డకోపం వచ్చింది—విసిరి పుచ్చుకుని అవతల పారేద్దామనిపించింది. కాని చూస్తూ చూస్తూ అంత ధరపెట్టి కొన్నవి పారేయలేకపోయాను. అదీగాక శ్రీమతి అలిగిందా—ఇక నాకు ఆ ఊళ్ళో మంచినీళ్ళు కూడా పుట్టవు! భయపడ్డాను.

ఏం చేద్దామా అని అయిదు నిమిషాలు ఆలోచించాను. మంచి ఉపాయం తట్టింది.

చుట్టూ చూశాను. దగ్గరలో ఎవ్వరూ లేరు. స్లిప్పర్స్ విప్పి ఎదురుగా ఉన్న తాటాకుల దడిలో దోపాను—మంచంమీద కూర్చుంటే కనపడేటట్లుగా.

పిల్లవాడు ఏ బుద్ధిన ఉన్నాడో గోల చేయకుండా కూర్చున్నాడు. పేపరు చూడటానికి అవకాశం చిక్కిందికదా అని పేపరు తీశాను. కాని ఏం లాభం చిత్తం శివుడిమీద, భక్తి చెప్పులమీద అన్నట్లు ఉంది నా పరిస్థితి. పేపరే చూస్తానా? స్లిప్పర్స్‌కి కాపలాయే కాస్తానా?.

పదిగజాల్లో మా తోడల్లుడు రమణరావు కన్పించాడు. ఇటే వస్తున్నాడు. రాకుండా ఉంటే బాగుండుననిపించింది. వస్తే నా అవస్థ అతనుకూడా తెలుసుకుని పోతాడేమోనని నా బాధ! ఆ బాధలో చాలా నీచంగా ఆలోచించాను. నావరకు నాకే సిగ్గేసింది. నా ఆలోచనకు పేపరు చూస్తున్నట్లు తల తిప్పుకున్నాను.

"ఏమండీ శర్మగారూ! కులాసానా?"

ఆయనే పలకరించాడు.

"రండి...రండి ఎప్పుడు వచ్చారు?"

"ఇప్పుడే ఒకగంట అయింది."

"అందరూ బాగున్నారా?"

కుశల ప్రియాలంటే యివేకాబోలు!

ఎలాగో పేపరు సంపాదించినట్లున్నారే!"

పేపరు యిచ్చాను ఆయనకు. పేపరు చూస్తుంటే నా అవస్థ గమనించలేదు.

ఆయన పేపరులో మునిగిపోయాడు. రెండుమూడు నిమిషాలు నిశ్శబ్దంగా భారంగా గడిచినయ్.

స్లిప్పర్స్‌ని పసికట్టిందిలాగుంది - కుక్క ఒకటి తాటాకుదడి దగ్గర తారట్లాడుతున్నది. నోటకరుచుకు పోతుందో ఏమో తిప్పలు!

"ఏమిటండోయ్! అంత తదేకంగా చూస్తున్నారు?"

ఆయన నోటీస్ చేశాడు.

"ఆఁ! ఏంలేదు."

"పట్టుచీరె లేమయినా కన్పడుతున్నాయేమిటి?"

మైగుడ్నెస్! ఈయన నన్నపార్థం చేసుకుంటున్నాడు.

"కుక్క బాగుంటేను చూస్తున్నాను."

పచ్చిఅబద్ధం! అది గజ్జికుక్క! 'ప్రాణమాన విత్తభంగంబులం దబద్ధం ఆడితే తప్పులేదుగామరి!

"అంతేగదా...ఇంకేమయినా..."

చివర మింగాడు. సన్నగా నవ్వుతూ. తిరిగి పేపర్లో మునిగిపోయాడు.

దానిదుంపతెగ! ఆ కుక్క యింకా అక్కడే తారట్లాడుతున్నది. ఎగిరింది... అందలేదు...రెండోసారి బలంకొద్ది ఎగిరింది...అందుకున్నది నోటకరుచుకు పోతున్నది అరెరె! ష్!!

దాన్నికొట్టి ఆస్లిప్పర్స్ తీసుకుందామంటే ఈయనముందు నవ్వులపాలు కావలసివస్తుంది! కొట్టకపోతే అది వాటిని తీసికెళ్ళి 'స్వాహా' చేస్తుంది. శ్రీమతి నన్ను...

హామ్లెట్ కూడా ఇంతకఠినమైన సమస్య నెదుర్కొని ఉండడు!!

కుక్క నోట కరుచుకుపోయింది—నేను నోరు తెరుచుకు చూస్తూ ఊరుకున్నాను.

రమణరావుగారు పేపరు మడుస్తూ—

"ఒక్కరే ఏం కూర్చుంటారు రండి... అక్కడ మనవాళ్ళందరూ పేకాడుకుంటున్నారు...మనచేతులు కూడా కలుపుదాం రండి" అన్నారు.

స్లిప్పర్స్‌గొడవ వదిలింది. పోయి ఆడుకుంటే బాగానే ఉంటుంది. కాని శ్రీమతి వచ్చి చూస్తుంది. నా కాళ్ళకి స్లిప్పర్స్ కన్పించవు. 'ఏమయినయ్' అని అడుగుతుంది. నేను చెప్పకా తప్పదు. అంతమందిలో అవమానమూ తప్పదు...

"నేను రానులే, మీరు పదండి."

రమణరావుగారు వెళ్ళిపోయారు.

ఇంకో పదో పదిహేను నిమిషాలలో శ్రీమతి వస్తుంది...వచ్చింతర్వాత...

(33-వ పేజీ చూడండి)

# నక్షత్ర ఫలితాలు

## ( 11-12-57 మొదలు 17-12-57 వరకు )

### గ్రహస్థితి

| | శ | | |
|---|---|---|---|
| | తే 13దీన కుజుడు వృశ్చికమునకు మారును. తే 15 దీన రవి ధనస్సులో ప్రవేశించును. తే 16 దీని బుధ వక్రారంభము. కర్కాటక, సింహ, కన్యా తులలలో చంద్రుడు. | | |
| కు | | | |
| బు | ర శు | కు గు రా | |

### *అశ్విని [చూ, చే, చో, లా]*

మీ బుద్ధిబలమువల్లను, పెద్దల సహాయము వల్లను, గత రెండువారములనుండీ మీకు కలిగిన చిక్కులు, గడిచి శుభయోగమును పొందుతారు. మిత్రులను కలిసికొనుట, కార్యసాధన, శుభ వార్తలు వినవచ్చుట మొదలగు మంచి ఫలితాలు కలుగుతాయి. విద్యార్థులు కొత్త విషయాలు నేర్చుకుంటారు. కుటుంబమందుండువారి ఆరోగ్యము సరిఅవుతుంది. 11, 12, 13 తేదీలలో ప్రయాణమువల్ల శ్రమ, అధికఖర్చులు. 14, 15 తేదిలలో కార్యానుకూలత, మిత్ర లాభము. 16, 17 తేదీలలో ఆందోళన. కవులకు, చిత్రకారులకు, నటీనటులకు మేలు.

### * భరణి [లీ, లూ, లే, లో] *

కొంతకాలమునుండి విడవకుండావున్న చిక్కుసమస్యలు ఈ వారము పరిష్కారానికి వస్తవి. నూతనవ్యక్తుల పరిచయం కలుగుతుంది. పిల్లల శుభకార్యములను గురించి ఆలోచనలు చేస్తారు. ఆర్థికస్థితి బాగుపడుతుంది. పిల్లలకు అలంకారప్రాప్తి. పండితులకూ, న్యాయవాదులకూ మేలుకాలము. 11, 12, 13 తేదిలలో ఉద్యోగస్తులకు ఒత్తిడి; వర్తకులకు ఆందోళన కలుగునుగాని 14, 15 తేదిలలో శుభయోగము, కార్యానుకూలత. 17 వ తేదిని అశాంతి.

### *కృత్తిక [అ, ఈ, ఉ, ఏ]*

ఈ వారము మీ యోచనా శక్తివల్ల పలుకుబడిని ఉపయోగించుకుని అవరోధములను సాధించి మేలు పొందుతారు. కోర్టు వ్యవహారములో గెలుపు వస్తుంది. ఉద్యోగస్తులకు మంచికాలము. వెండి వర్తకులకు లాభము. విద్యార్థులు కొత్త సంగతులు నేర్చుకుంటారు. కవులకూ, కళాకారులకూ, నటీనటులకూ యోగకాలము. 11, 12, 13 తేదీలలో కార్యభంగమువల్ల శ్రమ. 14, 15, 16 తేదీలలో ప్రయాణము, కార్యలాభము. 17వ అస్వస్థత.

### *రోహిణి [ఓ, వా, వీ, వూ]*

ఈ వారము మిత్రులతో కలసి వినోదములలో పాల్గొంటారు. శుభకార్యములను గురించి ఆలోచనలు చెస్తారు. వాహన యోగము వుంది. ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులు లాభము పొందుతారు. నూలు, వస్త్రాల వ్యాపారస్థులకు లాభము. కవులకు, గాయకులకు, నటీనటులకు మేలుకాలము. 11, 12, 13 తేదీలలో అధిక ఖర్చులు, కార్యభారముచే శ్రమ. 14 15, 16 తేదిలలో మిత్రులను కలుసుకొనుట, వినోదము, శుభకార్యచింత. 17 తేదిని అశాంతి. వారమంతయూ విద్యార్థులకు ఉత్సాహము.

### * మృగశిర [వే, వో, కా, కీ]*

మీ ఆదాయమును వృద్ధిచేసుకొనుటకు కావించే ప్రయత్నాలు ఫలించవు. కార్యభారము ఎక్కువ. అకాలభోజనమువల్ల ఆరోగ్యము చెడుతుంది. పితృవరమువల్ల ఆశించినంత సహాయము కలుగకుండుటచే గృహావసరములు తీరక కలతలు వస్తాయి. విద్యార్థులకు చదువుపై శ్రద్ధ తక్కువ. 11, 12, 13 తేదిలలో కార్యభంగము. మనో వ్యథచే అస్థిమితము. 14, 15, 16 తేదీలలో కొద్దిగా అనుకూలత. 17వ అనారోగ్యము.

### * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఆశించిన ధన సహాయము సమయానికి రాకపోవుటచే తలపెటిన పనులు జరగక చింత పొందుతారు. గృహకలతలు వస్తాయి. అయిననూ మీకు విరుద్ధముగా వున్నట్టు అనుమానపడిన వ్యక్తి సహాయమున కార్యానుకూలత అయి ఊరట కలుగుతుంది. దూరమందున్న ఆప్తుల ఆరోగ్యమును గురించి ఆరాటపడుతారు. ఉద్యోగస్తులకు మొదట్లో కలిగే కొందరలు క్రమేణా సర్దుకుంటాయి. 11,12,13, తేదిలలో కార్యభారము, శ్రమ, అధిక ఖర్చులు 14,15,16 తేదీలలో మిత్రసమాగమము, కార్యలాభము. విద్యార్థులకు చదువుపై శ్రద్ధ తక్కువ. 17వ తేదీని ఆరాటన.

### * పునర్వసు [కే, కో, హా, హీ,] *

ఈ వారము మిశ్రమయోగము. కార్యాచరణలో ఆటంకములు కలుగుతాయి. బుద్ధిబలమును ప్రయోగించి కార్యసిద్ధికి ప్రయత్నిస్తారు. ఈశ్వరానుగ్రహమువల్ల అన్నీ సాధ్యపడతాయనే ధైర్యముతో వుంటారు. ఉద్యోగస్తులకు అస్థిమితము. వర్తకులకు ఆందోళన. 11,12,13 తేదిలలో నిలకడలేని స్థితి, శ్రమ 14,15,16 తేదిలలో ప్రయాణము. ఆత్మవికాసము. స్వల్ప లాభము, 17న అస్వస్థత.

### *పుష్యమి [హూ, హే, హో, డా]*

ఈ వారము కార్యభారము అధికమవుతుంది. ఖర్చులు ఎక్కువ. అనుకున్నట్టుగా డబ్బు చేతికి రాకపోవుటచేత అశాంతి కలుగుతుంది. కోర్టుకచేరీవ్యవహారము కొంతమటుకు అనుకూలిస్తుంది. ఉద్యోగులకు అధికారుల ఒత్తిడి. వర్తకులకు అశాంతి. భార్య ఆరోగ్యము చెడేసూచన లున్నవి. ఇచ్చిపుచ్చుకొనుటలో నీచస్త్రీలతో తగాదాలు. విద్యార్థులకు అనాసక్తి. 11,12,13 లలో కార్యభారము, త్రిప్పట, శ్రమ, వివాదములు. 14,15,16 తేదిలలో కొంతలాభము, శాంతి. 17 వ భార్యకు అనారోగ్యము.

### *ఆశ్రేష [డి, డూ, డే, డో]*

శ్రమకలిగే పనులు మొదలుపెట్టి నిరాశ చెందినప్పటికే తోబుట్టువుల సహాయముచే సాధించుతారు. అవసరములు తీరనందున గృహకలతలు వచ్చును. ఉద్యోగులకు అధికారుల చురుకు మాటచే మనస్సు కలతపడుతుంది. లోహపు సామానులు, రంగుల వ్యాపారస్థులకు లాభము. 11, 12, 13 తేదిలలో కార్యభంగము, నిరాశ, అశాంతి. 14, 15, 16 తేదిలలో ప్రయాణము, సోదరసహాయము. 17 వ ప్రమాదసూచన.

### * మఖ [మా, మీ, మూ, మే] *

ఈ వారము పదోదాలో నుండువారి సహాయముచేతనూ మీ ప్రజ్ఞచేతను కార్యసాధన అవుతుంది. మిత్రులను కలుసుకొనుట, సంతోషవార్త వినుట మొదలగు శుభఫలములు కలుగుతాయి. కుటుంబములో వారి

ఆరోగ్యముబాగుపడుతుంది. విద్యార్థులుకొత్త విషయాలు నేర్చుకుంటారు. డాక్టర్లకూ, మందుల వర్తకులకూ లాభము. 11, 12, 13 తేదీలలో కార్యాచరణలో త్రిప్పట, అశాంతి. 14, 15, 16 తేదీలలో ప్రయాణము, కార్యసిద్ధి. 17 న మనోవ్యథ.

### * పూర్వ ఫల్గుణి (పుబ్బ) *
### [ మో, టా, టీ, టూ ]

ఈ వారము విజ్ఞానులవల్ల కొత్త సంగతులు తెలుసుకుంటారు. కోర్టు వ్యవహారములు మధ్యవర్తులద్వారా పరిష్కారమై రాజీ పడతారు. పిల్లల అభివృద్ధికొరకు ప్రయత్నాలు చేస్తారు. విద్యార్థులు శ్రద్ధగా విషయాలు నేర్చుకుంటారు. పండితులకూ, కళాకారులకూ, న్యాయవాదులకూ మంచి కాలము. 11, 12, 13 తేదీలలో కార్యసాధనలో త్రిప్పట. శ్రమ, అనుకూలత. 14, 15, 16 తేదీలలో ప్రయాణమువల్ల లాభము, బంధుసమాగమం, శుభకార్యచింత. 17 న అస్వస్థత.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### [ టే, టో, పా, పి ]

ఈ వారము మీ ఆర్థికస్థితి బాగుపడుతుంది. బంధుమిత్రులతో వినోదాల్లో పాల్గొంటారు. ఉద్యోగస్థులకూ అధికారుల ఆదరణ కలుగుతుంది. వెండి వస్తువుల వ్యాపారస్థులకు మోసగిస్తుంది.కుటుంబమందుండువారి ఆరోగ్యము సరియవుతుంది. కళాకారులకు, కవులకు, గాయకులకు మేలుకాలము. 11, 12, 13 తేదీలలో అధిక ఖర్చులు, త్రిప్పట, శ్రమ. 14, 15, 16 తేదీలలో ప్రయాణము, బంధుదర్శనము, కార్యలాభము. 17 న అనారోగ్యము.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము మీ హోదా పెరుగుతుంది. బంధుమిత్రులతో కలసి విందుభోజనము ఆరగిస్తారు. కవులు, గాయకులు మొదలగు కళాకారులతో వినోదిస్తారు. ఉద్యోగస్థులకు మంచికాలము. బట్టల వ్యాపారస్థులకు లాభము. విద్యార్థులకు ప్రోత్సాహకరముగా వుంటుంది. బంధులతో పిల్లల శుభకార్యాలోచన చేస్తారు. 11, 12, 13 తేదీలలో కార్యాచరణకు ఎక్కువ ఖర్చులు, త్రిప్పట, అలసట. 14, 15, 16 తేదీలలో ప్రయాణము, కార్యలాభము, శుభకార్యాలోచన. 17 న ప్రయాసము.

### *చిత్త [పే, పో, రా, రి]*

ఈ వారము పితృవర్గమువల్ల పొందిన సహాయముతో అవసరాలు తీరనందున అసంతృప్తి కలుగుతుంది. ఆర్థికాభివృద్ధికిచేసే ప్రయత్నాలువల్ల ఆశాభంగము చెందుతారు. కార్యభారముచే వేళతప్పిన భోజనమువల్ల ఆరోగ్యము చెడుతుంది. శ్రద్ధవహించడం మేలు. కొత్త సమస్యలు తలెత్తుటచేత ఉద్యోగస్థులు ఆరాటనపడతారు. వర్తకులకు ఒడిదుడుకులు కలుగుతాయి. 11, 12, 13 తేదీలలో కార్యభారముచే త్రిప్పట; అశాంతి. 14, 15, 16 తేదీలలో ప్రయాణము. స్వల్పయోగం. 17 న అనారోగ్యము.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈ వారము అనుకున్న పనులు జరగక, ఆశించిన సహాయము కలుగక, గృహకలతలవల్ల మనోవ్యథపొందినను వారాంతమునకు మిత్రసహాయముచే కార్యసాధనకలిగి శాంతి పొందుతారు. గృహమందుండు వృద్ధుల ఆరోగ్యము చెడుతుంది. ఉద్యోగస్థులకు మొదట్లో ఒత్తిడి, క్రమేణా అధికారుల ఆదరణ కలుగుతుంది. విద్యార్థులకు చదువుమీద అశ్రద్ధ. 11, 12, 13 తేదీలలో కార్యవిఘ్నము, శ్రమ, అధికఖర్చులు. 14, 15, 16 తేదీలలో మిత్రసహాయముచే కార్యసిద్ధి. 17 న ఆరోగ్యచింత.

### *విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈ వారము మిశ్రమఫలములు కలుగును. కార్యహానివల్ల గృహకలతలు కలిగి నిరుత్సాహ పరిస్థితులు ఏర్పడుతాయి. అయినప్పటికీ, పుణ్యకార్యాచరణ, ఆధ్యాత్మికచింతలవల్ల శాంతిని పొందుతారు. కుటుంబములోనివారి ఆరోగ్యముగురించి కలవరపాటు కలుగుతుంది. వ్యాపారస్థులకునిరాశగా వుంటుంది. నటీనటులకు ఇప్పటికన్న రెండు వారముల తరువాత యోగము. 11, 12, 13 తేదీలలో కార్యహానివల్ల అశాంతి త్రిప్పట. 14, 15, 16 తేదీలలో సాధుసాంగత్యమువల్లపుణ్యకార్యాచరణ,శాంతి,ఉద్యోగస్థులకు కొంత అనుకూలత.

### *అనూరాధ [నా, నీ, నూ, నే]*

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. కార్యభారము అధికముగుటవల్ల శ్రమ. కోర్టుకచేరీ వ్యవహారములు కొంత అనుకూలిస్తవి. ఇచ్చిపుచ్చుకొనేపట్ల దుష్టస్త్రీలతో వివాదము, మనోవ్యథ. భార్యకు అనారోగ్యము. 11,12,13 తేదీలలో కార్యభంగము, వివాదము. 14, 15, 16 తేదీలలో త్రిప్పట, కార్యానుకూలత. 17 న ఆరోగ్యచింత. విద్యార్థులకు బద్ధకము.

### *జ్యేష్ఠ [నో, యా, యి, యూ]*

ఈ వారము మీ సామర్థ్యము నంతటినీ ఉపయోగించి కార్యాచరణకు మొదలుపెట్టిననూ ఫలము కలుగదు. అయిననూ నిరుత్సాహపడకుండా ప్రయత్నిస్తూనే వుంటారు. అందువల్ల క్రమేణా కష్టములు గడిచి మేలు పొందుతారు. సోదరసహాయముతో చాలావరకూ ఒడిదుడుకులు సర్దుబాటు అవుతాయి. ప్రమాదములవల్ల దెబ్బలు తగులుతాయి. జాగ్రత్తవల్ల తప్పించుకోవచ్చును. 11, 12, 13 తేదీలలో అస్థిమితము, త్రిప్పట. 14, 15, 16 తేదీలలో ఆదాయవృద్ధి, సహాయము, కొంత ఊరట. 17 న ప్రమాదము.

### *మూల [యే, యో, బా, బీ]*

ఈ వారము అధికారములో నుండువారి సహాయమువల్లను, స్వశక్తిచేతను కార్యానుకూలత పొందుతారు. కొత్తవారితో పరిచయము కలుగుట, శుభవార్తలను వినుట మొదలగు మంచి ఫలితాలు కలుగుతాయి. దూరమందున్న ఆప్తబంధువుల క్షేమవార్త వస్తుంది. ఉద్యోగస్థులు అధికారుల ఆదరణ పొందుతారు. మందుల వ్యాపారస్థులకూ, వైద్యులకూ లాభం. గణితశాస్త్రజ్ఞులకూ, శిల్పులకూ, కవులకూ, కళాకారులకూ యోగకాలము. 11, 12, 13 తేదీలలో కార్యాచరణవల్ల త్రిప్పట, శ్రమ. 14, 15, 16 తేదీలలో ప్రయాణము, అధికారుల సహాయము,

## ధరలు

నూలు, వస్త్రములు:- మందముగా వుండును.

నూనెదినుసులు: మందమగును.

పంచదార, చింతపండు :-నిలకడగా వుండును.

బెల్లము:- స్వల్పముగా హెచ్చును.

ఆహారధాన్యములు:- సమస్థాయి నుండును.

పప్పుదినుసులు: మార్పులేదు.

వెండి, బంగారము : నిలకడగా వుండును.

దక్షిణదేశమున వర్షించును. అచ్చటచ్చట వాయుపీడ కలుగును.

జన్మనక్షత్రమునుబట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారివారి పేర్లననుసరించి పేరు మొదటి అక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. కృష్ణుడను పేరునకు మృగశిరానక్షత్రమును, వృష్ణుడను పేరునకు స్వాతియును, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.

 

# నక్షత్రఫలితాలు



మిత్రదర్శనము, లాభము. 17 న అస్వస్థత. విద్యార్థులకు నూతన విజ్ఞానము.

***పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢ]***

ఈ వారము మీకుయోగకాలము. గ్రంథపఠనవల్ల, పండితగోష్ఠివల్ల జ్ఞానాభివృద్ధి చేసుకుంటారు. యత్నకార్యాలు ఫలిస్తాయి. భార్యాబిడ్డలతో సుఖముగా గడుస్తుంది. పిల్లలకు అభివృద్ధి కలుగుతుంది. విద్యార్థులకు చదువు చురుకుగా సాగుతుంది. ఉద్యోగస్తులకు గతవారం కలిగిన మనోవ్యథ తీరుతుంది. ఆర్థికస్థితి బాగుపడుతుంది. న్యాయవాదులకు, పండితులకు, కళాకారులకు యోగకాలము. 11, 12, 13 తేదీలలో త్రిప్పటవల్ల శ్రమ కలిగినను కార్యసిద్ధి. 14, 15, 16 తేదీలలో ప్రయాణము, పండితగోష్ఠి, లాభము. 17 న శ్రమ.

***ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]***

ఈ వారము మీ ఆర్థికస్థితి బాగుంటుంది. యత్నకార్యాలు అనుకూలిస్తాయి. మిత్రులతో వినోదములలో పాల్గొంటారు. దూరప్రదేశమ్మునుండి శుభవార్త వింటారు. వెండి వ్యాపారస్థులకు లాభము. విద్యార్థులకు నూతనోల్లాసము కలుగుతుంది. కవులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 11, 12, 13 తేదీలలో కార్యభారమువల్ల త్రిప్పట, అశాంతి. 14, 15, 16 తేదీలలో ఆర్థికలాభము, కార్యసిద్ధి. 17 న అస్వస్థత.

***శ్రవణము [జూ, జే, జో, ఖా]***

ఈ వారము యోగప్రదము. ధనాదాయము వృద్ధి అవుతుంది. ధర్మకార్యాచరణలో నిమగ్నులౌతారు. కోర్టు వ్యవహారములు శుభముఖమవుతాయి. వాహనయోగము కలుగుతుంది. బంగారము వ్యాపారస్థులకు, బట్టల వర్తకులకు లాభము. శుభకార్యముల గురించి ఆలోచనలు చేస్తారు. విద్యార్థులు ఆసక్తిగా ఉంటారు. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 11, 12, 13 తేదీలలో కార్యాచరణవల్ల శ్రమ. 14, 15, 16 తేదీలలో ప్రయాణము, బంధుదర్శనము, కార్యలాభము, విందుభోజనము. 17 న అశాంతి.

*** ధనిష్ఠ [గా, గీ, గూ, గే] ***

మీ ఆర్థికాభివృద్ధికి చేసేపనులు విఫలమవుతాయి. పితృవర్గమునుండి వచ్చిన సహాయం వల్ల అవసరాలు తీరక గృహకలతలువస్తాయి. కార్యభారముచే శరీరస్థితి, మానసికస్థితి అసంతృప్తికరముగా వుంటుంది. ఉష్ణాధిక్యముచే ఆరోగ్యము చెడుతుంది. ఇంటికి శ్రద్ధవహించండి. ఉద్యోగస్తులను కొత్త సమస్యలు ఎదుర్కొంటాయి. వర్తకులకు ఆందోళన. 11, 12, 13 తేదీలలో త్రిప్పట, కార్యభంగము, అశాంతి. 14, 15, 16 తేదీలలో స్వల్పలాభము. 17 న అనారోగ్యము.

***శతభిషం [గో, సా, సీ, సూ]***

ఈవారము సకాలములో ధనాదాయము కలుగక తలపెట్టిన పనులు నెరవేరక వ్యథ కలుగుతుంది. ప్రతికూలుడని మీరు అపోహపడేవ్యక్తి సహాయమువల్ల కార్యానుకూలత పొందుతారు. వ్యాపారస్థులకు మొదట్లో ప్రతికూలముగా వుండి వారాంతమున లాభి



'జూలియస్ సీజర్' నాటకంలోని మార్క్ ఆంటొనీ భూమికను, ఏకపాత్రాభినయ ప్రదర్శనంలో నిర్వహించి ప్రశంసలందుకొన్న యువనటుడు రాళ్ళభండి కామేశ్వరరావు. ఈ ప్రదర్శనం ఇటీవల పెరంబూరులో జరిగింది.

స్తుంది. విద్యార్థులకు చదువుమీద శ్రద్ధ తక్కువ. 11, 12, 13 తేదీలలో అధిక ఖర్చులు, ఆశాభంగము, శరీరాయాసము, 14, 15, 16 తేదీలలో ప్రయాణము, విందు సహాయము, కార్యానుకూలత. 17 న అనారోగ్యము.

***పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]***

ఈ వారము యత్నకార్యములు ఫలవంతం కావు. కోరిన సహాయముకూడా లభించదు. అవసరములు తీరక గృహకలతలు వస్తాయి. అయినప్పటికీ ఈశ్వరసహాయమువల్ల అన్ని కష్టములు గడుస్తాయని పుణ్యకార్యాచ



కడపజిల్లా నూకనపల్లె గ్రామములో జిల్లా కాంగ్రెస్ సభ్యురాలు శ్రీమతి బోదవపు సుబ్బమ్మ.

రణలో పాల్గొని, ధైర్యపడుతారు. 11, 12, 13 తేదీలలో వర్తకులకు త్రిప్పట, ఆశాభంగము కలిగినను వారాంతమున యోగించును. 14, 15, 16 తేదీలలో ఉద్యోగస్తులకు అనుకూలము. 17 వ తేదీని గృహమందుండు వారి ఆరోగ్యమునుగురించి ఆరాటన.

***ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా] ***

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. కార్యభారముచే అధికమైన శ్రమ, అశాంతి. కోర్టువ్యవహారములు అనుకూలముగా వుంటాయి. వ్యవహారముపట్ల దుష్టస్త్రీలతో వివాదముకలిగి ఖేదపడతారు. భార్యకుగాని గృహమందుండు ఇతర స్త్రీలకుగాని ఆరోగ్యభంగము. 11, 12, 13 తేదీలలో ఆర్థిక ఒత్తిడి, కార్యభారముచే త్రిప్పట, అశాంతి. 14, 15, 16 తేదీలలో ప్రయాణము. స్వల్పలాభము. 17 న ఆరోగ్యచింతచే వ్యథ.

*** రేవతి [దే, దో, చా, చీ] ***

ఎక్కువ శ్రమగలిగే పనులు సాహసముతో పైనవేసుకొని కార్యసాధన కానప్పటికీ నిరాశపొందక ధైర్యముతో వ్యవహరిస్తారు. అదే మంచిపద్ధతి. సోదరసహాయమువల్ల కొంత ఇబ్బంది తీరుతుంది. అధికారుల అనాదరణచే ఉద్యోగస్తులకు వ్యథ. గృహకలతలవల్ల అశాంతి. యంత్రములవల్లగాని, పనిముట్లవల్లగాని ప్రమాదము. 11, 12, 13 తేదీలలో త్రిప్పట, శ్రమ, అశాంతి. 14, 15, 16 తేదీలలో ఖనిజ, లోహములతో వ్యాపారము చేయువారికి లాభము, 17 న అస్వస్థత.

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక



## సంక్రాంతి ప్రత్యేక సంచిక

[15-1-1958]



ప్రధానాకర్షణ

**సినిమా శీర్షిక**

చలనచిత్ర కళకు, పరిశ్రమకు సంబంధించిన
ప్రత్యేక వ్యాసాలు — చిత్రాలు



రసవంతమైన కథలు, గేయాలు
రమణీయమైన చిత్రాలు, ఫొటోలు



"వనితాలోకం" శీర్షికలో
ప్రత్యేక వ్యాసాలు — చిత్రాలు



ముగ్గులు — డిజైన్లు

రచనలు, చిత్రాలు అన్నిటిపైనా "సంక్రాంతి సంచికకు" అని వ్రాయాలి.



**1957 డిసెంబరు 15 లోగానే మాకు చేరాలి.**

"అబ్బబ్బ. నన్ను చంపకు శైలా! ఆ పుస్తకాలకు నాకు సహ్రాముడల దూరం. మరేదయినా చెప్పు. నిముషాలమీద విజయం సాధిస్తాను."

"అలా అనకండి. జీవితంలో మరేమీ మిమ్మల్ని కోరను. ఇది ఒక్కటే నాకోసం చెయ్యండి. మిమ్మల్ని యేమీ కష్టం చెయ్యమనటం లేదుగా. చక్కగా చదువుకోమంటున్నాను. కావాలంటే నేను సాయం చేస్తాను. నా యీ ఒక్క కోరికా ముద్దుగా చెల్లించండి." శైలజ ప్రాధేయపూర్వకంగా అడిగింది.

"నన్నలా ప్రాధేయపడకు. సంవత్సరంక్రితం గిరాట్టు కొట్టిన పుస్తకాలు మళ్ళీ తీసుకుని యిప్పుడు చదవాలంటే యెంత కష్టమో నీకు తెలియదు. అయినా యిప్పుడు నేను బి.ఎ. కాకపోతే మటుకు యేం? వచ్చిన లోటు యేమిటి? నువ్వు బి. ఎ. విగా. నాక దిచాలు." శ్రీధర్ భార్యమీద విసుక్కుంటూ అన్నాడు.

"నా పందెం గురించి తెలిస్తే మీరలా మాట్లాడరు" శైలజ తల వంచుకుని అంది.

"ఏమిటాపందెం?" వంగిన శైలజముఖాన్ని తనివిదీరా చూస్తూ అడిగాడు. శైలజ చెప్పటం మొదలు పెట్టింది:

"అన్నయ్యా, నేనూ ఒక రోజున వాదనలో పందెం వేసుకున్నాం. నేను బి. ఎ. జూనియర్ చదువుతుండగా ఒక రోజు రాత్రి పూట అన్నమాట. ఆరాత్రి మాటలమీద మా యిద్దరికీ స్త్రీకి యెక్కువ పట్టుదలా? పురుషునికి యెక్కువ పట్టుదలా? అనే సమస్య వచ్చింది. స్త్రీలకుపట్టుదల జాస్తి అని అన్నయ్యకు అనేక ఉదాహరణలు చూపించాను. పురుషుడికే పట్టుదల యెక్కువని అన్నయ్య కూడా కొన్ని సంఘటనలు చెప్పాడు. నాన్నగారు, అమ్మగారు వూరికే మా వాదన వింటూ కూర్చున్నారు.

"స్త్రీల హృదయం చాలా సుకుమారంగా ఉంటుంది. వాళ్ళ పట్టువిడుపులలో బిగువు వుండదు. ఎంత కఠిన హృదయంగల స్త్రీ అయినా పట్టుదల యిట్టే సడలిపోతుంది." అన్నాడన్నయ్య.

"స్త్రీలనుగురించి నీకు వాస్తవంగా తెలియదు. నీది కేవలం పుస్తకాలజ్ఞానం. దాన్నాధారం చేసుకుని మాట్లాడబోకు. అవసరమైతే పురుషుడికంటే స్త్రీయే ధైర్యంగా ముందడుగు వేస్తుంది. పురుషుడుగూడా ధైర్యం చూపించలేని సమయంలో స్త్రీ ముందుకువచ్చి ఫలితాన్ని సాధించిన సంఘటనలనేకంవున్నాయి." అన్నాను.

"స్త్రీలతరపున ప్రతినిధిలాగే మాట్లాడుతున్నావే?"

"నువ్వు పురుషులవైపు ప్రతినిధివికదూ!"

తర్వాత మా యిద్దరివాదం పోయిపోయి చివరకు ప్రతిజ్ఞల వరకు వచ్చింది.

"ఆల్ రైట్. సరే. అందరి విషయాలూ అనవసరం. మన యిద్దరమే పందెం వేసుకుందాం. నేను స్కూలుఫైనల్ పాసయిన అమ్మాయిని చేసుకుంటాను - నువ్వు ఇంటర్ పాసయినవాడిని చేసుకో. నేను నా భార్యను ఇంటర్ కి చదివిస్తాను. నువ్వు నీ భర్తని గ్రాడ్యుయేట్ చెయ్యి. ఇదే పందెం. చిన్నదేగా. ఒప్పుకుంటావా మరి?" అన్నయ్య సవాల్ చేసాడు.

"ఊరికే కూచుని వాదించుకుని వాదించుకుని, యీ ప్రతిజ్ఞలు తీసుకెళ్ళి జీవితాలకు అంటగట్టుకుంటారుట్రా. ఏదో కాసేపు యిద్దరికీ తెలిసినవి మాట్లాడుకున్నారు. బిగ్గరగా వాదించుకున్నారు. అంతేగాని మీ మొహం ప్రతిజ్ఞలేమిటి?" అమ్మయింక వూరుకోలేక చివాట్లుపెట్టింది.

"నీకెందుకే మధ్య? వాళ్ళ బలాబలాలు వాళ్ళే చూసుకుంటారు. ఆమాత్రం ధైర్యం లేకపోతే పందాలెందుకు వేసుకుంటారు?" నాన్నగారి మాటలు మా యిద్దరిలో మరింతపట్టుదల కలిగించాయి.

"అదిసరేగాని నువ్వుగూడా ఇంటర్ పాసయిన అమ్మాయి నే




చేసుకోవాలి. పరుగు మొదలుపెట్టేముందు ఇద్దరం ఒకే స్థలంనుంచి పరుగెత్తాలికదా!" అన్నాను.

"కానులేమ్మా. పందెం బాగా నేవుంది. అలాగేవుంచు" అన్నారు నాన్నగారు. చివరికాపట్టుదలే మిమ్మల్ని వివాహం చేసుకోవటానికి పురిగొల్పింది. మన వివాహానికి నాకుగల పట్టుదలను చూసి మన బంధువులేగాదు, బహుశా మీరుగూడా ఆశ్చర్యపోయేవుంటారు". శైలజప్రసంగం పూర్తి చేసి భర్తముఖంలోకి చూసింది.

"అయితే నేను పందెంలో పణంపెట్టిన వస్తువునన్న మాట" శ్రీధర్ శైలజవంక చూచాడు.

"మీ రెందుకవుతారు? నా జీవితం అవుతుంది. మీరు కేవలం గెలుపూ ఓటమి నిర్ణయించే పావులుమాత్రమే," అంది.

"శైలజ నిన్నుతప్ప యెవర్నీ చేసుకో

యద్దన

సులోచ

దుట్రా" అని అమ

ఆశ్చర్యపోయినమ

నా అదృష్టం అనుకు

ఇప్పుడు తెలుస్తోంది

యెంతప్రమాదులు శే

శైలా! నేనుగూడా



# ...లయాలు



...పూడి

...రాణి

...స్తున్నప్పుడు కొంచెం
...మే. కాని అది
...పంతోషించాను.
...నా అదృష్టపు మేడ
...కోవని. అయితే
...కుష్టేగదూ? అది

మర్చిపోయావా? నిజంగా మీ అన్నయ్యని గెల్పించటమే మగవాడినైన నా ధర్మం. నేను నీకోర్కె చెల్లించటానికి చదివి పాసయితే, మాజాతి మొత్తానికే తీరనికళంకం వస్తుంది. నువ్వు పురుషజాతి మొత్తంమీదే యెందుకు సవాల్ చేశావు?" తీక్షణంగా అడిగాడు శ్రీధర్.

"నేను పురుషజాతిమీద సవాలు ఎప్పుడూ చెయ్యలేదే? ఆడవాళ్ళెంత పట్టుదల గల వాళ్ళో అన్నయ్యకు నిరూపించి చూపించాలనుకున్నాను. నాకు మరో వుద్దేశం లేదు. మీ యిష్టం చదివితే చదవండి. లేకపోతే లేదు. పరాయివాళ్ళయితే నన్నర్థం చేసుకోవచ్చు. చేసుకోలేకపోవచ్చు. మీరు నావారు. నన్నర్థం చేసుకుని సాయం చేస్తారనుకుని ఆశించాను. జీవితంలో యెన్ని ఆశలు నిరాశలవటం లేదు?" శైలజ మొహం తిప్పుకుని కాఫీ కప్పు తీసుకుని అక్కడ నుంచి వెళ్ళిపోయింది. శ్రీధర్ కాసమయంలో శైల విచిత్రంగా కన్పించింది. ఒకబరువైన నిట్టూర్పు వదిలి పుస్తకాలు ముందుకు లాక్కున్నాడు.

"శైలా! సరే. పందెంలో మటుకు నీకు విజయం చేకూరేటట్లు చేస్తాను. తర్వాత పురుషు లెంత కఠినులో నీకు నిరూపిస్తాను" అనుకుంటూ నోట్సు తీసుకుని వ్రాసుకోవటానికి ఉపక్రమించాడు.

శైలజ శ్రీధరునే పెళ్ళాడుతానని పట్టుపట్టిందని విన్న ఒక్క బంధువులే గాదు స్వయంగా శ్రీధరే ఆశ్చర్యపోయాడు. బి. ఎ. పాసయిన భార్య, కావాలని వస్తుంటే యే యువకుడు కాదనగలడు! కృతజ్ఞతాసూచకంగా కానీ కట్నంగూడా పుచ్చుకోలేదు. పెళ్ళయింతర్వాత ఒక నెల శైలజ యెంతో ఇదిగా ప్రవర్తించింది. ఇప్పుడనిపిస్తోంది అప్పటి ఆ ప్రవర్తన కేవలం తన అభిప్రాయాలను తెలుసుకోవటంకోసమేనని. తనసాటి స్నేహితులు తమ భార్యలతో షికార్లకు, సినిమాలకు సరదాగాపోతుంటే శ్రీధర్ కుంగిపోయిన మనస్సుతో నిశ్శబ్దంగా చూస్తూవూరుకునేవాడు. స్నేహితు లెవరయినా అడిగితే హృదయంలో లేని బలవంతమైన మందహాసం తెచ్చిపెట్టుకునేవాడు. కాని ఆబాధ చాలసేపటివరకూ మర్చిపోలేకపోయేవాడు. కోపంతో విసుగుతో గబగబా యింటికివచ్చేవాడు. కాని రాగానే నవ్వుతూవున్న మొహంతో యెదురై ఆదరంగా ప్రశ్నించేభార్యను చూడగానే కోపంచప్పగా చల్లారిపోయేది.

* * * *

"జలజా! జలజా!" పైనుంచి మహీధర్ ముంచుకుపోతున్నట్లు కేకలెయ్యటం మొదలుపెట్టాడు:

"ఏమిటండీ. అలా బిగ్గరగా చిన్నపిల్ల వాడికిమల్లే కేకలు పెడ్తారేమిటి? పోనీ అంతఅవసరమైతే క్రిందికి దిగి రాగూడదూ? అత్తగారు, మామగారు వింటే యేమనుకుంటారు?" జలజ పైకి వచ్చి సన్నసన్నగా చివాట్లు పెట్టింది భర్తని.

"ఏమనుకుంటారు? ఈ భార్య యిన్నిసార్లు పిలిపించుకుంటుందేరా బాబూ అనుకుంటారా? అనుకుంటే అనుకోని నాకేం? అయినా నీకెన్నిసార్లు చెప్పాను? ఎనిమిది కొట్టేసరికి పుస్తకాల ముందుండాలని?" మహీధర్ కాస్తకోపంగా అన్నాడు.

"బాగుందండి, మీరుచెప్పేది. క్రింద అత్తయ్యగారికి కాళ్లు నొప్పులుగా వున్నాయంటే పిసుకుతున్నాను. నేనేమయినా ఇంటి కోడల్నా మరేమయినానా? అత్తయగారి కాళ్ళు ముఖ్యమా, ఇక్కడ మీ పుస్తకాలు ముఖ్యమా? జలజ మళ్లా క్రిందకు దిగిపోబోయింది.

"ఇదుగో జలజా! నాకు కోపంవస్తే మంచివాడినిగాదు తెలుసా? నువ్వురా. కూర్చుని చదువుకో. అమ్మకు నే వెళ్ళికాళ్ళు పడతానులే. రా! నిన్న పాఠం వచ్చిందా? దానిమీద బాగా వ్యాసం వ్రాయగలవా?"

"మంచివారే, నేనిక్కడ హాయిగా పంకాక్రింద కాలుమీద కాలువేసుకుని కూర్చుని రాణిగారికిమల్లే చదువుకోనా! మీరు పోయి కాళ్ళు పిసుకుతారా! చాల్లెండి యెవరయినా వింటే నవ్వుతారు గూడాను. నాకాచదువూవద్దు చట్టుబండలూ వద్దు. కావాలంటే మీరు ఎమ్. ఎ. కి కట్టండి."





# జీవిత వలయాలు



"నన్ను ఎమ్. ఏ. కి కట్టమని నువ్వు చెప్పే దేమిటి? నాకు తెలుసులే. రా! నువ్వు మాట్లాడకుండా వచ్చి పుస్తకాలు తీసుకో" చిన్న పిల్లని టీచర్ కసిరినట్లు కసిరాడు.

"పోనీ వుండండి. క్రింద తలుపులు అవి చూచి [వెళ్ళి] వస్తాను" అంది పోతూ. మహీధర్ పోబోతున్న జలజని పట్టుకుని బలవంతంగా కుర్చీలో కూలదోసి "నేను వెళ్ళి చూసివస్తానులే" అని తను క్రిందికి వెళ్లిపోయాడు. జలజయేం చెయ్యటానికీ తోచక నిస్సహాయంగా చూస్తూ కూర్చుండిపోయింది. మహీధర్ క్షణంలో పైకి వచ్చాడు.

టేబిల్ కు చెరోవైపు భార్యాభర్తలిద్దరూ కూర్చున్నారు మహీధర్ సీరియస్ గా పాఠం చెప్పుకుపోతున్నాడు. జలజ తన్మయత్వంతో అతనివంక చూస్తూ కూర్చుంది. మధ్యలో ఆగి మహీధర్ ప్రశ్న వేశాడు. భర్త ముఖసౌందర్యాన్ని తదేకంగా చూస్తున్న జలజ వెంటనే జవాబు చెప్పలేకపోయింది.

"ఏ లోకంలో వున్నావ్?" తీవ్రంగా అడిగాడు. అతని గద్దింపుకి బెదిరినట్లు చూస్తూ "నాకు నిద్ర వస్తోంది బాబూ!" అంది.

"నాకు రాని నిద్ర నీ కెందుకొస్తుంది? ఏవిధంగా వస్తుంది? నువ్వెన్ని చెప్పినా లాభం లేదు. పన్నెండువరకు కూర్చోవాల్సిందే. నాలుగ్రోజులు పట్టుదలగా కూర్చుంటే అదే అలవాటవుతుంది. దేనికయినా పట్టుదల అనేది వుండాలి" మహీధర్ మళ్లా పాఠం చెప్పటంలో మునిగిపోయాడు. హఠాత్తుగా మళ్ళీ జలజవంక చూశాడు. తనింకా వెనక్కు జారగిలబడి కూర్చుని పాఠం వింటోంది అనుకున్నాడు. అదేం లేదు. శుభ్రంగా, హాయిగా నిద్రపోతోంది! అమాయకంగా వెనక్కువాలి నిద్రపోతున్న జలజను చూసేసరికి మహీధర్ హృదయంలో యేదో బాధ కలిగింది. బాధగా నిట్టూర్పు విడుస్తూ, పుస్తకాలు మూసేసి జలజను లేపి, ప్రక్కమీద పడుకోమని, తను వెళ్లి పడుకున్నాడు. అన్ని కిటికీలు తెరిచివున్నాగూడా బొత్తిగా గాలి లేదు. జలజ ముఖంమీద చిరు చెమటలు పోశాయి. మహీధర్ లేచి ఫాన్ వేసి కిటికీలోంచి వచ్చే వెన్నెల్లోకి చూస్తూ జలజను చదివించటంలో తనెలా విజయం పొందుతాడా అని ఆలోచిస్తూ పడుకున్నాడు. జలజకు తన అభిప్రాయాలు చక్కగా విడమర్చి చెప్పినా అర్థం చేసుకోదు. పైగా తనకిప్పుడు చదు వెందుకంటుంది. ఆదర్శప్రాయుడయిన తన భర్తకి కాళ్ళు పిసగటం అంటే యెంతో యిష్టంట. తనకలాటి మాటలు వింటుంటే ఒళ్ళు మండుకుపోతూవుంటుంది. 'వంట మానెయ్యి, వంటమనిషిని మాట్లాడతా' నంటే, ససేమిరా వద్దని పోట్లాడింది. సహజంగా అందరూ వంటయింటికి దూరంగా వుండాలని ప్రయత్నంచేస్తారు. జలజకి వంట చేసి అందరికి పెట్టటంలో యే ఆనందం లభిస్తుందో మహీధర్ కి అర్థం గావటంలేదు. గట్టిగా మాట్లాడితే, కళ్లనిండా నీళ్ళు నింపుకుని, మొహం తిప్పుకుని, మెదలకుండా వెళ్లిపోతుంది. తల పగలగొట్టుకున్నా చచ్చినా సమాధానంగూడా చెప్పదు. అది తనసలే భరించలేడు. ఎదురుగుండా వుండి, తర్కించి పోట్లాడుతుంటే నే బాగుంటుంది. కళ్ళనీళ్ళు పెట్టుకుని వెళ్ళిపోతే తన హృదయం విలవిలలాడుతుంది. తనకి నెక్ టై కట్టటంలోనూ క్రాఫ్ దువ్వటంలోను ఒకటేమిటి ప్రతిదీనూ-తనకు సేవ చెయ్యటంలో వున్న శ్రద్ధలో సహస్రాంశమైనా చదువుమీద వుంటే యెంత బాగుంటుంది! చెప్పింది శ్రద్ధగా వింటే పాఠం త్వరగా పూర్తవుతుంది. వెంటనే కొత్త పాఠం మొదలుపెట్టవచ్చు. ఒక్కొక్కసారి మరీ యిష్టంలేనప్పుడు వెధవ ప్రశ్నలు వేసి చంపుకుతింటుంది. అడ్డుప్రశ్నలు వేసి ప్రక్కదారులకు లాగి "పాఠం చెప్పటానికి యింత టైమ్ పట్టె, అసలేవద్దు పొ"మ్మంటుంది. తనకిబాగా కోపంవస్తే నవ్వేస్తూ, చిలిపిగా మళ్లా చిటికెలో పోగొడుతుంది. జలజతో తనిలా సతమత మవుతున్నాడు. శైలజ తన భర్తతో యెలా వేగుతోందో! అసలు శ్రీధర్ మహాపట్టుదల మనిషి, మరి కావాలని పట్టుపట్టి అతన్ని చేసుకుంది. అతనిలో మార్పు తేగలదో లేదో? క్రమంగా మహీధరుని కళ్లుమూతలు పడసాగినాయి. కొంత సేపటికి నిద్రాదేవి అతనిచుట్టూ తన తెరల్ని దించివేసింది.

* * *

మధ్యాహ్నం రెండు గంటలకు బయట వెళ్లిన శ్రీధరుడు సాయంత్రం ఆరుగంటలయినా యింటికి రాలేదు. నాలుగు రోజులనుంచీ యిలాగే చేస్తున్నాడు. ఇంట్లో వుంటే చదువో చదువో అని ప్రాణాలు తీస్తుందని తన్ని తప్పించుకోవటానికే యీ యెత్తు వేశాడనుకుంది శైలజ. స్నానంచేసి అతను వచ్చేసరికి అన్నీ సిద్ధపరిచి చదువుకు తయారుచేసుకుంది. ఏమయినాసరే శ్రీధర్ ని వదిలిపెట్ట గూడదు. తాత్కాలికంగా అతనికి కష్టం వేసినా తర్వాత అయినా తనమంచితనాన్ని గమనించక పోతాడా? ప్రస్తుతం తనకు సహనంగావాలి. అతను యేవిధంగా ప్రవర్తించినా వుద్రేకపడకుండా, ప్రశాంత వదనంతో తనలో యేచికాకూ లేనట్లు వుండాలి. అతనిపట్ల తను నిర్వహించవలసిన పాత్రనుగురించి ఆలోచిస్తూ కూర్చుంది. ఏడు దాటిపోయింది. శ్రీధర్ రాలేదు. పంతానికి శైలజ మేలుకుని కూర్చునివుంది. పదిగంటలు దాటుతుండగా శ్రీధర్ వచ్చాడు. పడక్కుర్చీలో భారంగా మూతలుపడిన కళ్లతోవున్న శైలజను లేపటమా, మానటమా అని క్షణంసేపు తటపటాయించాడు. అడుగుల చప్పుడు విని శైలజ కళ్ళు తెరిచింది.

"స్నానం చేస్తారా?" భీకరమైన తుఫాను వీస్తుందని ఆశించిన శ్రీధర్ కి ప్రశాంతమైన మలయమారుతం రావటం ఆశాభంగమైంది. "ఊ!" అని ముటుకు అని పైకి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

స్నానంచేసిన శ్రీధర్ భోంచెయ్యకుండా వచ్చి మెదలకుండా తన మంచంమీద పడుకుని వూరుకున్నాడు. తలుపులువేసి శైలజ పైకి వచ్చింది. నిద్రపోతున్నట్లుగా గోడవైపు మొహం పెట్టుకుని పడుకున్న శ్రీధర్ ని శైలజ పన్నెత్తి పలుకరించలేదు. కిటికీ తలుపులు పూర్తిగా తెరిచి, ఫాన్ వేసి ఆరోజు చదవవలసిన పుస్తకాలను డ్రాయరుమీద తెరిచిపెట్టి మెదలకుండా క్రిందికి దిగి వెళ్ళిపోయింది. వెళ్ళిపోతున్న శైలజ అడుగుల చప్పుడును గమనించి శ్రీధర్ వెనక్కి తిరిగాడు. డ్రాయర్ మీద ఫ్లాస్కులో టీ, తెరిచిపెటిన పుస్తకాలు మౌనంగా శైలజ అభిప్రాయాన్ని అందిస్తున్నాయి. ఫాన్ గాలికి పుస్తకంలోవున్న ఒక కాగితం రెపరెపలాడుతూ యెగురుతోంది. శ్రీధర్ లేచి వెళ్లి పుస్తకాలముందు కూర్చుని గాలికి బయటకు రావాలని ప్రయత్నం చేస్తున్న కాగితాన్ని తీశాడు. అందులో:

"మిమ్మల్ని విసిగించి బాధించటం నాకిష్టమైన పనిగాదు. ఇష్టమైతే పాఠాన్ని చదవండి. లేకపోతే మానెయ్యండి. అంతేగాని యెవరిమీద కోపం యెవరిమీదో చూపించినట్లుగా నామీద కోపంలో ప్రొద్దుపోయేవరకు అక్కడా, యిక్కడా తిరగవద్దు. ఆరోగ్యం పాడవుతుంది. నిరపరాధులకు శిక్ష యివ్వటం మీ సాంప్రదాయమేమోగాని నేను భరించలేను. శైలజ" అని వుంది. శ్రీధర్ కాగితాన్ని మడిచి జేబులో పెట్టుకుని శైలజ తీసిపెట్టిన పాఠం కాకుండా యింకా ముందుపాఠం చదవసాగాడు.

శైలజ తన గదిలోకి వెళ్ళిపోయి పడుకుందన్న మాటేగాని నిద్రపట్టలేదు. ఏదయినా పుస్తకం తీసుకుని చదువుదామని ప్రయత్నం చేసింది. కాని మనసు పుస్తకంమీద నిల్వలేదు. ఒళ్లో పుస్తకం అలాగే వదిలేసి

చెంపన చెయ్యిపెట్టుకుని శూన్యంలోకి చూస్తూ కూర్చుండిపోయింది.

"శైలా! అబ్బాయి వచ్చాడుటే" ప్రక్కగదిలోంచి పిల్చిన అత్తగారి పిలుపుతో యీ లోకంలోకి వచ్చింది. వారంరోజులనుంచి ఆవిడ ఒంటో యేమీ బాగుంటంలేదు.

"వచ్చారు. పిలవమంటారా?" లేచి తన గది గుమ్మంవరకువచ్చి అడిగింది శైలజ.

"వద్దులే. యేం చేస్తున్నాడు. భోంచేశాడా?"

"చదువుకుంటున్నారు. భోంచెయ్యలేదు" నంబర్ వారీగా శైలజ సమాధాన మిచ్చింది. తనూ భోంచెయ్యలేదు కానీ, అడిగేదెక్కడి తనకు?

"అయ్యో ఇంకా చెయ్యలేదూ? ఇంకెప్పుడుచేస్తాడే? వాడిని పిల్చి లాలింపుగా భోజనమన్నా పెట్టటం చాతగాదునీకు. మీరిద్దరూ యెలా బ్రతుకుతారేనాతల్లీ" అంటూ అత్తగారు ముక్కుతూ మూలుగుతూనే లేచి పైకివెళ్ళింది.

శైలజ కళ్లల్లో నీళ్ళు తిరిగాయి. ఏఆనందాన్ని అసించి తను తనబ్రతుకు ఈవిధంగా నాశనం చేసుకుంటోంది. మెదలకుండా వెళ్ళి తన మంచంమీద పడుకుంది. కళ్ళంబడి నీళ్లు వెచ్చగా పక్కలకు కారిపోతున్నాయి. తన జీవితం పూర్తిగా సర్వనాశనమైనాసరే తను పట్టినపట్టు విడువకూడదు. ఆడవాళ్ళ పట్టుదలలో యెంత గట్టిదనముందో ఒక్క అన్నయ్యకేగాదు భర్తకి కూడా నిరూపించాలి. శైలజలో ఒకవిధమైన మొండితనం రేకెత్తింది.

మర్నాడు శైలజ లేచేసరికి శ్రీధర్ లేవటం స్నానం చెయ్యటం, కాఫీ త్రాగటం ఎక్కడికో వెళ్లిపోవటం గూడా జరిగిపోయింది. అత్తగారికి ఒంట్లో కులాసా చిక్కిందిగాబోలు. ఉదయమే లేచి కొడుక్కి వేడినీళ్లుపెట్టియిచ్చి, కాఫీకలిపియిచ్చింది. శైలజ అత్తగార్ని యేమీ ప్రశ్నించదలుచుకోలేదు. కాఫీ త్రాగినతర్వాత భర్త గదిలోకి వచ్చి చూసింది. ఫ్లాస్కులో టీ కదలలేదు. తెరిచి పెట్టినపుస్తకంలో పేజీలు ముందుకుపోలేదు. యెక్కడపెట్టినవి అక్కడే వున్నాయి. గుండెల్లో మండుతున్న మంటని శైలజ అతి జాగ్రత్తగా దాచేసుకుని, ప్రశాంతవదనంతో క్రిందికిదిగి వచ్చేసింది. వంట చేయటానికి ఉపక్రమిస్తుంటే అత్తగారు కలగజేసుకొని 'నేచేస్తాలే' అంది. వద్దనలేదు. ఎందువల్లనో యేకాంతంగా వుండాలని కోరుతోంది శైలజ మనసు. స్నానాదులు పూర్తిచేసుకుని వచ్చి గదిలోకూర్చున్న శైలజను అత్తగారువంటవ్వగానే."నీకు ముందర పెట్తాను రావే శైలా"అని పిల్చింది. వద్దులెమ్మని భర్త రాకకోసం యెదురుచూస్తూ కూర్చుంది.

పన్నెండు దాటినతర్వాత శ్రీధర్ అలిసిన మొహంతో, బడలికగా యింటికి వచ్చాడు. శైలజను ఒక్కముక్కగూడా అడగలేదు. కావలసిన అవసరాలు తల్లి ద్వారా తీర్చుకుని, భోంచేసి మెదలకుండా తన గదిలోకి వెళ్ళిపోయాడు.

అత్తగారితోపాటు తనూ భోంచేసి శైలజ పైకి వచ్చింది. కాని శ్రీధర్ మంచి నిద్రలో వున్నాడు. డ్రాయర్ దగ్గర కుర్చీలోకూర్చుని నిద్రపోతున్న శ్రీధర్ మొహంలోకి రెప్ప వాల్చకుండా చూసింది. ఫాన్ గాలికి అతని నొక్కుల జుట్టు అలలు అలలుగా లేస్తూ వుండటంతప్ప అతనిలో మరేచలనమూ లేదు. నిద్రపోతుంటే మొహం మరింత అందంగా వుంది. క్రమంగా ఆమొహం తనకు దూరమైపోతే! ఈ భావానికి తట్టుకోలేకపోయింది. నిద్రలోనే అతను ఒకప్రక్కకు తిరిగి పడుకున్నాడు. ఖంగారుగా క్రిందికి దిగి వచ్చేసింది శైలజ.

హాల్లో ఒక కుర్రాడు నిలబడి అత్తగారిని యేదో అడుగుతున్నాడు. శైలజను చూడగానే అత్తగారు.

"చూడు శైలా. ఈ కుర్రాడికి అబ్బాయి కావాలిట. యేం చేస్తున్నాడు? వాడితో చెప్పు. నేనలా మా రాజమ్మగారింటికి వెళ్ళి వస్తాను. తలుపులు జాగ్రత" అని అత్తగారు వెళ్ళిపోయింది.

"యేం కావాలినీకు?" యెదురుగా నిలబడి అమాయకంగా తన మొహంలోకి చూస్తున్న కుర్రాడిని అడిగింది. అతనికి నిండా పదేళ్లన్నా లేవు. తెల్లగా బొద్దుగా వుండి ముద్దొస్తున్నాడు.

"మాఅక్క యీవుత్తరం యిచ్చి రమ్మందండీ" అంటూ నిక్కర్ జేబులోంచి ఒక వుత్తరం తీసి యిచ్చాడు.

"యెవరికి?" శైలజ కంఠంలో మార్పు వచ్చింది.

"శ్రీధర్రావుగారికి" అన్నాడు కుర్రాడు తడుముకోకుండా. బాగా పరిచయమైన పేరన్నమాట అనుకుని వుత్తరం తెరిచి చూచింది. అందుల్లో రెండే రెండు వాక్యాలున్నాయి.

"సాయంత్రంవరకూ మేం యింట్లో వుండం. రాత్రికిరండి" క్రింద సంతకంలేదు. దస్తూరి ఆడవాళ్లదని స్పష్టంగా తెలుస్తోంది. అందులోవున్నవి రెండు వాక్యాలేఅయినా నాలుగుసార్లు చదివినా శైలజ కర్థంగాలేదు. తలెత్తిచూచేసరికి పిల్లాడు వెళ్ళిపోయాడు. ఉత్తరం శ్రీధరుడికి యివ్వటమా మానటమా అని కాసేపు తటపటాయించింది. చివరకు ఇవ్వటానికే నిశ్చయించుకుని మెట్లు యెక్కింది. గది గుమ్మంలో అడుగుపెట్టబోయేసరికి అతను నిద్రపోవటం లేదు. లేచి కూజాలోవున్న నీళ్లతో మొహం కడుక్కుంటున్నాడు. శైలజ చప్పుడు చెయ్యకుండా వుత్తరం డ్రాయరుమీద పెట్టి వెనక్కి తిరిగి వచ్చేసింది.

"శైలా కాఫీ తెచ్చిపెట్టు." అతని కంఠములోగల అధికారానికి వెనక్కితిరిగి చూడకుండా వుండలేకపోయింది. శ్రీధర్ శైలజను గమనించలేదు—వుత్తరం చూసుకుంటున్నాడు. అతని కంఠంలో మార్పును గమనిస్తూ కాఫీ పట్టుకెళ్ళింది.

శ్రీధర్ ఫ్లాస్కులో కాఫీ కప్పులోవంపుకుంటూ శైలజ మొహంవేపుచూడకుండానే "నేనలా బజారుకు పోయివస్తాను. సినిమాకు పోదాం. రెడీగా వుండు," అన్నాడు.

"నేను నిజంగా మీతో సినిమాలకు,షికార్లకు రావాలని వుంటే, మీరీవిధంగా యెందుకు ప్రవర్తిస్తారు? మీరు వెళ్లండి. నాకు సినిమాలు వద్దు సిద్ధ మోక్షాలూ వద్దు," కోపముతో మొహం తిప్పుకుని శైలజ వెళ్ళిపోయింది. ఎఱ్ఱబడ్డమొహంతో వెళ్ళిపోయిన శైలజను చూసి శ్రీధర్ మధురంగానవ్వాడు. అతనిలో ఒకవిధమైన హుషారు వచ్చింది. అద్దంలో చూసుకుని తల దువ్వుకుంటూ 'శ్రీధర్! అంతే. శైలను ఈ నాల్గురోజులూ అలా యేడిపిస్తే ఇటు నీకు చదువూ సాగుతుంది. అటు శైలలో మార్పూ వస్తుంది," అని ప్రతిబింబంతో చెప్పుకున్నాడు. మరోమారు అతని పెదవులు చిలిపిగా నవ్వాయి.

ఒక అరగంట గడిచిన తర్వాత నీట్‌గా టాయిలెట్ చేసుకుని, మన్మథుడిలా మెరిసిపోతూ, హుషారుగా యీలమీదపాటపాడుకుంటూ బయటకు వెళ్ళిపోయిన శ్రీధర్ని చూస్తూ శైలజ తన గదిగుమ్మంలో అలాగే ప్రతిమలాగ నిలబడిపోయింది.

ఆ సాయంత్రం వెళ్ళిన శ్రీధర్ రాత్రి రెండు గంటలయింతర్వాత ఇంటికి వచ్చాడు.

"ఇంతసేపు యెక్కడున్నావురా?" తల్లి అడిగింది.

"స్నేహితులు బలవంతం చేశారు. రెండు సినిమాలూ చూడాల్సి వచ్చిందమ్మా."

ఆ రాత్రి శ్రీధర్ గదిలోని లైటు వెలగలేదు.

* * *

[మిగతా కథ పైవారం]

# తాజ్‌మహల్‌లో ఏముంది?

శేఖర్ రోడ్డువెంబడి నడిచిపోతున్నాడు.

రోడ్డుప్రక్క మామిడిచెట్టు విరగ కాసి వుంది. దానిక్రింద ఒక మనిషి కూర్చొని చెట్టుపైకి పదిరాళ్లు విసిరేడు. అనుకోకుండా ఒక కాయ రాలింది. కాని ఆ రాలేకాయ అతని నెత్తిపై పడింది. కాయ మరీ పెద్దది కావడంవల్ల, సుత్తితో మొత్తినట్లుగా, అతని తల చిట్లి రక్తం కారింది. శేఖర్ అక్కడికి పరుగెత్తి తన చొక్కా చింపి అతని తలకు కట్టుకట్టేడు. ఆ మనిషి తనదారిని తాను పోయేడు.

చిరిగిన చొక్కా శేఖర్ కొకవిలక్షణమైన ఆకారాన్నిచ్చింది. అంతక్రితమే బాగా రేగివున్న జుట్టుకీ, ఎర్రబారిన కళ్ళకీ, ఈ చిరిగిన చొక్కా చేరి, అతని ఆకృతి తాగినవానిలాగ మరీ వికృతంగా కనబడుతోంది. అతను రోడ్డుపై, ఏవైపూ చూడకుండా మెయిన్‌రోడ్డువెంట తిన్నగానడిచిపోతున్నాడు. కదిలిపోతున్న స్తంభంలాగుంది అతని నడక తీరు.

* * *

అతని జీవితంలో ఆరోజు మరువరాని రోజు. ఒకవిధంగా, సుఖదుఃఖాల కూడలి. సుఖదుఃఖాలు ఒకటితోనొకటి కలిసి సంభాషించుకుంటే ఆ సంభాషణ తీరు, నేటి అతని అనుభవములో ప్రతిబింబిస్తోంది. ఆ వేళ అతని కథ. ప్రపంచకథానికల పోటీలో తృతీయబహుమానం పొందింది. ఏబది వేల రూపాయల్ని గెల్చుకొంది. ఇంటికొచ్చిన మరుక్షణమే తన కుమారుడు మరణించిన వార్త అతని చెవినిపడింది. పూర్తిగా కష్టం వచ్చినా అనుభవించగలడు మానవుడు. పూర్తిగా సుఖమయితే సంతోషంగా అనుభవిస్తాడు. కాని, సంతోషవార్త, దుఃఖవార్త ఒక్కరోజునే అతని చెవిని పడేటప్పటికి, అతని జీవితనౌక అటు నిటు ఎగిరిపడుతోంది. అతని మానససరోవరము అటు, నిటు రెండు గట్లుతెగి పొర్లిపోయి ప్రవహించుతోంది. సుఖదుఃఖాలు చెలిమి కలుపుకొని, మీదికి విజృంభించేసరికి పిచ్చెత్తినట్లయింది మానవునికి. ఒకదానికొకటి కారణమైన ఈ రెండు వార్తలు అతని మనస్సుకి శాంతి లేకుండా చేసేయి.

ఎస్. వి. ఎ.
రామలింగేశ్వర శాస్త్రి

పదిహేనురోజుల క్రితం పత్రికలో ఒక ప్రకటన చదివేడు. ప్రపంచ కథానికలపోటీకి కథలు పంపడానికి ఆ వేళ ఆఖరురోజు అని. నాలుగైదురోజుల క్రితం అతను వ్రాసినకథ నొకటి పంపడానికి నిర్ణయించుకొన్నాడు. కథ దాఖలు చేయడానికి ప్రవేశ రుసుము పది రూపాయలు. పోటీకి నిర్ణయసంఘ కార్యాలయం మన దేశంలోనేవుంది. అన్ని దేశాల ప్రతినిధులు సమావేశమై, ఉత్తమ కథానికలను నిర్ణయిస్తారు. అపుడు శేఖర్ వద్ద సరిగా పది రూపాయలున్నాయి. ఈ పదిరూపాయలు అందుకే వినియోగించ దలచుకొన్నాడు.

కావలసిన కాలానికి సరిగా తనవద్ద కావలసిన డబ్బుమాత్రమే ఉండటం శుభప్రదమే ననుకున్నాడు. తప్పకుండా ఈకథ, ఆడబ్బు పత్రికలోని 'ఎడ్రెసు'కి పంపడానికి నిశ్చయించుకొని ఇంటికివచ్చేడు. ఇంతలో చూస్తే ఆవేళే తన ఒకే ఒక చిన్నారి కొడుక్కి $104^{\circ}$ జ్వరం తగిలింది. జ్వరం హఠాత్తుగా రావడంతో భార్య ఖంగారుపడి డాక్టర్ని తీసికొని రమ్మంది. తన దగ్గర డబ్బేది?

తన దగ్గున్నది సరిగా పది రూపాయలు. అది కథ పంపడానికి వెచ్చించడంకోసం యింతక్రితమే నిశ్చయం చేసికొన్నాడు. ఇపుడు ఇది సమస్య అయింది. ఏదిముఖ్యం? తన రక్తంలో పాలుపంచుకొన్న కొడుక్కి ప్రాణం కాపాడ్డం ముఖ్యమా? తన రక్తం ధారగా ఒలికించి దానితో వ్రాసిన అపురూపమైన రచనకొక విలువని తెచ్చి దానికి ప్రాణదానం చెయ్యడం ముఖ్యమా?

ఊహలు అతని మనస్సులో వెర్రితలలు వేసి హాహాకారాలు చేశాయి. "నా కథ తప్పక బహుమానం తెచ్చుకొంటుంది" అన్న అక్షరాల దొంతరలు అతని మనసు లోతులలో నలుమూలలా వ్యాపించి నాట్యమాడుతున్నట్లతని కనిపించింది. తన కొడుకు జ్వరంలో ప్రమాదమేముంది? జ్వరం వస్తూంటుంది. పోతూంటుంది. దానికోసం అంత బాధపడటమెందు కనుకొన్నాడు. చివరికి, భార్య ఏడుస్తున్నా వినకుండా, కథ పంపివచ్చేడు.

ఈ పదిహేను రోజుల్లోనూ, కొడుకు జ్వరస్థితిలో ఏమీ మెరుగులేదు. నాలుగైదు రోజులక్రితమే ఖంగారుపడి డాక్టర్ని బ్రతిమాలి తర్వాత 'ఫీజు' ఇస్తామని చెప్పి ఇంటికి తీసుకొనివచ్చి చూపించేరు. అతడు చూసి ఇప్పటికే ఆలస్యమయినదని పెదవి విరచి, ఇపుడు మద్రాసు తీసికొని వెడితే బ్రతకవచ్చని చెప్పి వెళ్ళిపోయేడు. కాని అప్పుడు తనకి డబ్బు ఎవరిస్తారు? ఇపుడయితే తనడగకుండానే తన ఆఫీసు స్నేహితులు కొడుకు జబ్బు కుదుర్చుకోమని చెప్పి వందరూపాయలిచ్చేరు. ఇంకా ఇంకా ఇస్తారు కావలిస్తే. కొడుకుని మద్రాసు తీసికొని వెళ్ళి జబ్బు నయం చేసికొంటానని వంద రూపాయలు తీసికొని ఇంటికొచ్చేటప్పటికి, జేబులోని వందరూపాయ కాగితాలు పెనుగాలి

పైకెగిరి, ఒకటొకటిగా కొడుకు శవాన్ని తనకి కనపడకుండా కప్పివేశాయి. తనమనసు కార్చిన కన్నీరు కండ్లలోనే యిమిడి పోయింది.

*   *   *

బహుశః ఈ ఆలోచనలన్నీ శేఖర్ రోడ్డుపైన నడిచిపోతుండగా అతని మనసులో సుడులు తిరుగుతూ వుండివుంటాయి. ఇంతలో శేఖర్ వెనకాల ఎవరో పరుగెత్తుకొంటూవచ్చి అతని భుజంపై తట్టేరు.

"ఏరా! సన్మానసభ మరిచిపోయేవట్రా? ఈ ఆకారమేమిటి? అల్లా చూస్తావేం? టైమయింది, నడు" అని అతన్ని లాక్కుని పోయేరు.

శేఖర్‌ని సన్మానించటానికి అతని ఆఫీసువాళ్ళు ఒక బహిరంగసభ ఏర్పాటుచేసి వున్నారు. అందులో పూలతో అలంకృతమైయున్న వేదికపై ఒక సోఫాలో 'శేఖర్‌ని' ఆసీనుణ్ని చేశారు. సభ మొదలయింది. ముగిసింది. తనకి జరిగిన సన్మానానికి శేఖర్ సమాధానం చెప్పాలి. అతనివైపు సభలోని కొన్ని వేల జతలకళ్ళు ఆత్రుతతో చూశేయి. అతని కళ్ళు ఏవైపు చూడలేదు.

స్నేహితుడొకడు అతనిని నిలబెట్టి

"ఏవో నాలుగు ముక్కలు మాట్లాడరా?" అన్నాడు.

అతను నిలబడేవున్నాడు. ఏమి చెప్తాడోనని అందరూ వినడానికి సిద్ధంగా వున్నారు. కాని అతడు మాట్లాడటానికి సిద్ధమయిలేడు. అతనికెదురుగా సుందరమైన "తాజమహల్" ఫోటో వ్రేలాడదీయబడి వుంది. దానిని చూస్తూనే, అతనినోట నాలుగు ముక్కలు ఖంగున వెలువడ్డాయి.

"తాజ్ మహల్ లో ఏముంది?... ఏముంది?...గోరీ!...గోరీ!" ★



## శ్రీమతి స్లిప్పర్స్

(23-వ పేజీ తరువాయి)

ఊహించుకుంటున్నాను...

విసుక్కోడాలూ, యీసడింపులతో ప్రారంభమై—విసవిసలూ, రుసరుసలదాక పోయి...అక్కడినుండి చిలికి చిలికి గాలివాన అయినట్లు—కన్నీటి కెరటాలు... ఇవేమీ లేకుండా, పెళ్లికివచ్చిన పదిమందికీ కళ్ళలా వినోదం పంచకుండా...శ్రీమతి కనికరించేట్టు చేయమని ఏడుకొండల వెంకటేశ్వరస్వామిని ప్రార్థించాను.

ఒక్క పారిజాతపుష్పంకోసం ఆగ్రహించిన అనుంగు అర్ధాంగి సత్యభామ అనుగ్రహం కోసం సాక్షాత్ శ్రీకృష్ణభగవానుడు అన్నగారిమీద దాడితీసి, వదినెగారి తోటలోని పారిజాత వృక్షాన్నే ఊడబెరుక్కురాలేదూ? తప్పేముంది?

కాని ఎందుకనో "లతాంతాయుధు కన్నతండ్రి శిరమచ్చో వామపాదంబునన్ తొలఁగ ద్రోసె లతాంగి" అన్న దృశ్యమే కళ్ళలో కన్పించి "నాధుల్నేరముల్ సేయ పేరలుకం జెందిన ఇట్టి కాంత లుచితవ్యాపారముల్ నేర్తురే" అన్న ముక్కుతిమ్మన (ఇంతటి మహత్తర సత్యాన్ని ఆయనలో జీర్ణింపచేసిన ఆయన ఇల్లాలు ఎంత ఘటికురాలో!) ఎలుగెత్తి చాటిన కఠోరసత్యమే సన్నాయి వాద్యాల రొదలను, చిన్న చిన్న పిల్లల రోదనలను (అధిగ)మించి నా చెవుల్లో గింగురులెత్తి చెమటలు పోయించింది...

అనుకున్నంతా అయింది...శ్రీమతి వచ్చింది...భయపడుతూ భయపడుతూ నా అవస్థంతా చెప్పుకున్నాను.

"పాతే పోయినయ్ లెండి-వెధవ స్లిప్పర్స్! మీరేమి దిగులు పడకండి...నే నెంత పాపాత్మురాలినండి—మిమ్మల్నింత అవస్థ పెట్టాను!"

ఆ మాటల్తో నేను పడ్డ అవస్థంతా మర్చిపోయాను.

పిల్లవాడ్ని ఎత్తుకుని వాడ్ని ముద్దు పెట్టుకుని, చుట్టూ చూసి ఎవరూ లేరని ధైర్యం తెచ్చుకుని నాకు తన బుగ్గ అందించింది.

అడగకుండానే అందించినదానికిన్నీ, అడిగితే అందించిన దానికిన్నీ భేదంలేదూ?

ఈ కథ శ్రీమతికి చూపించకుండానే పోస్టుచేశాను—పత్రికకి. శ్రీమతి అనుకొంచినట్లుగా వ్రాశానో లేదో నాకు తెలియదు. రేపు అచ్చులో చూసి అలిగి(గి) ముగ్గులే వేస్తుందో, అనుగ్రహించి ముద్దులే ఇస్తుంద ★

# నిర్మల నవ్వింది

**1**

నిర్మల నవ్వింది.
ఆ నవ్వులో ఎంతో ఆకర్షణ ఉంది.
ఆ నవ్వులో ఏదో అంతరార్థం ఉంది.
"ఎందుకు నవ్వుతున్నావ్?"
ప్రకాశరావు ప్రశ్నించేడు.
నిర్మల సమాధానం యివ్వలేదు.
మళ్ళీ నవ్వింది.
ఆ నవ్వుల్లో ముత్యాలురాలేయి.
"మతిగాని పోయిందా?"
"అది కాదండీ?"
"ఏది కాదు?"
"నేను చెప్పను."
"పోనీ మాసెయ్యి"
నిర్మల ముఖం చిన్నబోయింది.
ఉత్సాహం దిగజారిపోయింది.
"బిక్కముఖం వేశావేం?"
"చెప్పొద్దన్నారుగా."
"పోనీ చెప్పు చూద్దాం."
చెవిలో ఏదో చెప్పింది నిర్మల.
ఆయనకూ నవ్వాగలేదు.
నిర్మలకూడా నవ్వింది.
"అదా సంగతి?"
"మరేమి టనుకున్నారు?"
"అయితే అబ్బాయా? అమ్మాయా?
"ఏమో! నాకేం తెలుసు."
"పోనీ నీకెవరుకావాలో చెప్పు."
"నాకు అమ్మాయి కావాలి."
"నాకు అబ్బాయి కావాలి."
"ఊహూ! అమ్మాయి."
"ఊహూ! అబ్బాయి."
"నాకు అబ్బాయి వద్దు."
"నాకు అమ్మాయి వద్దు."
"అమ్మాయిఅయితేకట్నాలిచ్చుకోవాలి."
"అబ్బాయిఅయితేచదువుకిడబ్బుఖర్చు."
"పోనీ లాటరీ వేద్దాం."



"సరే."
"బొమ్మ అబ్బాయి-బొరుసు అమ్మాయి."
"సరే వెయ్యండి."
"నీకేం కావాలి?"
"బొరుసు."
"కాదు. బొమ్మే పడింది."
"అమ్మో! మోసం చేశారు"!
"నేనా?"
"మీరే!"
"పోనీ మళ్ళీ వేద్దాం"
"సరే ఈసారి జాగ్రత్తగా చూడాలి."
"బొమ్మా! బొరుసా?"
"బొరుసు."
"అబ్బా! బొరుసే పడింది."
"నేనే నెగ్గేను."
"యిదీ లెఖ్ఖ కాదు."

## నాయుడు సీతాదేవి

"ఎందుకని?"
"మళ్ళీ వేద్దాం."
"నేనొప్పుకోను."
"ముత్యం మూడుసార్లు."
"సరే మీ యిష్టం."
నిర్మలకు నీరసంవచ్చింది.
యింక మాట్లాడలేక పోయింది.
అంతటితో ఆగిపోయింది లాటరీ.

**2**

"వంట అయిందా?"
ప్రకాశరావు ప్ర ంచేడు.
"ఇంకా లేదండీ. నిరసంగా నిర్మల సమాధానం.
"మరి ఆఫీసుకి వేళవుతోంది."
"చాలా నీరసంగా ఉందండీ?"
"పనిమనిషి ఏమయింది?"
"ఈరోజు రాలేదు."
"ఇంటిపనులు నువ్వేచేస్తున్నావా?"
"ఆ!"
"చెయ్యవద్దని చెప్పలేదూ?"
"మరి ఎట్లాగ?"
"పోనీ నువ్వో పని చెయ్యి."
"ఏమిటి?"
"పుట్టింటికి వెళ్ళు."
"మరి మీరో?"
"నన్నుకూడా నీతో రమ్మన్నావా?"
"చాల్లెండి మీ వేళాకోళం."
"నేను హోటల్‌లో తింటాను."
"ఆరోగ్యం పాడవుతుంది."
"ఫర్వాలేదు."
"సరే కానీ..."
"ఏమిటది?"
"రాత్రిళ్ళు ఇల్లు కదలకదా!"
"మంచి అనుమానమే."
నిర్మల పుట్టింకి వెళ్ళింది.
ప్రకాశరావుది ఒంటరి జీవితం.
హోటలుభోజనం.
గడవని రోజులు.
గడ్డురోజులు.
కాలచక్రం గిర్రున తిరిగింది.
నవమాసాలు నిండేయి.
నిర్మలకు కవల పిల్లలు.
ఒక అబ్బాయి.
ఒక అమ్మాయి.
ఇద్దర్నీ ఎత్తుకుని ఇంటికి వచ్చింది.
ప్రకాశరావు నవ్వేడు.
నిర్మలా నవ్వింది.
పిల్లవాణ్ణి ఎత్తుకోమంది.
ఆయన అబ్బాయిని ఎత్తుకున్నాడు.
ఆవిడ అమ్మాయిని ఎత్తుకుంది.
ఇంతకూ ఎవరి పంతం నెగ్గినట్టు?

"నా పంతం నెగ్గింది." ధైర్యంగా అంది నిర్మల.

"నా పంతమూ నెగ్గింది. నీకు అమ్మాయి కావాలిగా! నువ్వే కట్నం యిచ్చి పెళ్ళి చేసుకో. నాకు అబ్బాయి కావాలి. నేనే చదివించుకుంటాను" నిర్భయంగా అన్నాడు ప్రకాశరావు.

"అయితే మనకు మాటల్లేవు."
"ఏం?"
"మీరు మాతో మాట్లాడకూడదు."
"అదేమిటి?"

"మీరూ అబ్బాయి వేరు, నేనూ అమ్మాయి వేరు."

ప్రకాశరావుకి షాక్ తగిలింది.
నోట్లో పచ్చివెలక్కాయపడింది.
నిర్మల నవ్వింది.
ఆయనా నవ్వేడు.



# వనితా లోకం

## లౌడ్‌స్పీకర్లు

**కె. ఎ. ఎస్. లక్ష్మి**

కొద్దికాలం క్రితం లౌడ్‌స్పీకరు వుపయోగం ఎక్కువ వుండేదిగాదు. దేశనాయకులుగాని మతప్రవక్తలుగాని వచ్చి ఉపన్యసిస్తుంటే ప్రజాసమూహానికి వినిపించడం కోసం లౌడ్‌స్పీకరు తెచ్చి పెట్టేవారు. ఇప్పుడు పెళ్ళిళ్ళకు, పేరంటాలకు పుట్టిన రోజు పండుగలకు ఏ కొద్ది హడావడి వచ్చినా లౌడ్‌స్పీకరు వుండి తీరవలసినదే.

ఏవో కొన్ని రికార్డులే తెస్తారనుకుంటాను. ఒక గంటో రెండు గంటలో వేసేందుకు సరిపోతాయి. ఆ తర్వాత మళ్ళీ మొదటికొస్తారు. అందులో వేసిన రికార్డే వేస్తూ. ఆ రోజంతా చాల బాధపడతారు; పెడతారు. అందులో వుదయం బాగా పాడిన రికార్డుసాయంకాలానికి "ఆ పెళ్ళి, పెళ్ళి, పెళ్ళి" అంటుందిగాని ముందు మాట పలకదు, గాడి తెగిపోతుంది.

ఎంత మంచి సంగీతమైనా 2,3 గంటల కన్న ఎక్కువ విని ఆనందించలేము. ఎక్కడైనా పెళ్ళి జరుగుతుందనుకోండి, ఎన్నిరకాల వాయిద్యాలైనా రెండు మూడు గంటల కన్న ఎక్కువ వినిపించవు. ఈ మధ్య పురోహితులు "అపండోయి" అంటూంటారు. అప్పుడు వాయించేవారికి వినేవారికి కూడ విశ్రాంతి దొరుకుతుంది. అదీకాక అదేపనిగా వాయిస్తుంటే విసుగుగా వుంటుందని మధ్య మధ్య మంత్రాలు, మంత్రాలు విసుగురాకుండా వాయిద్యాలు వినిపింప చేస్తారనుకుంటాను. మొత్తానికి ఏది మార్చకుండా వున్నా విసుగే. ఇన్ని మార్చితే రెండు మూడు గంటలలో అయిపోతుంది పెళ్ళి.

సినిమాగాని, బుర్రకథకాని, గానసభగాని 3 గం. కన్న ఎక్కువ వుండదు. అంతకన్న ఎక్కువైతే మనిషి తట్టుకోలేడు. ఇంట్లో రేడియో కొంచెం పెద్ద వాల్యూ పెటితే భరించలేక వెంటనే కట్టేస్తాం, అల్లాంటిది "లౌడ్‌స్పీకరు" బొంగురుధ్వని 24 గం॥ వినవలసివచ్చినవారికి మానసికంగా ఎన్ని వ్యాధులు పుట్టుకొస్తాయో ఆలోచించండి.

ఈ మధ్య కొందరు ఒక దివ్యపురుషుని భజన చేయిస్తామని వచ్చి చూడమని చెప్పారు. సరే వెడదాం ఆ భజన వినడానికి ఎంత శ్రావ్యంగా వుంటుందో అనుకున్నాము. మరునాడు ఇంకా వెలుగు రాలేదు. ఎవరూ మంచాలమీదనుంచి లేవలేదు. "లౌడ్‌స్పీకరు"లో ఏదో పెద్ద గొడవ వినిపిస్తోంది. మా పిల్లలు తొందరగా లేచి సినిమా పేపరు వస్తోందంటూ పరుగెత్తేరు. తెల్లవారకుండా సినిమా పేపరేమిటని తెలియదు వాళ్ళకు. ఇల్లాగ తెలియకుండా ఏవో పాటలు 5, 6 గొంతుకుల బృందగానం పెద్ద చప్పుడుతో హార్మోనియం ఇవన్నీ కలిసి చాల గందరగోళం చేస్తున్నాయి. వారింటికి మా ఇంటికి మధ్య 50 గజాల దూరమే వుంటేనేమో. లౌడ్‌స్పీకరు మా బుర్రలకు తగిల్చినట్లుగానే వుంది. కొంతసేపటికి అర్థమైంది నిన్న వారు పిల్చిన దివ్యనామ సంకీర్తనం ఇదే గాబోలు ననుకున్నాము.

మరికొంతసేపయ్యేటప్పటికి ప్రేమలేఖలు సినీమాలోని "సై, సై, సై" అన్న పాట వరసలో వినిపించసాగింది బృందగానం.

మరికొంతసే పయ్యేటప్పటికి "అన్నా, అన్నా విన్నావా" అన్న పాటవరసే

నీళ్ళపంపు

చిత్రకారిణి: కుమారి బి. గీత —అడయారు.

# లౌడ్‌స్పీకర్లు

అమ్మా అదీ అంటూ మా మేనల్లుడు పరుగెత్తుకొచ్చాడు. ఇల్లాగే ఇంకా సినీమా పాటల వరసలతో ఆ రోజు వుదయం 5 గంటలు మొదలు మరునాడు వుదయం 7 గంటల వరకు లౌడ్‌స్పీకరు ఒక్క వరసగా మోగుతూనే వుంది. ఆ రోజుకి నాకు నాలుగు రోజులనుంచి జ్వరం. నా బుర్రలో ఆ పాటలు, ఆ వరసలు, ఆ ధ్వనే 3 రోజుల వరకు మ్రోగిందనుకోండి. వారు ఏదో మొక్కు దీర్చుకొనడంకోసం ఆ పేటలోని వారి నందర్ని ఈ విధంగా బాధించడం ఏం బాగులేదు. "మైక్" ద్వారా కాకుండా ఒక గదిలో కూర్చొపెట్టి ఇంకొక రెండు రోజులు భజన చేయించినప్పటికి చాల సంతోషంగా వుండేది. ఆ లౌడ్‌స్పీకరు మూలాన్ని అందరికి భక్తిభావంపోయి చిరాకొచ్చింది. అదికాక అంత పెద్దధ్వనిలో ఆపకుండా, అందులోని మాటలు అర్థమవకుండా (మాట వినిపిస్తే అందులోని అర్థం తెలిసి బుర్ర కొంచెం విశ్రాంతి పొందేదేమో) ఏదో పెద్ద గందరగోళంతో 26 గంటలు అనగా రాత్రి తెల్లవార్లు కూడ లౌడ్‌స్పీకరుకు రెస్టు ఇవ్వలేదు. పగలంతా స్పీకరు పెట్టారు. రాత్రి అంతా పడుకునే టైములో తీసేస్తారేమోననుకున్నాం, కాని రాత్రికూడ పెట్టారు. ఆ సాయంకాలం డాక్టరుగారు వచ్చి వంట్లో ఎల్లా వుందని అడిగితే నా వంట్లో బాధలేమిటో నాకు తెలియలేదు. నా తలలో హోరుతప్ప మిగతా వేమీ తెలియలేదు.

భగవద్భక్తితో వారు భజన చేయిస్తే మీరు ఇల్లా వ్రాశారేమిటంటారేమో అంత పెద్ద ధ్వనితో పేటలోని జనాన్ని బాధపెట్టకుండా భజన చేయించుకుంటే బాగుండేది. పూర్వం రాత్రి 10 గం. దాటితే మేళంతో వూరేగింపు జరిపేందుకు గవర్నమెంటు పర్మిషను కావలసివచ్చేది. ఇంకా వూరేగింపైతే ఒక్కొక్క ఇంటిదగ్గర రెండు మూడు నిముషాలు ఆగుతుందిగాని ఈ లౌడ్‌స్పీకరులాగ గంటలతరబడి బుర్రమీద కొట్టదు. ఆ వూరేగింపు మేళమైనా శ్రావ్యంగా వుండి ఇంకొంచెంసేపు ఆగితే బాగుండును అనిపిస్తుంది. అల్లాంటిదానికే పర్మిషను కావలసివచ్చినప్పుడు దీనికి అంటే అంత గొడవగావుండే లౌడ్‌స్పీకరుకు తొందరగా ఎల్లా వస్తుందో మరి పర్మిషను.

ఇరుగుపొరుగు వారికి ఎన్నో ఇబ్బందులుంటాయి. వారికష్ట సుఖాలుకూడ ఆలోచించాలి. మన పిల్లలే పరీక్షలకు చదువుకుంటున్నారనుకోండి. అల్లాంటప్పుడు ఎదుటింటివారు "లౌడ్‌స్పీకరు" పెట్టి అదేపనిగా రోజంతా రికార్డులుగాని భజనగాని వినిపింప చేస్తారనుకోండి మనం ఎంతబాధపడుతాము, చదువు పాడవుతోందని. అల్లాగే రోగిష్టి వాళ్ళుంటారు. కొందరికి రెస్టు తీసుకోవలసి వుంటుంది. కొందరు తలనొప్పిరోగంవాళ్లు వుంటారు. మనసు స్థిమితంలేని వారుంటారు. ఏది ఏమైనప్పటికి మన వుత్సాహంకోసం ఎదుటవార్ని రెండు మూడు గంటలకన్న ఎక్కువ బాధించకూడదు. "లౌడ్‌స్పీకరు" వల్ల గొడవ ఎక్కువ అందం తక్కువ గాని గొప్ప ఏమీ లేదు.



# వంటలు

## పుల్లద్రాక్ష పప్పు

కందిపప్పులో కాని, పెసరపప్పులో కాని పుల్లద్రాక్ష వేయవచ్చును. పావుశేరు కందిపప్పు రాళ్లు లేకుండా శుభ్రపరచి వుడకపెట్టవలెను. పప్పు మెత్తగా వుడికాక ½ శేరు పుల్లద్రాక్ష కడిగి పప్పులో వేసి తగినంత ఉప్పు రెండు చెంచాల కారం, కొద్దిగా పసుపు, ఇంగువ, కరివేపాకు, రెండు పచ్చిమిరపకాయముక్కలు వేసి మెత్తగా వుడక నివ్వవలెను. గరిటెలో ఆవాలు మెంతులు, మినపప్పు, మిరపకాయలు పోపు వేసి దింపుకోవలెను. మామిడికాయపప్పు లాగా పుల్లగా వుంటుంది.

### రాచవుసిరి పచ్చడి

పావుశేరు పెసరపప్పు ఒక గంట సేపు నానపెట్టవలెను. పావుశేరు వుసిరికాయలు గింజలు లేకుండా కత్తిపీటతో ముక్కలు చేసుకొనవలయును. రెండు పలముల మిరపకాయలు, వుప్పు, నానపెట్టిన పెసరపప్పు, కొద్దిగా ఇంగువ వేసి రుబ్బురాయితో రుబ్బవలెను. పప్పు మెదిగిన తర్వాత వుసిరికాయ ముక్కలువేసి మెత్తగా రుబ్బుకొని జాడీకి ఎత్తుకొని, పోపుపెట్టవలెను. పుల్లగా అన్నంలోకి బాగుంటుంది.

### అనాసకాయ కూర

అనాసకాయ చెక్కు బాగాదళసరిగా తీసి లోనిగింజలు తీసి ముక్కలు చేసుకోవలెను. ముక్కలకు కొద్దిగా వుప్పు పట్టించి, శుభ్రంగా కడిగి 10 పలములు బీరకాయలు చెక్కు తీసి అనాసముక్కలు మాదిరిగానే బీరముక్కలూ తరగవలెను. రెండూ కలిపి కొద్దిగా పసుపు వుప్పువేసి వుడకపెట్టవలెను. అనాసముక్క మెత్తగా వుడికాక నిమ్మకాయంత చింతపండు పులుసు చిక్కగా తీసి ఆ ముక్కల మీద వేయవలెను. రెండు స్పూనులకారం కొద్దిగా బెల్లంముక్క వేసి ఇగిరిపోవునట్లు వుడికించి దింపవలెను. బాణలిలోకాని, కంచు గిన్నెలోకాని, కొద్దిగా నూనెవేసి, రెండు ఎండు మిరపకాయలు, ఆవాలు, మినపప్పు, కరివేపాకు వేసి పోపు వేగాక ఈ ముక్కలు పోపులో వేసి రెండునిముషాలువుంచి దింపుకోవలెను. కమ్మటి వాసనతో ఈ కూర ఎంతో రుచిగా వుంటుంది.

### గసగసాలతో

పదిపలముల వంకాయలు, రెండుపలములు గసగసాలు ఎండుకొబ్బెర సగముచిప్ప కావాలి. గసగసాలు రాయిరప్ప లేకుండా బాగుచేసుకొని అరగ్లాసెడు పుల్లమజ్జిగలో నానవేయవలెను. పది నిముషములు నానిన తర్వాత రోటిలో ఎండుకొబ్బెర గసగసాలు వేసి మెత్తగా నూరవలెను. పుల్లమజ్జిగలోనే ముద్దగానూరి చిటికెడు పసుపు, కొద్దిగా వుప్పు రెండుస్పూనుల కారంవేసి మెత్తగా ముద్దఅగునట్లు నూరి వుంచుకొనవలెను. పది పలముల వంకాయలు గుత్తివంకాయకు తరిగినట్లు తరిగి ఈ నూరివుంచుకున్న పిండి కొద్ది కొద్దిగా అన్నిట్లో పెట్టవలెను. సన్నటిసెగ వుండేటట్లు పొయ్యిగాని కుంపటిమీదకాని వెడల్పు గిన్నెపెట్టి కొద్దిగా నూనెవేసి ఈ వంకాయలు అందులో వేయవలెను. మూతపెట్టి దానిమీద నీళ్లు పోయవలెను. మెత్తగా వుడికినతర్వాత దింపవలెను. ఈ మాదిరిగానే బీరకాయ దొండకాయలలో కూడా పెట్టి వండుకోవచ్చును.

యం. శాంత, అత్తిలి.

## ముల్లంగితో

ఈ రోజులలో ముల్లంగి జాస్తిగా దొరకుతుంది. ముల్లంగితో కూరచేయడము చిక్కు. దీని ఖరీదుకంటే వండడానికి అయే బొగ్గులు ఖరీదే హెచ్చు అవుతుంది. నేను ఒక సులువుఅయిన మార్గము చెప్పుతాను.

ఆరు లేతముల్లంగి దుంపలు శుభ్రముగా కడిగి పైతొక్కతీసి చక్రాలువలె తరిగి తడిలేని స్టీలుగిన్నెలో వేసి ఒక నిమ్మకాయ తరిగి రసము పిండవలెను. 3 టీ స్పూనుల కారము 2 స్పూనుల ఉప్పు ½ స్పూను పసుపు చిన్న ఇంగువముక్క మెత్తగానూరి దీనిలో కలుపవలెను. నాలుగు పచ్చిమిరపకాయలు చీరికలు తరిగి దీనిలో వేసి అరగంట సేపు వుంచినయడల బాగుగాఊరి చూడడానికికూడ పచ్చగా చాలా బాగుంటాయి. చపాతీకూరతో ఇదికూడా ఒక ఆదరవు అవుతుంది.

న్యాయపతి అమ్మాజీ (శ్రీకాకుళం)

## పెరటిలో అరటి

మొదలునుంచి చివరవరకు వుపయోగపడుతుంది అరటిచెట్టు. దీనిలో ఏభాగంకూడా వృథాపోదు.

మనం పెంచుకుందుకుకూడ ఎక్కువశ్రమ పడనక్కరలేదు. అద్దె ఇళ్ళలో ఏచెట్టు పెంచుకుందుకు మన స్వంతం కాదుగా అని బాధపడ్డారు చాలుతుంది. ఈ చెట్టుకు స్వంత ఇళ్లే కావాలని బాధలేదు. అద్దె ఇల్లయినప్పటికి పిలక (చిన్నమొక్క) వేసిన 10 నెలలు లేక సంవత్సరానికి గెల వెయ్యడమే కాకుండా దానిచుట్టూ 4, 5 పిలకలుకూడ బయలుదేరుతాయి. ఎక్కువస్థలం కావాలని లేదు. నీరు ఎక్కువగా కావాలి. ట్రాన్సుఫరు అయ్యే ఉద్యోగస్థులకైనా పిలకలు తీసుకు వెళ్ళదల్చుకుంటే భూమిలోంచితీసిన రెండు రోజులకు తిరిగి నాటినా బ్రతుకుతుంది.

కంచాలలో భోంచెయ్యనివారికిగాని, టిఫిన్లకిగాని ఆకులు అస్తమానం వుపయోగపడుతుంటాయి. పువ్వువచ్చి గెలవేసిన తర్వాత పువ్వుకోసి కూర వండుకోవచ్చు. పువ్వుకోసేటప్పుడు ఆసొన ఏమాత్రం బట్టల మీదపడ్డా బట్ట చిరిగినా ఆ మరకమాత్రం పోదు. గచ్చు నేలమీదపడ్డా తొందరగాపోదు.

పువ్వుపైన కప్పపడే డిప్పలుతీసి అరటి అత్తాలమాదిరి వుండేలోపల పువ్వులుతీసి జాగ్రత్తచెయ్యాలి. ఈపువ్వులలో ఒకభాగం "దొంగ" అంటారు. అగ్గిపుల్లలాగవుంటుంది. అదితీసి పారెయ్యాలి. అదిమాత్రం ఎంత ప్రయత్నించినా వుడకదు.

ఇంక మిగిలిన భాగం 2, 3 రకాలకూరలు తయారుచెయ్యవచ్చు. వడలు వేసుకోవచ్చు. వడియాలు పెట్టుకోవచ్చు.

వడలు: శెనగపప్పు నానవేసి రుబ్బి పువ్వు సన్నగా తరిగిన ముక్కలు వుల్లిపాయ పచ్చిమిర్చిముక్కలు వేసి వడలు వేసుకుంటే బాగుంటాయి.

వడియాలు: మినపప్పు నానేసి గట్టిగా రుబ్బి ఈ పువ్వు ముక్కలు సన్నగా తరిగి, వుల్లిముక్కలు, పచ్చిమిర్చిముక్కలు, అల్లం ముక్కలు కలిపి వడియాలు పెట్టుకోవచ్చు. వుల్లి వాసనకిట్టనివారు ఇంగువ వేసుకోవచ్చు. పళ్లులేని పెద్దలకు ఈవడియాలు నోట్లో వేసుకుంటే కరిగిపోతాయి.

పువ్వులో ఇంకొకభాగం వుంది. దాన్ని "పిలేళ్ళు" అంటారు. ఇది పువ్వులోపువ్వు కాయ ఆకారంగా వున్నభాగానికి ఒక ప్రక్క పొరలాగ కప్పివుంటుంది. ఇది కూరలో వేసినా వుడుకుతుంది, కాని కొంత మంది వేరేతీసి పచ్చడి చేసుకుంటారు.

పచ్చడి: నేతిలో ఈ పొరలు వేయించి పళ్లెంలోతీసి పెట్టుకుని ఆ గిన్నెలోనే ఎండు మిర్చి, మినపప్పు, మెంతులు, ఆవాలు, ఇష్టమైతే ఇంగువవేయించి తీసుకోవాలి. అప్పుడు వేయించినపిలేళ్ళకు తగినంతవుప్పు, చింతపండు, పసుపు, ఇష్టమైనవారు బెల్లం కూడ వేసుకుంటారు. అవిఅన్నీ మెత్తగా నూరి వేయించి పెట్టుకున్న తాలింపు అముద్దలో వేసి నూరుకుంటే బాగుంటుంది.

కాయ వుపయోగమూ,దూట లేక ఊచతో

# నల్లనివాళ్లంటే   ఎందుకంత హేళన?

పిల్ల నల్లగా ఉంటుంది కాబట్టి మరో వెయ్యి ఎక్కువిస్తే గాని ఒప్పుకోను సూరమ్మొదినా! అంటూ జ్ఞానోపదేశం చేస్తోంది పొరిగింటి పేరమ్మగారు.

ఆ—అవునంటే. కాకపోతే ఆ నల్లపిల్లని ఎవరు చేసుకొంటారూ? అంది సూరమ్మత్త నిరసనభావంగా!

అదేం టత్తా! మరి నువ్వూ, బావా నల్లగానే ఉంటారుగా! అంది వాళ్ళ మాటల్ని వింటున్న చెల్లి పదేళ్ళది అమాయకంగా.

హుం—వేలెడు ఉన్నావో లేదో కానీ, అన్నీ నీకే కావాలి. ఫో యిక్కడినుంచి అంటూ గసిరికొట్టింది అత్తయ్య.

నలుపంటేనే చాలు చాలామందికి నిరసనభావం. కనుముక్కు తీరుకన్నా, తెల్లతోలుంటే చాలన్నట్లు చూస్తున్నారు. చూసే చూడొచ్చు ఎవరిష్టం వాళ్ళది. పేర్లూ? కతే పిల్లని, కాకని, కోకిలని, యిష్టం వచ్చినట్లనటం చాలా అన్యాయం. చిత్రమేమిటంటే యిలా అనేవాళ్ళల్లో చాలామంది నల్లవాళ్లే. వాళ్ళూ, వాళ్ళ పిల్లలూ నల్లగా ఉండొచ్చు గానీ, కోడలు మాత్రం తెల్ల జాంపండులా ఉండాలి. కోరచ్చును. కాదనలేం. ఎవరి అదృష్టం వాళ్ళది. కానితే కాస్త ఛాయ తక్కువయినంత మాత్రానా ఆ పిల్లని అనాకారి క్రింద కట్టేయడం చాలా ఘోరం. ఆమధ్య, అంటే దగ్గర దగ్గర సంవ

**సి. ఉత్తర**

త్సరం క్రిందట మా పెద్దమ్మ, తన కొడుక్కి సమంధాలు చూస్తూ తెల్లటి పిల్లకోసం తెగ వెతకసాగింది. మా ఆడబిడ్డ కూతురు ఉండాలిగా చేసుకోకూడదూ? పిల్ల కూడా లక్షణంగా ఉంటుందని అమ్మ అంటే!

ఆ—ఏమిటీ ఆ కాకినా? అంటూ వికారంగా ముఖం పెటింది పెద్దమ్మ. అంత అనాకారి కావాలనుకొన్నా. పెద్దమ్మ కోరిక ప్రకారం తెల్లపిల్లే కోడలయింది.

మొన్నీమధ్య వాళ్ళ ఊరు వెళ్ళినప్పుడు పెద్దమ్మవాళ్లి ఆడబిడ్డ యింటికి తీసుకు వెళ్ళింది. అప్పుడు చూశా ఆపిల్లని. బారెడు జడా, తీర్చిదిద్దినట్లుండే కళ్ళూ ముక్కూ, ఒడ్డూ పొడవుతో పిల్ల ఎంతో బావుంది. దానికి తోడు చదువు, దానికితగ్గ వినయం పిల్లని చూస్తూంటే ఎంతో ముచ్చటేసింది. ఈ పిల్లనా, కాకితో పోల్చటం?......

పెద్దమ్మకోడలు అర్భకురాలు. లోతుకు పోయినకళ్లూ, దొప్పచెవులూ, పాఅపళ్లతో ఉన్న ఆపిల్ల నాకేమంత బావున్నట్టనిపించలేదు.

ఆమాటే పెద్దమ్మతో అంటే, ఆ—దానికేం తెల్లటి తెలుపు, దాని తెలుపే చాలే యింటికి వేరేదీపం కూడా అవసరం లేదు. ఏమనుకొన్నావో – "ఎలుపు ఏడు వంకల్ని" కాస్తుందని మనపెద్దలు ఏనాడో చెప్పారు. నీకు తెలీదులే, అంటూ కోడలి తెలుపుని తల్చుకు తల్చుకు మురిసిపోతుంది పెద్దమ్మ. చాలా మందికి నలుపంటేనే అఘోరమైన హేళన.

మొన్నటికి మొన్న మా బంధువుల పాపకి పుట్టిన రోజు పండుగంటేనూ, నేనూ, మా ఆడబిడ్డా వెళ్లాం. ఆపాప తెల్లగా, బొద్దుగా చాలా బావుంది. మా ఆడబిడ్డకి పాపలంటే చాలా ముద్దు. ఆపాపని ఎత్తుకొని, ముద్దు పెట్టుకో బోయింది. ఆ ఆ ముద్దు పెట్టుకోకు మా పాపకి నీ నలుపంటుకొనేను. అంది ఆ యిల్లాలు నవ్వుతూ. అక్కడున్న వనితలందరూ ఆ మాటకి పక్కున నవ్వేరు. నా మనస్సు చివుక్కుమంది. తోటిస్త్రీకి అవమానం జరిగితే ఓదార్చ వారికన్నా, హేళన చేసి, ఏడ్పించేవారే ఎక్కువన్న సంగతి తెలిసిందేగా? ఒక్కనిమిషం స్థాణువులా నిల్చుని మెల్లగా పాపని దించేసింది మా ఆడబిడ్డ. అరే! కోపం వచ్చిందేమిటి? హాస్యానికి అన్నాను అందా యిల్లాలు అతి తేలిగ్గా. హాస్యానికవుతే మాత్రం అంత మందిలో అలా అనటం ఏంబా ఉంటుంది? హాస్యానికి సమయం సందర్భం ఉండొద్దూ? కళ కళ లాడుతున్న పిల్ల ముఖం ఆవక్క మాటతో వాడిపోయింది. ఎంతో సరదాగా నవ్వుతూ తిరుతూ వచ్చినపిల్ల భరించలేని అవమానంతో, దుఃఖంతో యింటికొచ్చింది. ఆడదానిగా పుట్టడమే దురదృష్టం వదినా! అందులో నల్లగా పుట్టటమంత దురదృష్టం మరొకటి లేదంది బాధగా. ఆ వక్కమాటని బట్టి గ్రహించుకోవచ్చు ఆపిల్ల మనస్సెంత గాయపడిందీను. నిజంకూడా అలానే ఉంది. పిల్ల కాస్త నల్లగా ఉందంటే పెళ్ళి చేయడం కూడా చాలా కష్టంగా ఉంది. వేలకు వేలు పెంచేస్తున్నారు కాస్త ఛాయ తక్కువ ఉన్నంత మాత్రాన. యింతకీ చెప్పొచ్చే దేమిటంటే రంగుకాదూ, పిల్ల గుణగణాలు కావలసిందని. నలుపయినంత మాత్రాన ఆ పిల్లని అనాకారి క్రింద కట్టేయకూడదు. ఆ మాటకొస్తే నల్లపిల్లలకి ఉన్నకళా, కళ్ళల్లో తళుకూ, తెల్లటివాళ్ళకి ఉండనే ఉండదంటే అతిశయోక్తి లేదు. ఏది ఏమైనా నల్లటివాళ్ళని చూసి హేళనచేసి ఏడ్పించడం సబబుకాదు. 

## వంటలు

వంటానే చెప్పనక్కరలేదు. అందరికీ తెలిసినదే.

కాయలన్నీ ముదిరి గెల కొట్టినతర్వాత ఆ చెట్టుముఖం చూడగూడదంటారు పెద్దలు. అల్లా చెప్పకపోతే చెట్టుకొట్టడం అశ్రద్ధ చేస్తారనిన్నీ మిగిలిన చిన్న మొక్కలకు బలం చాలదనిన్నీ అల్లా భయపెట్టివుంటారు. భయపెట్టినపనిగాని తొందరగా చెయ్యంగదా.

కొట్టినచెట్టుని ముప్పాతికగజాని కొకముక్క చొప్పున నరికి పైపొరలన్నీ జాగ్రత్తగా వూడదీసి చాకుతో సాపుచేసి రెండు కలిపి, ఒక విస్తరి కుట్టుకుంటే తెల్లగా దాంట్లో భోంచెయ్యడానికి ఎంతో సరదాగా వుంటుంది కాని చాల శ్రమతో కూడినపని.

అరటిచెట్టులోవుండే భాగాలన్నీ వుపయోగించి పొదుపు చేసున్నాముగదా అని వాడా వడిలో ఏమాత్రం చోవ బట్టలమీద పోను వున్నా "పంచి లాభం పెజ్జంకూడ దీసినట్లు" అబట ఇంక మళ్ళీ పనికిరాదు. అరటికాయ తప్ప మిగతా భాగాలు వుపయోగించడం చాలశ్రమ.

పాకలసీత, ఏలూరు.

## గమనిక

గతవారం 'వనితావాణి'లో 'మీ రిచ్చిన మంచి సలహా' అన్న లేఖ వ్రాసినవారు శ్రీమతి బలభద్రుని వరలక్ష్మి (విజయనగరం) అని గమనించ ప్రార్థన.




పేలు చాలామంది చిన్నపిల్లలకి వుంటాయి అవి పోవటానికి నాకు తెలిసిన కొన్ని విషయాలు వ్రాస్తున్నాను, ప్రయత్నించి చూడండి. ఇది సీతాఫలాలు వచ్చేకాలం కాబట్టి సీతాపళ్లయొక్క పిక్కలు పదిగానీ పన్నెండుగానీ తీసుకుని కొద్దిగా నీళ్ళుపోస్తూ మెత్తగా నూరి ఆ ముద్ద తలకి వ్రాసి రెండు మూడు గంటలు వుంచి తరువాత తలకి స్నానం చేయించాలి. ఇంకొక రకం: ఇది తలమీద పేలుకే కాకుండా తలమీది కురుపులకి కూడా చాలా బాగా పని చేస్తుంది. కుంకుడుకాయలు నల్లగా కాల్చి వాటిని మెత్తగానూరి వస్త్రకాళితంచేసి అందులో కొద్దిగా కొబ్బరినూనె కలిపి తలకి రాసి మొదట చెప్పినట్టుగా రెండు మూడు గంటల అనంతరం తలకి స్నానం చేయించాలి. ఇట్లా రెండు మూడు రోజులు చేసేటట్లయితే వాళ్లకి మరి అసలు పేలు కురుపులూ వుండవు. కుంకుడుకాయలో వున్నటువంటి చేదు పేటిని మళ్ళీ దగ్గరకి చేరకుండా చేస్తుంది. నేను చిన్నప్పుడు కురుపులతో చాలా బాధపడేదాన్ని. మా నాన్నమ్మ ఈ కుంకుడుకాయ వైద్యంతో నాబాధ నివారణ చేసింది. అందువల్ల నేను ఇది రాశాను.

కడుపు కీసు: వేడిచేస్తే ఈ కడుపుకీసు తరుచుగా వస్తుంది. అప్పుడు ఒకటో రెండో బత్తాయిపళ్ళ రసంతీసి అందులో రెండు స్పూన్లు (చెమ్చాలు) పంచదార కలుపుకుని రెండుమూడు రోజులు వరసగా త్రాగుతే తగ్గుతుంది. బత్తాయి పళ్ళులేని కాలంలో ఎట్లా అనే సంశయం మీకు రావచ్చు. ఆ పళ్ళు దొరకనప్పుడు. ఒక అర చెమ్చా మెంతులు, ఒక అర చెమ్చా పెరుగులో కలుపుకుని తాగునే తగ్గుతుంది. కానీ అంతకంటే వేగం పనిచేస్తుంది నూనె మెంతులూ కలుపుకుని తాగితే కాస్త కష్టంగా వున్నా త్వరగా తగ్గుతుంది. ఇది కూడా అరచెమ్చా నూనె, అరచెమ్చా మెంతులే. ఈ రెండూ ఉదయం పరగడుపునే సేవించాలి.

వొళ్ళు తిప్పు: కొందరికి అప్పుడప్పుడు పైత్యంవల్ల వళ్ళు తిరుగుతుంది. అట్లా వళ్ళు తిరిగినప్పుడు నిప్పుమీద జీలకఱ్ఱ వేసి ఆదూపం పట్టిస్తే తక్షణం తగ్గుతుంది. శిరోజాలు(జుత్తు) కూడా వేడిచేస్తే వూడిపోతాయి. ఒక్కొక్కరు ఎన్ని రకాలు నూనెలు వాడినా ఆ వూడటంమానదు. ఉదయంమనం నూనెరాసుకునేటప్పుడు (కొబ్బరినూనె) తొలి రోజు కొంచం నీళ్ళు కొంచం కొబ్బరినూనె కలిపి (రంగరించి) రాసుకుంటే మరిజుత్తువూడటం అనే మాటే వుండదు. ఈ రాసుకోవటం కొన్నాళ్లేకాకుండా ప్రతినిత్యం రాస్తే వేడివల్ల వచ్చేటటువంటి తలపోట్లువగైరాలు కూడా వుండవు. ప్రతిరోజూ సాంబ్రాణి దూపం వేసుకున్నా జుత్తు వూడటం కట్టిపోతుంది. సాంబ్రాణిదూపం వేసుకున్నాక జుత్తు ఒక గంటదాకా విప్పకుండా వుంచుతే ఆ సాంబ్రాణిదూపంవల్లా, నూనె నీళ్ళు కలిపి రాసుకోవడంవల్లా జుత్తుకూడా పెరుగుతుంది. అని నాఅనుభవంవల్ల చెపుతున్నాను. అయితే ఈ రెండు కొన్ని రోజులుచేసి కొన్ని రోజులు మానేసేకంటే ప్రతినిత్యం చేస్తే దీని వుపయోగంవల్ల వచ్చినటువంటి ఫలితం మనకి తెలుస్తుంది.

**బలభద్రుని వరలక్ష్మి-విజయనగరం**

---

ఈ శీతాకాలములో రాత్రులు ఉదయకాలమందు వచ్చేదగ్గుకు దివ్యమైన మందు: కరక్కాయపేడు, 10 మిరియాలు, 5 లవంగాలు మెత్తగా పొడుముచేసి మంచిబెల్లముతో చిన్న ఉండలుగా చేసుకొని (గచ్చకాయంత మాత్రలు) రాత్రులు పరుండబోవునప్పుడు బుగ్గను పెట్టుకొనిపరుండవలెను. 3 అవున్సులు పాలు కూడా తాగుతే దగ్గు, కఫ తగ్గును. మూడు రోజులు వాడితే ఏ రకము దగ్గైనా శ్లేష్మమైనా తగ్గిపోవును. శీతాకాలములో వాడుటకు మంచిది. కడుపు, జీర్ణకోశము, ఊపిరితిత్తులమీద బాగా పనిచేయును.

ఇవటూరి శ్యామలాదేవి.
తెనాలి.

---

## వనితలకు వినతి

"అయ్యా, ప్రచురించబడిన నా స్వల్పరచనలకు పత్రికైన పంపని కారణమును దయతో తెలుపగలరా? కొందరు రచయితలు, తాము అందుకొనుచున్న పారితోషికములతోను, పత్రికలతోను ఉప్పొంగుచున్నారు. నాకు కనీసము పత్రికయైనను అందుటలేదు. కారణమేమిటో-".

అని ఒక రచయిత్రిలేఖ వ్రాసింది. ఇలాగే ఇంకా చాలమంది వ్రాస్తున్నారు. కారణం ఒకటే:

ఇలా లేఖలు వ్రాస్తున్నవారు, తమ చిరునామాలను మటుకు వివరంగా వ్రాయటంలేదు. కొందరు పేర్లుకూడా వ్రాయటం మరచిపోతున్నారు. పేరువ్రాసినా కొందరు బెజవాడ అనిచెప్పి ఊరుకుంటున్నారు. ఈ పొరపాటును గుర్తించి, ప్రతివారు తమ రచనలచివర పూర్తిపేరు, చిరునామా వ్రాయగోరుతున్నాము.

పంపిన రచనలగురించి వెనువెంటనే లేఖలు వ్రాయవద్దనీ, రచనలతో రిప్లై కార్డు జతచేసి పంపవద్దనీకూడా కోరుతున్నాము. రచన, ఉపయోగపడనిపక్షంలో తిప్పిపంపడానికై, బరువునుబట్టి, రివయా పైసలకు తక్కువకాకుండా తపాలా బిళ్ళలను జతపరచి పంపాలి.




శ్రీమతి ఆదిమధ్యం రమణమ్మగారు, "ఆడవాళ్లల్లోనే ఆత్మహత్యలు ఎందుకెక్కువ" అన్న వ్యాసం చాలా బాగా వ్రాశారు. ప్రపంచంలో స్త్రీల దుస్థితిని వున్నదున్నట్టుగా చూపెట్టేరు. ఆమెకు నా ధన్యవాదాలు. కొంచెం మించుమించుగా ఆమె చెప్పిన మూడు కారణాల్లో ఏదోఒక దానివల్లనే అనేక కుటుంబాల్లో ఒకరిద్దరు నిర్భాగ్య స్త్రీలు ఇలా బలిఅవుతున్నారనవచ్చు. వారి కరుణామయ విషాదగాథ బంధువుల మనస్సుల్లో జాలిగా ముద్రవేసుకుంటోంది.

కారణంలేకుండా చనిపోయే నిర్భాగ్యలనుగూర్చి నాకు తెలిసిన రెండుముక్కలు చెబుతున్నా. ఫలానా అమ్మాయి చనిపోయింది అంటారు. ఆమె చనిపోయిన కారణం మాత్రం ఎంత గింజులాడినా దొరకదు. దూరమాలోచిస్తే అనాదినుంచి నేటివరకు భారత నారికి మానమే ప్రాణం. ఆమె శీలరక్షణకు ప్రాణాన్ని తృణంగా యెంచుతుంది. దాన్ని గురించి భర్తగాని తదితరులుగాని పొరపాటునైనా శంకించి పల్లెత్తుమాటన్నా ఆమె సహించదు. కొందరు భర్తలు భార్యసన్నిహితులైన బంధువులతో మాట్లాడినా శంకిస్తారు. ఆడదానికి సన్నిహితులు (మేనమామలు, పినతండ్రులు) ఇంక తన చిన్నతనంనుండి ఇంటికి వచ్చిపోయెడు అక్కభర్తలుగాని, మేనత్త, మేనమామల పిల్లలుగాని, వీరిలో ఏవొక్కరితోనైనా కొంచెం సరదాగా మాట్లాడితే శంకించే మగవారున్నారు.

ఆడది అబల. ఒకబాధవస్తే దాని నిభరించే శక్తిలేక మొండిగా ప్రాణానికే తెగిస్తుంది. దాంతో నిజానిజాలు గ్రహించని లోకం, ఏ అపనింద పడడం దుర్భరమై ప్రాణాలు విడిచిందో, అదే అపనింద యథార్థమంటారు. కొందరు అత్తమామల నంటారు. కొందరు భర్తనంటారు. కొందరు ఆమెనే అంటారు. ఇలా ఎంతెంతోమంది చనిపోయిన అసలు కారణాలు తెలియరావు. ఇలా చనిపోయేవారిలో, మంచిస్థితి హోదాగలభర్త, కడుపెడు బిడ్డలుగల తల్లులు సైతంవున్నారు.

ఉదాహరణకు ఒకటిరెండు మచ్చుకు మీకు చెబుతా.

రాణి 18 సంవత్సరాల అమ్మాయి. ఆ రోజు నాకింకా జ్ఞాపకం. పిలవడానికి వచ్చింది.

ఏమిటి పిలుపు రాణీ అన్నాను నవ్వుతూ.

బాబు పుట్టినరోజండి అంది. రేపు తప్పకుండా రండీఅని చెప్పివెళ్ళింది.

మర్నాడు రాణి వాళ్ళఇంట్లో బాబు ఏడాది పుట్టినరోజు ఘనంగా చేసేరు. ఇటు అత్తమామలు, అటు తల్లి తండ్రులు బాబును ఆశీర్వదించి ఆనందించేరు. పేరంటానికి వెళ్ళిన మేమంతా రాణీ చాలా అదృష్టవంతురాలు అనుకున్నాం. మర్నాడు ఇంకా సరిగా తెల్లవారలేదు. మా పనిమనిషి పరిగెత్తుకుంటూ వచ్చి రాణమ్మగారు నూతిలో పడిపోయారమ్మా బాబు గోల చూస్తే కడుపు తరుక్కుపోతోందమ్మా అని చెప్పింది. చుట్టుపట్ల వాళ్లంతా ఎక్కడివక్కడ వదిలేసి పరిగెత్తేం; రాణి ఈలోకం విడిచిపెట్టింది. అందాల బొమ్మఅయిన రాణి నిద్రపోతున్నట్టుంది. తల్లిదండ్రీ రోదిస్తున్నారు. భర్త బిడ్డణ్ణి వొళ్లో పెట్టుకు పెల్లుబికేదుఃఖాన్ని ఆపుకోడానికి ప్రయత్నిస్తున్నాడు. అత్తమామలు బిడ్డ కష్టానికి పడే బాధ వర్ణనాతీతం. అల్లారు ముద్దుగా చూసే తల్లి తండ్రులు అత్తమామలు సుందరుడైన భర్త అన్నింటికన్నా ముఖ్యం పసిపిల్లవాడు ఇన్ని కలిగిన రాణి ఎందుకు చనిపోయింది. కొందరు అత్తగారు హింసించిందన్నారు. మరికొందరు భర్త అనుమానించేడన్నారు. ఇలా ఎవళ్లకి తోచిన కారణం వాళ్ళనుకున్నారు. రాణీ ఏ బలవత్తర కారణంవల్ల బలి అయిందో నాటికీ నేటికీ తెలియనే లేదు.

అలాగే మా బంధువుల అమ్మాయి చనిపోయింది. కారణం దురూహ్యం. 6 నెలల పిల్లవాడు చనిపోయాడనుకోండి. అదే కారణమనడానికి వీల్లేదు. తనను కని ఎంతో కష్టనిష్ఠురాల కోర్చి పెంచి పెద్దచేసిన తల్లి నాదైనా తలచకుండా తన దోవతను చూచుకొంది. ఏ విషమ పరిస్థితులలో అలా చేయాల్సొచ్చిందో ఎవ్వరికీ తెలియదు.

ఇలా చనిపోయేవారిని గూర్చి చాలా చాలా కథలు వింటూంటాం. అవి పైకి కనపించేదాన్ని బట్టి అల్లినవే. అసలు కారణం ఎవ్వరికీ తెలియదు. ఏది ఏమైనా ఈ పరిస్థితుల్ని యెదిర్చే ధైర్యం వనితలు తప్పక నేర్వాలి.

డి. భాస్కరమ్మ, వంగోల్.

* * *

## కన్నవీ, విన్నవీ

మావీధిలో ఒక ఉపాధ్యాయుడుండే వారు. అతని భార్య క్రొత్తగా కాపురానికి వచ్చింది. ఆమె చాలా అందగా వుండేది. ఆమె ఎప్పుడైయినా, బయటకు వస్తే మేమందరము రెప్పవాల్చక, అలాగే చూచే వాళ్లము. ఆమె యిరుగు పొరుగులో ఎంతో స్నేహంగా ఉండేది. ఎవరైనా యింటికి వెళ్లే వారితో ఎంతో ఆప్యాయంగా మాట్లాడేది. యిలా కొద్ది రోజులు గడచినవి. అంతలో అత్తగారు వారింటికి వచ్చారు. తల్లిరాగానే ఆ ఉపాధ్యాయుడు ఎంతగానో మారిపోయాడు. ఇంటిలో కలతలు బయలుదేరాయి. కోపంతో భార్యను బాగా కొట్టేవాడు. సమయంచూచి అత్తగారు కూడ రెండు బాదేది. యిదేవరసని కొద్ది రోజులు సాగింది. వారి యింటి ప్రక్కనున్న మాకు రోజూ ఏవో గుద్దులు, సన్నని మూలుగు వినవస్తుండేది. ఈప్రకారం, రెండు మూడు నెలలు సాగినపిదప ఆమె ఆ నరకబాధ భరింపలేక, మధ్యాహ్నంపూట ఎవరూ యింట్లో లేక పోవటం గమనించి ఉరిపెట్టుకొని చనిపోయింది. ఆ రోజు ఆమె చేసుకున్న ఆత్మహత్యను, తల్చుకుంటే యిప్పటికి మాకు కండ్లు చెమ్మగిల్లుతాయి.

మంచుకొండ జయప్రద,
ఖమ్మంమెట్.

* * *

## చేతులు కాలిన -

ఒక ఏడాదిక్రితం అనుకొంటా...మా వీధి చివర వుండే కుటుంబంలో జరిగిన విషయం తెల్పుతాను. వాళ్ల ఇంటిలో ఒక కన్య వుండేది. ఆమెకు పెండ్లి నిశ్చయం చేసినారు. అయితే ఆ కన్యకు ఈ సంబంధం ఇష్టము లేదట. తనకు ఈ సంబంధం ఇష్టంలేదని, తల్లిదండ్రులకు తెలిపిందట. కాని ఆమె

మాటలను వారు వినిపించుకోలేదు. "పెళ్ళి వారికి మాట ఇచ్చినాము. ముహూర్తంకూడ ఫలానా తేది అని ఖాయం చేసినాము. మాట తప్పడం మర్యాదకాద"ని చెప్పినారట. మరుసటిదినము బాత్ రూములో ఆమె శవముంది. కిరసనాయిలు పోసుకుని నిప్పంటించుకుంది. ఆ శవము చూస్తూనే అందరూ బావురుమని ఏడ్చారు.

చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకుని ప్రయోజనమేమిటి? కాని తరచు జరిగేది అదే. ఈ సమస్యను బాగా వివరించిన రచయిత్రికి అభివందనలు.

వి. అహల్యాదేవి, బళ్ళారి,

* * *

## విరుగుడు

నేటి సాంఘిక వ్యవస్థలో అనాదిగ వుంటున్న అతి ముఖ్య సమస్యను పురస్కరించుకొని బహు చక్కగా వివరించారు. నిజమే! ఆత్మహత్యలు స్త్రీలలోనే యెక్కువ. అదీయువతీదశలో ఉన్న స్త్రీలలోనే ఎక్కువగా కనిపిస్తూవుంది. కారణం ఒకవిధంగా పురుషప్రపంచమే అని అనకతప్పదు. అసలు స్త్రీమీద పురుషునికి అధికృత ఎలావచ్చింది? తను ఆర్జించి తనప్రత్యేకతను చూపించుకుంటున్నాడు. గాని స్త్రీకి, ఆవిధమైన స్వేచ్ఛ లేకుండా చేసేశాడు. అందునుంచి దీనికి విరుగుడుగా, స్త్రీకూడ స్వయంశక్తి కలిగిందానిలా తయారవాలి. ఎంత కష్టమయినా పడి చదువుకొని, తగిన వుద్యోగం సంపాయించిన వరకు, స్త్రీవివాహము తలపెట్టనే కూడదు. ఈనాటి యువతి పూర్వపుయువతి కన్నా చాల అదృష్టవంతురాలు. కొందరు వుదారస్వాంతులైన పురుషులు స్త్రీ విద్యకై కృషి చేస్తున్నారు. దానిని ప్రభుత్వం కూడ ఆమోదించింది. అందునుంచి ఈసమయాన్ని చక్కగా వుపయోగించుకొని, రాబోయే తరము స్త్రీలనే నా స్వయంపోషకులుగా చెయ్యాలి. దానికి యువకులు, తమ తల్లిదండ్రులను ఎలా అయినా వొప్పించి, తమ తమ అక్కచెల్లెళ్ళను విద్యావతులుగాను, తరువాత ఉద్యోగులుగాను చేయడానికి తీవ్రమైన కృషి చెయ్యాలి. ఈ కార్యక్రమంలో బంధువుల లేదా స్నేహితుల విమర్శలను ఎంతమాత్రం పరకు చెయ్యకూడదు. బాలికలైన స్త్రీలుకూడ ధైర్యం వహించి ముందడుగు వెయ్యాలి. తాము చేస్తున్న పనిలో పూరా నమ్మకం వుంచాలి.

నేటి, సాంఘి పరిభాషలో "స్త్రీ ఊళ్ళేలాలా, ఉద్యోగాలు చెయ్యాలా?" అన్న సామెతను తుడిచి పారవెయ్యాలి. మనది బీద దేశం, అందునుంచి అందరికి విద్య అందదు. దానికి మహిళా మండలులు, ఉదారులైన స్త్రీపురుషులు, బీద బాలికలకు చేయూత నివ్వాలి. వారిలో విద్య, విజ్ఞానం, పెంపొందించాలి.

గాడ జానకిరాయుడమ్మ, బరంపురం.

* * *

వ్యాసం చాల బాగుంది. ఆర్థికంగాను, సాంఘికంగానూకూడ స్త్రీకి స్వాతంత్ర్యము లేకపోవుటచే, అనుకోని అవాంతర పరిస్థితులు వచ్చినప్పుడు ఆత్మాభిమానంగల భారత స్త్రీకి ఆత్మహత్యే అనాదిగా పరిష్కార మార్గంగా కనిపిస్తోంది. సంఘం ఇంతగా అభివృద్ధి చెందుతున్నా స్త్రీ తన కాళ్ళమీద తను నిలవగలస్థితి ఇంకను రాలేదు కనుక, కనుకటంత కాకపోయినప్పటికీ, నేటికీ ఆత్మహత్యలు చెదురువాటుగా జరుగుతూనే ఉన్నవి. స్త్రీ పురుషునితో సమానంగా అన్నిరంగాలలో ఏనాడైతే పురోగమించగలదో, నాటికి ఆత్మహత్యావసరం తప్పుతుంది. అందుకు స్త్రీకి ఆస్తిపై సంపూర్ణ హక్కు, ఉత్తమవిద్య, ఉద్యోగ వ్యాపకం అవసరం. ఇవి సాధించబడిననాడు ఈ దుస్థితి దానంతటదే సమసిపోతుంది.

నైషధం శివప్రసాద్, (తెనాలి).

* * *

సమస్యను చిత్రించడంతోపాటు నివారణకు కూడా చక్కటి వుపాయాలు తెలియచేశారు. ఈ వ్యాసం ప్రతిఒక్కరు చదవవలసినది.

ఇనమనమెళ్ళూరు రామచంద్ర సత్యనారాయణ, గూడూరు.

* * *

వాస్తవికంగా, ఎటువంటి జంకు లేకుండా వ్రాశారు. ఇందుకు ఆ రచయిత్రికి నా వందనాలు.

బయన పెద్దన్న, (సత్తెనపల్లి).

* * *

స్త్రీకి సంఘంలో మంచి స్థానం వుండి గౌరవం, స్వేచ్ఛా వున్నప్పుడు తప్పకుండా ఈ ఆత్మహత్యలు తగ్గగలవు.

మునుకుట్ల సూర్యకాంతం, (విజయవాడ)

* * *

## ఓర్పు లేక

పురుషులలో ఉన్నంత, ఓర్పు, సహనము, దూరాలోచన, స్త్రీలలో లేకపోవుటే ఇందుకు కారణము. ముఖ్యముగా స్త్రీలలో ఓర్పు వుండాలి.

ఫాతిమా సుల్తానా (కాకినాడ

* * *

# బాల సాహితి

## కుక్క నీతి

పనప గ్రామమందు ఒక్క
  ముసలిది పది డబ్బులను
  మూటకట్టి ఊరు చివర
  కాపురంబు చేయుచుండ—

డబ్బు దాచుకొనగ అవ్వ
  తలక్రిందై గ్రామమందు
  పరిచితు డగు నొకనితోడ
  ప్రస్తావించింది-అంత—

ఆ నేర్పరి ఇట్లు చెప్పె,
  అవ్వ మనసు నచ్చునట్లు:
  "నాకడ ఒక కుక్క కలదు
  నాణ్యమైన కుక్క నిజము—

నీ ధనాని కది సాయం
  నిలుస్తుంది; భయంలేదు;"
  మరునాడే కుక్క పెట్టె
  మామ్మయింట కాపురము—

ఇట్టులుండ అవ్వ ధనము
  ఎట్టులయిన తస్కరింప
  కాపు తలచి ఒక్క రాత్రి
  కన్నమునకు బయలుదేర—

ధనము మూట చేతపట్టి
  దాడుతీయనున్న వేళ
  కాలు పట్టుకొనియె కుక్క
  కాపు గుట్టు బయలుపరచె—

అలికిడి విని అవ్వ లేచి
  అంతయు గ్రహియించుకొనను;
  పరిచయస్తు జూచి నవ్వి
  పంపివేసె క్షమించుతూ—

"జంతువె విశ్వాసముతో
  సాయము చేసెను; నమ్మిన
  మనుజుడు మోసము చేసెను
  ధనము దొంగిలింపవచ్చె—

కుక్కకు గలనీతికూడ
  కుంటువడెనొ మనిషిలోన"
  అనుకొని యా కుక్కనెంతో
  అభిమానించినది అవ్వ

★ పుంఢ రామారావు. ★

# సంకల్పబలం

ఒక్కమారుగా వర్షం ముంచుకొచ్చింది. మబ్బులు కమ్మి, మధ్యాహ్నమైనా మసకచీకట్లు కమ్మేశాయి. పిల్లలుమాత్రం హుషారుగా ఉన్నారు. వాళ్లకు తెలుసు రామనాథం మేష్టారు ఇలాంటప్పుడు క్లాసు తీసుకోరని. కాని ఆయనకీ తెలుసు క్లాసు ఒదిలేస్తే మేమెంత అల్లరిచేస్తామో. అందుకే ఇలాంటి పీరియడు కథలకోసం ఉపయోగిస్తారాయన. పిల్లలందరికీ ఆయనంటే ఇష్టం ఏర్పడడానికి కారణంకూడా అదే. అయితే కథలు తనెప్పుడూ చెప్పడు. మాలోనే ఎవరైనా ఒక్కరు వచ్చి చెప్పమనేవారెప్పుడూ. కథలు చెప్పడమంటే మంచి సరదా ఉన్న నాకు మంచి అవకాశం చిక్కేది. ఎప్పుడూ మొదటికథ నాదే. దీనివల్ల మాకు కథలు చెప్పడమే కాక, స్టేజిమీద మాట్లాడడానికి ధైర్యం కూడా వచ్చేది. డిబేట్లలో మాక్లాసు నుంచి తప్ప మరెవ్వరికీ ప్రయిజు వెళ్లడానికి వీల్లేదు.

కిటికీలోంచి జల్లు కొంచెం వస్తూండడంవల్ల అందరూ గది మధ్యకే చేరి దగ్గర దగ్గరగా కూర్చున్నారు, నేనుచెప్పే కథ విందామనే ఆత్రుతతో. మాష్టరుగారి టేబులు ముందర చేతులు కట్టుకు ఠీవిగా నిలబడి మొదలుపెట్టేను నేను.

అనగనగా ఒక రాజు. ఆరాజుకు నలుగురు కొడుకులు. మొదలెట్టగానే సగంమంది గొల్లుమన్నారు. తర్డుఫారం స్టూడెంట్స్‌కి ఇలాంటి కథలు చెప్పడమా అని రోషంతో మూడోవరుసలోంచి సర్రునలేచాడు సూర్యారావు. అయితే బామ్మగాలూ! లాజుగాలికి ఏలుగులు కొలుకులు ఉండాలి కదా? ముగ్గులు ఎప్పులు తత్తిపోయాలండీ, అంటూ ఎత్తిపాడిచాడు. అందరూ మళ్లీ గొల్లున నవ్వారు. కాని నేను చెప్పే కథలు అలాంటివి కావని మామాష్టారికి తెలుసు. ఒరే సూరిగా నువ్వు కూచో పూర్తిగా వినకుండా నీగోలేమిటి? విన్నాక బాగులేకపోతే అంతకంటే మంచిది నువ్వు చెప్పొదువుగాన్లే, అన్నారు. సూరిగాడికి వెక్కిరించడం తప్ప కథలు చెప్పడం వస్తేగా? ఏమీ అనలేక కూర్చుండిపోయాడు.

నేను మళ్ళీ కథ మొదలుపెట్టాను. "వైభవంగా సాగిపోతున్న రాజుగారి జీవితంలో కొన్నాళ్ళకు కష్టాలు మొదలెట్టాయి. దేశంలో కరువు, రాణీగారి మృత్యువు ఒకేసారి రావడంతో, రాజుగారు ధైర్యం కోల్పో

యారు. అదే సమయం చూచి, శత్రువులు కూడా కోటను ముట్టడించారు. యుద్ధంచేస్తే కష్టాలతో బాధ పడుతున్న సైనికులని మరింత బాధ పెట్టి రక్తపాతం కలుగజెయ్యడం తప్ప మరేమీ లాభం ఉండదని తెలిసి, రాజు కోశాగారంనుంచి చేతికి చిక్కినంత ధనం తీసుకొని, తన నలుగురు కొడుకులూ వెంట రాగా పారిపోయి రాజ్యాన్ని రక్త పాతంలేకుండా శత్రువులకు స్వాధీనం చేశాడు.

వాళ్ళవెంట సేవకు లెవ్వరూ లేక పోయినా, నలుగురు రాజపుత్రులనీ తన చేతులతో పెంచిన దాదిమాత్రం వాళ్ళను విడిచిపెట్టలేక వాళ్ళతోనే బయలుదేరింది.

దారిలో కనిపించిన ఒక పెద్ద పట్టణంలో ఆగి అక్కడే స్థిరనివాసం ఏర్పరచుకోడానికి వాళ్లునిశ్చయించు కున్నారు. వెంట తెచ్చిన డబ్బుతో ఒక మంచి భవనం కొని అందులో ఉండేవాళ్ళందరూ.

మహారాజభోగాలకి అలవాటు పడిన రాజుగారికి డబ్బు మంచి నీళ్ళలా ఖర్చవుతూంది. కష్టాలవెంట కష్టాలు వచ్చిన విచారంవల్లా, ఈ డబ్బయిపోయిన తరువాత ఏమిటి చెయ్యడమా? అనే బెంగతోను మంచంపట్టిన రాజుగారు ఎన్నాళ్ళో జీవించలేదు.

రాజ్యంలేని నలుగురు రాజ కుమారులూ, వాళ్లని ఓదార్చడానికి ముసలిదాదీ మాత్రం ఆ భవనంలో మిగిలారు. రాజ్యం పోయినా ఈ వూళ్లో గొప్ప జమీందారుగారి పిల్లలుగా ఛలామణీ అవుతున్న వాళ్లకి ఈ భవనం అమ్మేసి, బీదవాళ్లుగా ఉండటం పరువుతక్కువ అనిపించింది. వారి గౌరవం నిలబెట్టుకోడం కోసం ఏమిటి చెయ్యడమా? అని ఆలోచిస్తూ ఉండగా అందరికన్న చిన్నవాడు అన్నలతో ఇలా అన్నాడు:అన్నయ్యా! మన గౌరవం నిలబెట్టడానికి నేను ఏమైనా చెయ్య దలుచుకున్నాను. ఈ దేశపు రాజు గారు ఈ పట్టణంలో పెద్ద కోట నిర్మించి తన రాజధానిని ఇక్కడకు మార్చుకుందామని నిశ్చయించేరు. వందలమంది మనుష్యులు రాత్రి, పగలు పనిచేస్తున్నారు. కాబట్టి ఈ రాత్రినుంచి నేను కూలివాడి వేషంలో వెళ్లి పనిచేస్తాను. కాగడాల గుడ్డివెల్తురులో నన్నెవ్వరూ పోల్చ లేరు. పగలుమాత్రం మనం ఆ డబ్బుతో గౌరవంగా బ్రతకవచ్చును" అన్నాడు. ఈ మాటలు విన్న పెద్ద కొడుకు కళ్ళనీళ్ళు పెట్టుకొని "తమ్ముడూ! మనకెంత గతిపట్టింది! విధివ్రాత! మనమేమిచేస్తాం? కాని నా కంఠంలో ప్రాణం ఉండగా నువ్వలా కష్టపడుతూ ఉంటే నేను చూడలేను. తండ్రి తరువాత తండ్రి వంటివాడను నేను. మిమ్మల్ని పోషించవలసిన బాధ్యత నాది. వంశ

## సంకల్పబలం

గౌరవం నాకన్న మీ కెక్కువా? కాబట్టి రాత్రిపూట నేనేపనిచేస్తాను. మిమ్మల్నెందుకు కష్టపెట్టడం" అన్నాడు. అలాగే ఆ నలుగురిలో ప్రతిఒక్కడూ తనే పని చేస్తానని మిగతావాళ్లు సుఖంగా ఉంటే చాలునని అనడం మొదలుపెట్టారు. ఇదంతా చూస్తున్న దాది వాళ్లని సముదాయించి ఒక ఉపాయం చెప్పింది. ఒక సంచి తీసుకవచ్చి ఇలా అన్నది. "రాకుమారులారా! ఈ సంచిలో నాలుగు కాగితపు ముక్కలున్నవి. అందులో మూడింటిమీద మీ తండ్రిగారి ముద్ర ఉన్నది. నాలుగవదానిమీద ఏదీ లేదు. మీరు నలుగురూ సంచిలో చెయ్యిపెట్టి ఒక్కొక్కరూ ఒక్కొక్క కాగితం తీసుకొని ఒకరికొకరు తెలియకుండా చూసుకోండి. ఖాళీ కాగితం తీసిన వాడే మీ అందరి గౌరవము కాపాడడానికి పనిచేసే భాగ్యం కలవాడవుతాడు. కాని మీ నలుగురిలో అతనెవ్వడో తక్కిన ముగ్గురికీ తెలియకూడదు. అతను గడించి తెచ్చిన డబ్బు నాకుఇస్తే ఇంటిఖర్చు అంతా నేను చూసుకుంటాను. నలుగురూ దీనికి ఒప్పుకొన్నారు.

చెమటోడ్చి తెచ్చిన డబ్బు ముసలమ్మ జాగ్రత్తగా ఖర్చుపెట్టేది. ఊరిలో వారిగౌరవానికి తక్కువ లేకుండా కావలసినంత ధనం ఉన్నట్టు ఉండేది. నెల నెలా ఆమె దగ్గర ఎంతోడబ్బు నిలవ అవుతూ ఉండేది. నిలవయిన డబ్బుతో ముసలమ్మ ఎన్నో భూములు కొని వాటిని దున్నడానికి రైతులను పాలేళ్లను నియమించింది. రాజకుమారులకి 'ఇంత ధనంఎక్కడిదా'అని ఆశ్చర్యం కలిగి ఎప్పుడయినా అడిగితేనాయనా, మీలో ఒకరు వంశగౌరవం కోసం చెమటోడ్చి పనిచేస్తుంటే మనకి కొదవేమిటి. ఇదంతా ఆతని సంకల్పబలం. అతని మహాత్యాగం వల్ల కొన్నాళ్ళకు ఈ జమిందారీ వర్ధిల్లి మీరు మళ్ళీ సైన్యాలను కూర్చుకొని మీదేశం మీరుజయించుకోవచ్చునేమో అనేది.

ఆమె అనుకొన్నట్లుగానే ఆ జమీందారీ గొప్పగా వర్ధిల్లింది. ఆ రాకుమారులని అందరూ గౌరవించసాగారు. వారు సైన్యాలను కూర్చుకొనడానికి తగిన సన్నాహాలు మొదలుపెట్టారు. వారిదగ్గర డబ్బు పుష్కలంగా నిలవ కాసాగింది.

అంతా ఇలా వుండగా కొన్నాళ్ళకు ముసలమ్మ వారి నందరినీ దగ్గరకు పిలిచింది. వయస్సు మళ్ళడం వల్ల జమీందారీవ్యవహారపు పనుల వల్ల, ఆమె శరీరం క్షీణించి జబ్బుపడి

పోయింది. అదే తన మరణశయ్య అని గ్రహించిన ఆమె వణుకుతున్న చేతులతో ఒక చిన్న వెండిపెట్టెను తీసి వారిచేతికిచ్చింది. వారు దానిని తెరచిచూశారు. వాళ్ళ మొహంలో కనిపించిన ఆశ్చర్యాన్నిచూసి ఆమె చిరునవ్వు నవ్వుకున్నది. అలా చిరునవ్వుతోనే ఆమె శాశ్వతంగా కన్నుమూసింది.

ఆ పెట్టెలో వారికి నాలుగు కాగితం ముక్కలు దొరికాయి. తాము సంచీలోంచి తీసిన కాగితాలు ఇవేనని వారు గ్రహించారు. కాని అసలువింత ఇది. ఆ నాలుగింటిలోనూ దేనిమీదా ముద్ర లేదు; నాలుగూ ఖాళీవే!" అని నేను కథ ముగించాను.

తప్పులుపట్టటంకోసం చూస్తున్న సూర్యారావు మళ్ళీ లేచి అడిగాడు. "కాని సార్, నలుగురూ పని చెయ్యడానికి ఒప్పుకున్నారు కదా, మరి ఒకళ్ళకొకళ్లు తెలియకుండా ఉంచడానికి ఈ నాటకం అంతా ఎందుకండీ?"

"ఒరే సూరీ! నీకు తప్పులు ఎంచుదామని ఉందా? అయితే చెప్తాను విను. నలుగురిలో ఎవరికి వారే తమ తమ వంశగౌరవం కోసమూ, తక్కినముగ్గురికోసమూ, వారికి తెలియకుండా, ఏదో త్యాగంచేస్తున్నామని నమ్మి సుఖం పొందేవారు. ఆ ఉత్సాహంతో కష్టపడి పనిచేసి ఎక్కువ సంపాదించేవారు. జమీందారీ కొనడానికీ, తక్కిన ముగ్గురినీ పోషించడానికీ, కావలసిన డబ్బంతా తానొక్కడే గడించాడనుకొని గర్వపడేవాడు. ఇంకా ఉత్సాహంతో,

## సంకల్పబలం

సైన్యానికి కావలసిన డబ్బు కూడా గడించడానికి నడుము కట్టుకునే వారు! చూశావా ఆ ముసలమ్మ తెలివి? వాళ్లు అంత గొప్పవాళ్లవడానికి కారణం ఆ ముసలమ్మ సంకల్పబలం" అన్నారు రామనాథం మాస్టరుగారు. ★

## జారిన అహం

(15 వ పేజీ తరువాయి)

ఇక్కడ ఎవరి ఇంటిలోనైనా వుండి తెల్లవారేక రాకూడదు బాబూ."

"ఇక్కడ ఎక్కడ వుండమంటావు? నన్నెరిగినవారెవరూ ఇక్కడ లేరు."

"మా పల్లెటూళ్ళలో తెలిసినవారుండనక్కరలేదు బాబూ! ఇప్పుడు తలుపుతట్టి ఈ ఇంటివారిని లేపితే లోపలకు రానిచ్చి మీకు అన్ని వసతులూ వారే చూస్తారు. లేపమంటారా?"

"వద్దు! వద్దు. ఎలాగైనా వెళ్ళిపోవాలి.

"అంతగా వెళ్ళాలని వుంటే బయలుదేరు బాబూ." మీ సామాను నేను మోసుకు వస్తాను."

శ్రీనివాసమూర్తి అయాచితంగా లభించిన అతని సహాయానికి ఆనందంలో ఉక్కిరిబిక్కిరైపోయేడు.

"నాకు కావలసిందీ అదే. కొంచెం ఇలా వచ్చి సామాను తీసుకుని దారిచూపిస్తే నీవెనకాలే నేనూ వస్తాను," అన్నాడు.

ఆ వ్యక్తి వచ్చి సామానుతీసుకుని నెత్తిపై పెట్టుకుని ముందు నడుస్తూంటే జోరున కురిసే ఆ వర్షంలో ట్వీడుపాంటు మోకాలి వరకూ మడచి బూటుతీసి చేతిలో పట్టుకొని అతని వెనకనే నడువనారంభించేడు శ్రీనివాసమూర్తి. త్రోవలో ఎవరూ మాట్లాడలేదు. అక్కడక్కడ జారిపడబోతున్న శ్రీనివాసమూర్తిని "జాగ్రతబాబూ" అని అతను హెచ్చరింపజొచ్చేడు. సామాను మోయలేక అతను ఆయాసపడుతున్నట్లు మాత్రం శ్రీనివాసమూర్తి గ్రహించేడు. మరో అరగంటలో వారు ఊరికి చేరుకున్నారు. అత్తవారింటికి వెళ్ళి తలుపుతట్టి ఇంటిలోని వారిని లేపేడు. అక్కడివారంతా ఆనందంతో కంగారుగా అల్లుడిని ఆహ్వానించేరు. వెనుకనున్నవాని నెత్తిపైనుంచి సామాను దించి శ్రీనివాసమూర్తి మామగారు ఆశ్చర్యంగా నోరు ఆవలించి అతనివైపుచూచి "నీవా రామయ్యా! సామాను నీవు మోసుకు వచ్చేవేమిటి?" అన్నాడు.

శ్రీనివాసమూర్తి వెనుదిరిగి చూచేడు. అతని సామాను మోసుకువచ్చిన వాడు ఇంకెవరో కాదు; రాజమండ్రిలో తన భుజం మీద తట్టి పిలచినవాడే. శ్రీనివాసమూర్తి తెల్లబోయి చూస్తున్నాడు.

"ఇదేమిటి రామయ్యా! ఇలా సామాను మోయవలసిన కర్మ నీకేం పట్టిందయ్యా" మళ్ళీ రెట్టించేడు శ్రీనివాసమూర్తి మామగారు. "కర్మకాదు బాబూ! మీ అల్లుడు బస్తీవాడు. కష్టాలెరుగడు. నిస్సహాయస్థితిలో బస్సుదిగి దారిగానక కొట్టుకుంటున్నాడు. పాపం! పట్నం బాబులు పట్నంలో మనల్ని చూడకపోయినా, మన పల్లెటూర్లు వచ్చినప్పుడు వారికి మనంసహాయం చేయకపోతే ఎలా బాబూ"

నెమ్మదిగా శాంతంగా చెప్పిన ఈ మాటలకు శ్రీనివాసమూర్తిని ఎవరో కొరడాతో ఛెళ్లున కొట్టినట్లనిపించింది. సందేహం నివృత్తికాక "బస్సు దిగిన తరువాత నన్ను ఆనవాలు పట్టేవా?" అని అడిగేడు శ్రీనివాసమూర్తి.

రామయ్య చిరునవ్వు నవ్వేడు. అందులో ఆనవాలు పట్టగలిగేననే అర్థం స్ఫురించింది. తాను అతనిపై కోపం చేసుకున్నా, అవమానించినా, దానిని పూర్తిగా మరచిపోయి, తాను అసహాయస్థితిలో నున్నప్పుడు సహాయ పడ్డాడు రామయ్య! ఎందువల్ల? అర్థమయినట్లు శ్రీనివాసమూర్తి కోటు జేబులోని పర్సుతీసి, అందులోనుంచి రెండు రూపాయలు తీసి రామయ్యకు ఇవ్వడానికి సిద్ధపడ్డాడు.

"తప్పు తప్పు" మామగారు వారించేరు. "రామయ్యా! నీవు ఏమీ అనుకోకు. ఆయన క్రొత్తవాడు, తెలీదు" అని తన తరఫున రామయ్యను క్షమార్పణ కోరుకున్నాడు మూర్తి మామగారు. మూర్తికి ఇదేమీ అర్థంకాక తెల్లపోయి చూస్తున్నాడు. రామయ్య చిరునవ్వు నవ్వుతూ కదలిపోయాడు.

"రామయ్య ఈ వూరి మోతుబరి రైతుల్లో ఒకడు. పదిఎకరాల చక్కని కొండ్ర వుంది. అతను మంచి కొరకు చేసిన ఈ సహాయానికి డబ్బును ప్రతిఫలంగా ఇవ్వడం అతనిని అవమానించడమే అవుతుంది" అన్నాడు మామగారు. మూర్తికి అంతా అర్థమయింది. రామయ్య ఎంత త్యాగమూర్తి? వెళ్ళిపోతున్న రామయ్యను పేరుతో పిలిచేడు మూర్తి! రామయ్య ఆగిపోయేడు. మూర్తి అతని వద్దకు వెళ్ళి రెండు చేతులూ పట్టుకొని "నన్ను క్షమించండి రామయ్యగారూ" అన్నాడు. రామయ్య ఎప్పటిలా 'ఇందులో క్షమించడానికి ఏముంది' అని ఒక్క చిరునవ్వు నవ్వి ముందుకు సాగిపోయేడు. ★

# సినిమా

## చలనచిత్రకళా వికాసానికై

"చలన చిత్రాల స్థాయి పడి పోతోందని, నిర్మాతలు అహో రాత్రాలూ బాక్సాఫీసు సూత్రాల గురించే బెంగెట్టుకుంటున్నారనీ చెప్పడి ప్రయోజనం లేదు. ప్రమాణాలు పెరగాలని ప్రబోధాలు చేసినా వ్యవహారం కలసిరాదు. ఏ మార్పులు వచ్చినా ప్రజల ఆదరణవల్లనే రావాలి." అన్నది చలనచిత్రసీమలో అందరూ చేసేవాదమే.

ఎందుకంటే చలనచిత్ర నిర్మాణంలో—కళల్ల మాట ఎలా ఉన్నా—మొదలూతుదీ కూడా డబ్బే. ఒక రకం చిత్రాలవల్ల డబ్బు వస్తూన్నప్పుడు ఇంకో మార్గంలో పోయేవారు అరుదు అవుతారు. అందువల్ల చలన చిత్రాలు కళాదృష్టితో తయారవాలనీ, ఉత్తమ ప్రమాణాలు నిలుపాలనీ ఆశించే ముందు, ఆ ప్రకారం తయారయే చిత్రాలకు డబ్బు వస్తుందా అనే సంగతి ఆలోచించి, వచ్చే దారికనిపెట్టాలి. అంటే చలనచిత్ర పోషకులకు మంచి చిత్రాలమీద అభిమానం, గౌరవం కలిగించాలి. ఇది హఠాత్తుగా ఇవాళ అనుకుంటే రేపు అయే పని కాదు. ఒక క్రమవిధానంలో, నిర్విరామంగా చాలకాలం కృషిజరగాలి. యూరప్ లో ఈ కృషి చిరకాలంగా జరుగుతోంది. మంచిచిత్రాలకు బాక్సాఫీస్ చిత్రాలలాగా డబ్బు రావటంలేదు కాబట్టి, అవి అందరినీ ఆకర్షించటంలేదు కాబట్టి, ఊరూరా కొద్దిమందినైనా ఆకర్షించి ఈ చిత్రాలు పూర్తిగా దెబ్బతినకుండా చూచి ప్రోత్సహించడం ఈ కృషి లక్ష్యాలలో ఒకటి. బ్రిటన్‌లో ఇది ఒక ఉద్యమంగా ఏర్పడి, వ్యాపించి ఈనాడు ఉచ్ఛదశలో ఉంది. దీనిమూలంగా ఊరూరా ఫిలిం సొసైటీలు ఏర్పడ్డాయి. ఈ సంఘాలు స్వదేశంలోనూ, ఇతర దేశాలలోను తయారయే ఉత్తమ చిత్రాలను తెప్పించి ప్రదర్శిస్తాయి. ఆయా చిత్రాలలో కళాకారుల శిల్ప నైపుణిని పరిశీలించి, మంచి చెడ్డలపై చర్చలు నిర్వహిస్తాయి. దర్శకత్వం, ఛాయాగ్రహణం, నటన, రచన మొదలైన రంగాలలో పాండితి గడించిన వారిని ఆహ్వానించి ఉపన్యాసాలు ఏర్పాటు చేస్తాయి. ఇటువంటి కృషివల్ల, ఆయా దేశాలలో గొప్ప ఫలితాలు సాధించడం జరిగింది. దీని ప్రభావం ప్రజాబాహుళ్యంపై బాగా ప్రసరించింది. అక్కడి ఫిలింసొసైటీలలో ఊరూరా వేలాదిగా సభ్యులుచేరారు. వారంతా ప్రత్యేకం నెలకొల్పుకున్న థియేటర్లలో, ఇతరత్రా చూడవీలుగాని కేళిదేశాల ఉత్తమచిత్రాలను చూచి ఆనందిస్తున్నారు.

ఇటువంటి ఉద్యమం, ప్రపంచ ఫిలిం పరిశ్రమలో ద్వితీయస్థానం వహించే మన దేశానికి చాలా అవసరమన్న సంగతిని పరిశ్రమలోని పలువురు ఏనాడో గుర్తించారు. వారంతా సాగించిన కృషిఫలితంగా ఇవ్వాళకి మొన్న నవంబరు 19 న బొంబాయిలో తొలిసారిగా ఫిలింసొసైటీ అవతరించింది. కేంద్ర సెన్సారు సంఘాధ్యక్షుడు శ్రీ ఎం. డి. భట్ ప్రారంభసభకు అధ్యక్షతవహించి, ఈ ఉద్యమం దేశవ్యాప్తంగా వర్ధిల్లవలసిన ఆవశ్యకతను వివరించారు...

దీనికి తరువాయి ఘట్టంగా, ప్రధాన చలనచిత్ర కేంద్రాలు మద్రాసు, కలకత్తాలలోనూ, ఆంధ్రకు విజయవాడ, హైదరాబాద్ నగరాలలోనూ ఇటువంటి సంస్థలు



ప్రదీప్ కుమార్ నిర్మిస్తున్న 'ఏక్ ఝోలే'లో మాలాసిన్హా

సారథీ స్టుడియోస్‌వారి సాంఘికం 'ఎత్తుకు పైఎత్తు' చిత్రంలో కలకలల్లాడు ఒక సన్నివేశం.

## చలనచిత్ర కళాలయాలు

నెలకొనడం అత్యంత వాంఛనీయం. ఈ సంఘాలు తగు ప్రచారం చేసి సభ్యులను ఆకట్టుకు వచ్చే పక్షంలో ఉత్తమ విదేశీయ చిత్రాలను తెప్పించుకొని చూడడం సులభసాధ్యం అవుతుంది. ఖర్చును అందరూ భరించడం సులభం అవుతుంది. అంతేకాదు. ఉత్తమ ఆశయాలు, సాధించే సామర్థ్యం ఉండికూడా, అవకాశాలు లేక డబ్బు పెట్టే వరవడిని శిరసావహిస్తున్న దేశీయ చలనచిత్ర కళాకారులు ఇటుపై, స్వతంత్రముగా వ్యవహరించి ఉత్తమ చిత్రాలను రూపొందించడానికి, ఈ రూపేణా నాందీ ప్రస్తావన చేసినట్లవుతుంది. ముఖ్య నగరాలలో ఈ ఉద్యమం బలంగా నిలబడితే, చిన్న పట్టణాలలో మెల్లిగా శాఖోపశాఖలేర్పాటు కావడానికి ప్రయత్నము చేయవచ్చు.

##  'వాహినీ' ప్రగతి 

నవంబరు 22 వ తేదీన ఒక పెద్ద బుల్‌డోజరు వాహినీ స్టుడియో ఆవరణలోంచి బయలుదేరి అడ్డొచ్చిన అడ్డగోడను నేలకి సరిచేసి సరాసరి, రేవతీ స్టుడియోలో ప్రవేశించింది.

పలువురు చలనచిత్ర ప్రముఖులు, విజయా ప్రొడక్షన్స్ అధిపతి, వాహినీ స్టుడియో నిర్వాహకుడు అయిన శ్రీ బి. నాగిరెడ్డిని అభినందించి శుభాకాంక్షలు అందచేశారు. శుభముహూర్తాన మాజీ రేవతీ స్టుడియోకు ముస్తాబు చేసి పశ్చిమాన ఉన్న అగ్రశ్రేణి స్టుడియోలకు తూరుపు ఖండపు సవాలుగా రూపొందించే కార్యక్రమం ఆరంభమైంది. అందుకై ఆ రోజున నాగిరెడ్డిగారు, శ్రీ శ్రీనివాసరాఘవన్ వద్దనుండి, పదిహేను ఎకరాల వైశాల్యం, నాలుగు ఫ్లోర్‌లు, రెండు థియేటర్‌లు గల 'రేవతీ' స్టుడియోను కొనివేశారు.

కొన్న క్షణంనుండి, నాగిరెడ్డిగారు ఆ కొత్త ఆవరణలోనే మకాం వేసుకుని, మరమ్మతు, ముస్తాబుల పని దగ్గర ఉండి జరిపిస్తున్నారు. "ఇక్కడ ముందర, చక్కని 'లాన్' (పచ్చిక బయలు) ఏర్పాటుచేసి, పూల మొక్కలు వేయిస్తేగాని, ఇంకో పని కుదరదు" అన్నారు నాగిరెడ్డి, అందమైన ఉద్యానవనం అంటే ఆయనకు చాలా ఇష్టం. వ్యక్తిగతంగా 'హాబీ' వంటిది.

"ఇక్కడ కొన్ని కొన్ని పాకలు, అవి మరీ 'ఐసోర్'గా (కంటికి వికారంగా) ఉన్నాయి" అన్నారు. ఇంకోవారం తిరిగేసరికి ఆ 'ఐసోర్'ను 'మైసూర్'గా మార్చెయ్యాలని పట్టుబట్టి పనిజరిపిస్తున్నారు.

* * *

# బొంబాయి సినిమా లేఖ

## బిమల్‌రాయ్ పౌరాణిక చిత్రం

దర్శక నిర్మాత బిమల్ రాయ్ భారత రామాయణాలలో ఏదో ఒక దానినుండి ఒక మంచి ఇతివృత్తాన్ని తీసుకుని భారీ ఎత్తున చలనచిత్రం నిర్మించ సంకల్పించారు.

ఈ చిత్ర నిర్మాణంగురించి రెండు ముఖ్య విశేషాలున్నాయి. మొదటిది ప్రధాన పాత్ర లన్నిటికీ కొత్త నటీనటులను తీసుకోవటం. కొత్తవాళ్ళు డబ్బు తక్కువ తీసుకుంటారు. చెప్పినట్టు వింటారు. ఈ విధంగా ఈ పద్ధతిలో మిగిలే డబ్బును చలనచిత్ర నిర్మాణంలోని ఇతర ముఖ్య కార్యక్రమాలకు—సెట్‌లు, అలంకారాలూ మొదలైన వాటికి వినియోగించగలమని బిమల్ రాయ్ వివరించారు.

ఇందువల్ల ఇంకో మంచిపనికికూడా సదుపాయం ఉంటుంది.

భారత రామాయణాలలోని మహాపురుషులను, మహిళలను, అందుబాటులో ఉన్న బాక్సాఫీస్ స్టార్లవిగ్రహాలకురూపురేఖా విలాసాలకు సరిపెట్టేసే ప్రమాదం ఆట్టే ఉండదు. నేటి నటీనటులప్రతిభకు, ఈ భావానికి సంబంధం లేదు. ఇతిహాసాలలో వర్ణనలు చిత్రించే పాత్రల స్వరూపస్వభావాలు అందుబాటులోఉన్న నటుల విగ్రహాలకు నప్పుతాయా, అమరుతాయా అన్న విషయం పట్టించుకోనందువల్ల, అటువంటి ప్రయత్నాలూ, ఆయా నటీనటుల కృషి ఎలా విమర్శలకు గురిఅయినదీ విదితమే. ఈ దృష్ట్యా, నటుడికి పాత్రను సరిపెట్టేపద్ధతి మాని, పాత్రకు తగినవ్యక్తిని వెతికి తీసుకురావటం గొప్ప విషయం. ఇందుకు బిమల్ రాయ్ అభినందనీయుడు.

పోతే ఈ చిత్రంగురించిన్న ఇంకో ముఖ్య విశేషం రచన. కథావస్తువుకు తగ్గస్థాయిలో రచనను నడిపించే ఉద్దేశ్యంతో ఈ చిత్రం [illegible] సంభాషణ లన్నిటినీ గేయాలుగా రూపొందిస్తున్నట్లు బిమల్ రాయ్ తెలియచేశారు. ఇందుకై అగ్రశ్రేణి హిందీ కవులను నియోగిస్తున్నట్లు ఆయన వెల్లడించారు. కాగా, ఆనాటి వస్త్రధారణ, అలంకరణ, అప్పటి సౌధ నిర్మాణశిల్పం మొదలైన విషయాలన్నింటిపైనా తగుపరిశోధన జరిపించి నిర్దుష్టంగా తీర్చిదిద్దడానికి కృషిచేస్తామని ఆయన అన్నారు. ఈ చిత్రాన్ని ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తారు. నిర్మాణం 1958 జూన్‌లో ఆరంభిస్తారు.

“మహోత్కృష్టములైన ఈ ఇతిహాసాలలో శతాంశాన్ని అయినా, వెండి తెరమీద నిలుపగలిగితే చరితార్థుణ్ణి అయినట్లు భావిస్తాను” అని దర్శకుడు బిమల్ రాయ్ అన్నారు.

ఇటువంటి సత్సంకల్పాలతో, వినమ్ర భావంతో కృషికి ఉపక్రమిస్తే సత్ఫలితాలు సాధించవచ్చునని గట్టిగా ఆశించవచ్చును.

## “కాబూలీవాలా”

1956 వ సంవత్సరపు చిత్రాలలో రాష్ట్రపతిసువర్ణపతకాన్ని, ప్రాంతీయ స్థాయిలో రజతపతకాన్నీ, ఈ

‘మదరిండియా’ చిత్రం దర్శక నిర్మాత మహబూబ్, ఆ చిత్రాన్ని బ్రిటనులో విడుదల చేయడానికై అమెరికన్ సంస్థ కొలంబియా పిక్చర్స్‌కు అమ్మివేశారు. లండనులో ఒప్పందం వ్రాసుకున్నారు. సంతకాల తరువాత జరిగిన విలేఖరుల గోష్ఠిలో మహబూబ్.





చంద్రికా ఫిలింస్ వారి తొలిచిత్రం 'ఇంద్రజిత్'కు ఇటీవల, దర్శక నిర్మాత ప్రసాద్ ప్రారంభోత్సవం చేశారు. (ఎడమనుండి) రికార్డిస్టు కన్నన్, వి. ఎస్. రాఘవన్, ఛాయాగ్రహణ దర్శకుడు సి. నాగేశ్వరరావు, ఎల్. వి. ప్రసాద్, 'ఇంద్రజిత్' చిత్రం దర్శకుడు ఎస్. రజనీకాంత్, సంగీతదర్శకుడు అశ్వత్థామ.

---

ఏడాది బెర్లిన్ ఉత్సవంలో సంగీతానికి ప్రత్యేక బహుమతిని గడించుకున్న బెంగాలీ చిత్రం 'కాబూలీవాలా'ను నవంబరు 21న బొంబాయి ఫిలిం జర్నలిస్టుల ఆధ్వర్యాన ఇక్కడ ప్రదర్శించారు.

జగద్విఖ్యాతిమైన ఈ టాగూర్ కథ గురించి కొత్తగా మనం చెప్పుకో కలిగింది ఏమీ లేదు.

దేశకాల పరిస్థితులకు, జాతి, మత సంస్కృతిభేదాలకూ వేషభావలకూ అతీతమైన వాత్సల్యంలో, పరిశుద్ధమైన ప్రేమతో ప్రపంచాన్ని, అంతకన్నా పెద్దదైన జీవితాన్నీ నింపివేసిన 'కాబూలీవాలా', చిన్న పిల్ల 'మినీ'ల కథ ప్రపంచ సారస్వతంలోనే ప్రముఖ స్థానం సంపాదించుకొంది. అపారమైన అనురాగానికి నిధి అయిన అబ్దుల్ కాబూలీ అఫ్గనిస్థాన్ వాడే కానక్కర లేదు; ఆ చిన్నపాప కలకత్తాదే కానక్కర లేదు. వాళ్ళను ఈ ఊళ్ళముద్రలకు అతీతులుగా రవీంద్రుడు సృష్టించాడు. ఆ మీసాల అసామి కన్యాకుమారి వాడు కావచ్చు. ఆ చిన్న పిల్ల షాంగ్ హైలో ఒక ఇంటి దీపం కావచ్చు.

ఉదాత్తమైన ఈ చిన్న కథను, చలనచిత్రం తీసి పదివేల అడుగుల సెల్యులాయిడ్ మీద రక్తి కట్టేలా చెప్పగలగడం సామాన్యమైనపని కాదు. ఎంతో సాహసం, దానికి దీటైన సృజనాత్మక ప్రతిభ ఉండాలి.

దర్శకుడు తపన్‌సిన్హా, ఈ కార్యాన్ని సాధించడంలో అద్భుతమైన ప్రజ్ఞ చూపాడు. మున్ముందు ఈయన చిత్రాలు తీసినా మానినా, ఈ 'కాబూలీవాలా' చిత్రంవల్లనే, భారత చలనచిత్ర చరిత్రలో చిరకాలం స్మరణీయుడు అవుతాడు.

నిడివి ఒకటే, ఇందులో పెద్ద అపశ్రుతి. కథ అవధులదృష్ట్యా అవసరమైనదానికన్న ఎక్కువఫిలిం వాడారు అనిపించింది. నటుల, టెక్నీషియన్‌లపేర్లు చూపడానికే దాదాపు మూడు వేల అడుగులఫిలిం పట్టినట్లుంది. ఈ మూడు రీళ్ళలోనే కథకు ఉపోద్ఘాతాన్ని చిత్రించారు. కాబూలీవాలా ఇల్లూ వాకిలీ, అతనికుమార్తె ముద్దూముచ్చటా, ఆసీమతీరూ తెన్నూ, చూపించి, ఆనక కాబూలీవాలా కలకత్తాకు బయలుదేరిరావడం చిత్రించారు. అయితే ఈ ఉపోద్ఘాతాన్ని బాగా కుదించితే, బాగుండేది. ఈ భాగంలో మనోహరమైన ఛాయాగ్రహణం, శ్రుతిపేయమైన సంగీతం (రవిశంకర్) మటుకు అక్షరాలా విందువలె భాసించాయి.

ఈ నిడివి విషయం మినహాయిస్తే, చిత్రం మొత్తంమీద ఉత్తమోత్తమంగా ఉంది. మధురాతి మధురమైన ప్రేమ ప్రతి ఘట్టంలోను తొణికిసలాడుతుంది. ప్రతిపాత్రా సానుభూతికి పాత్రమై ఒప్పింది. ఒక్కొక్క ఘట్టం మరువరాని అనుభూతిని కలిగించింది. కాబూలీవాలా మొదట 'మినీ'ని చూచినప్పటినుండి, చిట్టచివర ఆమెను కలుసుకొని అక్కడినుండి దూరాన కొండలమధ్య ఉన్న తన ముద్దులకూతురును చూడబోయేవరకూ చిత్రం రక్తికట్టేటట్టుగా నడిచింది. ఇందుకై దర్శకుడు తపన్‌సిన్హా, కొన్ని చిన్న చిన్న సంఘటనలను, కథలో వికటించని విధాన, అతిచాకచక్యంతో చొప్పించి అలంకరించారు. ఈ కొత్త సన్నివేశాలలో, కాబూలీవాలా కారాగారంలో మగ్గిపడటం ఒకటి అత్యంత ప్రశంసనీయంగా ఉంది. అలాగే ఒక చిన్న చాకలివాడు హోటలులో మనుషుల తరహాలను చక్కగా చిత్రించారు. చిన్నపిల్లల నృత్యం ఒకటి రమణీయంగా ఉంది.

చిత్రంలో నటనకూడా, ఇతర శాఖలలో సాధించిన ఫలితాలలాగే ఉత్తమస్థాయిలో ఉంది. చిన్న చిన్న వేషాలు వేసినవారు కూడా ఎంతో చక్కగా నటించినందువల్ల బెంగాలీభాష తెలియని ప్రేక్షకులకుకూడా చిత్రం సులువుగా తెలిసేలా రూపొందింది. నటనలో అగ్రతాంబూలగౌరవాన్ని కాబూలీవాలా పాత్రధారి ఛబీ బిశ్వాస్, మినీగా నటించిన ఆరేళ్ళ బాలాకుమారి టింకూ టాగూర్ లు ఇద్దరూ పంచుకున్నారు. ఈ ఇద్దరి నటన, ప్రపంచస్థాయిన చెప్పుకోతగినంత గొప్పగా ఉంది. ముఖ్యంగా టింకూ టాగూర్ 'మణిపూస' అనిపించుకునేలా నటించింది. నిజానికి ఆ పిల్లమాటలూ చేష్టలూ చూసిన వాళ్ళకి, ఆమె చేసినది 'నటన' అని అనడానికి మనసొప్పదు.

ఆమె తలిదండ్రులుగా మంజూడే, రాధామోహన్ భట్టాచార్జీ సంతృప్తికరంగా నటించారు.

సాంకేతిక విభాగంలో ఛాయాగ్రహణం అతి ప్రశంసనీయంగా ఉంది. కామెరా మాత్రమే చెప్పగల మాటలను, చూపగల భావాలను ఊహించి, అవి నప్పేలా చిత్రించారు. అలాగని ఛాయాగ్రహణ కళ పేరిట, ఎబ్బెట్టు అనిపించే తరహా బడాయిలు పోలేదు.

చిత్రానికి పండిట్ రవిశంకర్ సంగీత వ్యాఖ్యానం మనోహరంగా ఉంది. పాటలు కూడా చాలా బాగున్నాయి. అయితే వాటిలో అమోఘంగాఉందని చెప్పుకోతగ్గవి ఏవీ లేవు.

అడుగడుగునా వాస్తవికతను పోషిస్తూ సాగించిన చిత్రణ ఈ చిత్రానికి ఎనలేని పుష్టిని చేకూర్చింది. దానివల్ల ఈ చిత్రం అత్యంత సుందరంగా మనసులో నిలుస్తుంది. ఇందుకు దర్శకుని అభినందించాలి. కాని, ఈ దేశంలోనూ, ఇతర దేశాలలోనూకూడా, ఈనాడు సృజనాత్మకమైనకృషి చేసినవారికి సమర్పించతగు అంజలులు తదన్యులకు బట్వాడా కావడం పరిపాటి అయిపోయింది.

(ఆంధ్రవారపత్రిక బొంబాయివిలేఖరి)★

---

## ఘంటసాలబలరామయ్యగారి కుమార్తె వివాహం

ప్రతిభా పిక్చర్స్ అధిపతి శ్రీ ఘంటసాల కృష్ణమూర్తి, తమ సోదరి సౌ॥ నాగరత్నమ్మను (కీ. శే. ఘంటసాల బలరామయ్యగారి కుమార్తె) శ్రీ నిట్టల రాఘవేంద్రప్రసాద్ కు ఇచ్చి, డిసెంబరు 1 ఉదయం 'ప్రతిభా పిక్చర్స్' భవనంలో వివాహం జరిపించారు. చలనచిత్ర పరిశ్రమలోనివారంతా వివాహానికివచ్చి వధూవరులను ఆశీర్వదించి, కానుకలు చదివించారు. సాయంకాలం విందు, గానసభ జరిగాయి. శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావు, శ్రీమతులు ఎస్. వరలక్ష్మి, పి. జి. కృష్ణవేణి (జిక్కి) పాడారు.

# లలితకళలూ, ★ ★ ★ ★ రాజకీయాలూ

## —నాగేశ్వరరావు భావాలు

మోహన్: నమస్కారమండి నాగేశ్వర రావుగారూ.

నాగేశ్వరరావు: నమస్కారమండి

మో: మిమ్మల్ని నాగేశ్వరరావు అనే కన్న హీరో నాగేశ్వరరావు అని ఎక్కువగా పిలుస్తుంటారు. ఎందువల్ల... మీ పూర్తిపేరు ఏమిటి?

నా: పత్రికలూ, ప్రజలూ, నాకాపేరు పెట్టడం జరిగింది. నా అసలుపేరు అక్కినేని నాగేశ్వరరావు.

మో: మీ జన్మస్థలం ఏవూరండి?

నా: ఆంధ్రప్రదేశ్‌లో కృష్ణాజిల్లా, గుడివాడ తాలూకా వెంకటరాఘవపురం అనే గ్రామం.

మో: మీకు ఫిల్ముల్లో చేరకపూర్వం, నాటకాల అనుభవమేమయినా ఉందా?

నా: ఉందండి. చిత్రాల్లోకి రాకపూర్వం... చిన్నతనంలో స్టేజిమీద ఆడవేషాలు వేశాను.



మో: ఇప్పుడు ఎన్ని చిత్రాల్లో నటిస్తున్నారు?

నా: 8 తెలుగు, నాలుగు తమిళ చిత్రాల్లో నటిస్తున్నాను.

మో: మీరు అటు నాటకరంగంమీద, ఇటు చలనచిత్రాల్లోనో అనుభవం సంపాదించారు కదా, ఈ రెండింటిలో నూ ఏమైనా వ్యత్యాసం కనిపించిందా?

నా: ఈ విషయంలో తర్కించదలచుకుంటే ఎన్ని గంటలయినా పడుతుంది. ఒక్కటి మాత్రం నా అనుభవం వల్ల చెబుతాను. రంగస్థల నటనలో గూ చాల కష్టముంది. చిత్ర నటనలోను చాలా కష్టాలున్నాయి. నటనకు సంపూర్ణ స్వాతంత్ర్యముండి ఏ విధమైన సాంకేతిక పరికరాల సహాయం లేకుండా నటించాలి – అక్కడ రంగస్థలంమీద. సాంకేతిక పరికరాల సహాయమున్నప్పటికీ నటన సంభాషణా ఇత్యాదులలో ఒకవిధమైన హావభావాలు ప్రదర్శిస్తూ కళా ప్రదర్శన ఇవ్వాలి ఇక్కడ చిత్రాల్లో. మొత్తానికి రెండింటిలోను గొప్పతనం, ప్రత్యేకత ఉన్నాయి.

మో: మీరు నటించిన చిత్రాల్లో శత దినోత్సవాలు, బహుమతులు, ప్రశంసలు, పొందినవి చాలా ఉన్నాయి కదండి!

నా: నేను నటించిన అరవై చిత్రాల్లో ఇంతవరకు ఇరవై నాలుగు చిత్రాలు శత దినోత్సవాలు చేసుకున్నాయి. అందులో నాలుగు రజతోత్సవాలు కూడా చేసుకున్నాయి. 'అర్ధాంగి, విప్రనారాయణ' చిత్రాలు ప్రభుత్వ ప్రశంసాపత్రాలు 'తెనాలి రామకృష్ణ' ఆలిండియా సర్టిఫికేట్, రాష్ట్రపతి రజతపకం బహుమానాలు పొందాయి.

మో: మీరు తీరిక సమయాల్లో సాధారణంగా ఏం చేస్తుంటారు?

నా: తీరికసమయాలు అనేవి లభిస్తేగద. ఒక్కపూట కాస్త తీరికదొరికితే ఏదో ఒక సోషల్ ఎంగేజ్‌మెంట్ వచ్చిపడుతుంది. ఇవేమీ లేకపోతే కాస్త విరామం దొరికితే చదువుకోవడమో, లేక మంచి చిత్రాన్ని చూడటమో జరుగుతుంది. రోజూ రెండు కాల్‌షీట్స్ పనిచేసిన పరిస్థితుల్లో విరామం ఎక్కడలెండి మాకు?

మో: రోజూ రెండు కాల్‌షీట్స్ పని



ఎ. వి. ఎం. వారి హిందీ చిత్రం 'భాభీ'లో నర్తకి నళినీ ఛోంకార్.

చేస్తారన్నమాట. ప్రొద్దున్న చిత్రంలో ఒక రకమయిన పాత్రనూ, మధ్యాహ్నం చిత్రంలో మరో తరహా అయిన పాత్రను ధరిస్తూంటారు కదా వీటి నిర్వహణలో మీరేమయినా కొత్త అనుభూతి పొందు

(౫౫-వ పేజీ చూడండి)

చిత్రసమీక్ష:

# 'పాండురంగ మాహాత్మ్యం'

స్వామి కానిదే యోగికాడంటారు. అయితే యోగికావడానికి కామిగా అఘాయిత్యాలు చేయడం అవసరమా? కామిగానో, ఇంకొకడుగానో అఘాయిత్యాలు చేసేవాళ్లందరూ యోగులో భక్తులో అవుతారని చూస్తూ ఊరుకోవలసిందేనా? పూర్వజన్మకృతం ప్రకారం జీవి నడుస్తాడు కనుక ఈ లోకంలో ఏ జీవి మంచిచేసినా, చెడు చేసినా-దానికి ఆ జీవిని సంజాయిషీ అడగనవసరం లేదా? సంజాయిషీ చెప్పినా, తప్పాలని అంగీకరించినా సినిమాలకు కథలు కరువవుతయ్. అందులోనూ మున్ముందు భక్తుడు కావలసిన జీవి ఇప్పుడు ఎన్ని అఘాయిత్యాలు చేసినా చూస్తూ ఊరుకోకపోతే సినిమా ఏమవుతుంది చెప్పండి?

వీటన్నింటికీ కాకపోయినా కొన్నింటికి కొంతవరకూ పాండురంగమహాత్మ్యం (పుండరీకుని కథ) సమాధానం చెబుతుంది. కథలో ఇతివృత్తానికీ శీర్షికకూ ప్రత్యక్ష, పరోక్ష సంబంధాలేమీ లేకపోవడం కథాచమత్కృతి. ఏమూలనో వాడిన ఒక మాటనో ఓ వాక్యాన్నో ఓ కథకు శీర్షికగా పెట్టడం రచన గొప్పతనానికి లక్షణమైనట్టు, ప్రసిద్ధ కావ్యం పాండురంగమహాత్మ్యంతో ఆట్టే సంబంధం లేకుండా పుండరీకుడి కథను వెండితెరకెక్కించి పాండురంగమహాత్మ్యం అన్నారు.

భక్తతుకారాం, సిద్ధజ్ఞానేశ్వర్ ప్రభృతి భక్తకోటి పాండురంగనిలో కైవల్యం పొందిన సన్నివేశాలు చిత్రించేరను సమర్థించకపోవు. అయితే పుండరీకుడు భక్తుడు ఎట్లాఅయినాడూ? తల్లిదండ్రులను సేవించడంవల్ల. చాలా సులభమైనమార్గమేసుమా!

ఈ చిత్రంలోనేకాదు సినిమాల్లో కనిపించే విచిత్రజీవుల చిత్రమేమిటంటే అవి అసాధారణజీవులు. ఒక సినిమాలో ఒకడు తనభార్యను మొదట్లో అందలం ఎక్కిస్తాడు. తరువాత దాసీకంటేకూడా హీనంగా సీత్కరిస్తాడు. కథ అయిపోవచ్చేప్పటికో అయిపోతూండగానో, ఆ భార్యనే మళ్లీ నువ్వు నాదేవత అంటాడు. అదీకథ. సినిమాలకథ. సరిగ్గా పుండరీకుడూ అంతే.

అయితే డబ్బులేకనో, ఉద్యోగంలేకనో తల్లిదండ్రులను మొదట నిర్లక్ష్యంచేసి, అవమానించితే అది ఇంకో సినిమా అవుతుంది. ఇందులో అట్లాకాదు. పుండరీకుడు దర్జాగా గుర్రమెక్కి తిరుగుతూంటాడు. కనిపించిన ప్రతిఆడదానికీ కన్నుగొడతాడు. ఆఖరికి ఇంటికొచ్చేప్పటికి భార్యకనిపిస్తే ఈలవేసి కన్నుగొడతాడు. అంత గొప్పవాడు పుండరీకుడు. అంత గొప్పకామి. అంతకామంలో తల్లిదండ్రులభక్తి, పూజాపునస్కారాలను ఛీత్కరించుకుని వాళ్ళు దూరంగావెళ్లేట్టు చేసుకుంటాడు. ఆతరువాత భార్యను మోసంచేసి ఇంట్లో నగలూ, సామాన్లు - అదీ ఇదీ ఏమిటి మొత్తం ఆస్తినే ప్రియురాలికిరాసిచ్చేస్తాడు.

"ఏమండీ అవునా?" అని భార్యఅడిగితే



"సత్యం...రాసిచ్చేశాం" అంటాడు. అని ప్రియురాలు తిరస్కరించగా ఆమెను చంపబోతాడు. ఆ ప్రియురాలు ఎన్నుకొన్న ప్రియుడువెనకవాటుగాచావుదెబ్బగొడతాడు. బయటికిగెంటి తలుపులేసుకొంటుంది ప్రియురాలు. ఇక అడవులలోబడి తిరుగుతూ తిరుగుతూ ఓచోట ఓ భాగవతోత్తముణ్ణి హింసించబోగా కాళ్ళు రెండు పోతవి. పశ్చాత్తాపం కలుగుతుంది. తరణోపాయం చెప్పమని అడుగుతాడు. మీ అమ్మానాన్నల సేవే తరణోపాయం. అంటాడు భాగవతోత్తముడు. అంతటితో జ్ఞానోదయమై అమ్మా, నాన్నా అంటూ బయల్దేరతాడు పుండరీకుడు. బయల్దేరడమేమిటీ నేలమీద దేకుతూంటాడు.

కలలో ఆ అరుపులువినిపించి పుండరీకుడి తల్లి తండ్రులు కూడా కొడుకు కోసం తిరిగి వస్తూండగా దోవలో కుంటి కొడుకును చూచి తల్లి బాధపడేలోగానే-పుండరీకుడు ఆమె కాళ్లు పట్టుకుని ఏడుస్తాడు. అయ్యో నా కొడుకు కుంటివాడయినాడని ఆమె బాధపడడానికైనా వ్యవధి లేకుండానే పుండరీకుడికి కాళ్ళూ భక్తీవచ్చేస్తయ్. అంతటితో కామిగా, అఘాయిత్యంగా తిరిగిన పుండరీకుడు భక్తుడవుతాడు.

"కృష్ణా...గోవింద ముకుంద—మురారీ" అనగానే "భక్తా పుండరీకా" అంటూకృష్ణుడు పరుగెత్తుకొచ్చేంత భక్తుడైపోతాడు. అంత గొప్ప భక్తుడికి అసాధ్యమేముంటుంది కనుక, తల్లి దండ్రులకూ భార్యకూ ఇంకా ఇతరులకూ మోక్షం ఇప్పించేస్తాడు. అక్కడి నుంచీ పుండరీకుడి కథ పాండురంగ మహాత్మ్యం అవుతుంది ఈ సినిమా కథలో.

ప్రేక్షకులను మెప్పించాలనే ప్రయత్నం చాలా ఉన్నది ఈ చిత్రంలో. అయితే ఆప్రయత్నంలో జాగ్రత్తపాలు తక్కువయిందనిపిస్తుంది. పురాణం చెప్పించారు. మళ్ళీ పురాణంలోనే కథను పూర్తి చేస్తే ఎట్లా ఉండేదీ? ప్రారంభంలో ఇంద్రుడి శాపం సంగతి ఉన్నది. కథకూ ఆ శాపానికి సంబంధం సంగతి ఎట్లా ఉన్నా, ఆదంతా చూడడానికి కావలసిన ఉత్సాహం ఆ సన్నివేశాలవల్ల కలగడం లేదేమో. పైగా ఎబ్బెట్టుగా కూడా ఉన్నయ్యేమో?

పుండరీకుడి కామజీవితం చూపించడంలో పడిన ప్రయాసలో కనీసం సగం శ్రద్ధఅయినా భక్తిసాధన జీవితం చూపించడంలో అవసరం కాదా?

పుండరీకుడి తండ్రిగా శ్రీ నాగయ్య ప్రశంసనీయంగా నటించారు. ఆయన కోడలుగా ప్రతిభ చూపించే అవకాశం ఈ చిత్రంలో శ్రీమతి అంజలికి ఇవ్వలేదేమో?

భర్తయింటినుంచీ బయల్దేరి తండ్రిదగ్గరికి వెళ్ళి, భర్తయింటికొచ్చి, ఆయన దేశం మీదికి పోయినాడని తెలుసుకుని ఆయనను వెదుక్కుంటూపోయేలోగా సినిమాలో ఆమెసంగతే తెలియదు. ఆ తరువాత అసలు ఆమె అవసరమే కథలో కనిపించదు. అంతే అప్పటికసలు పుండరీకుడి పాత్రే పూర్తి కావస్తూంటుంది.

పశ్చాత్తాపం ఉత్తమమార్గమే కావచ్చు. అయితే నిజంగా పశ్చాత్తాపం కలిగిందన్న నిదర్శనమేమిటి? తల్లిదండ్రుల కాళ్లుకడిగి పూజించాడుగా అంటారు. అదివరకైనా వాళ్ళను పుండరీకుడు హింసించినట్లు చిత్రంలో చూపించలేదు. కాకపోతే భజనలనూ, అతిథిసత్కారాలనూ ఏవగించుకుంటాడు. ఏమైనా పుండరీకుడి భక్తిసాధనకు ఇంకా కొంచెం ప్రాముఖ్యమిచ్చి వుంటేబాగుండేదేమో?

ప్రేక్షకుల అపేక్ష, అభిమానం సంపాదించడానికి ఖరీదైన సెట్లున్నవి యీ చిత్రంలో. కానీ, ప్రధాన ఇతివృత్తానికీ, ఆ సెట్లకూ అంతకంటే ఎక్కువ సంబంధం కలిపించివుండవలసింది. సంభాషణలు బాగు

న్నవి. కథ నడిచినకొద్దీ పాటలు స్పష్టంగా వివిపించినవి. ఛాయాగ్రహణం అంత అపూర్వంగా లేదు. సన్నివేశాలను సమన్వయం చేయడంలో ఇంకా కొంచెం శ్రద్ధ అవసరమనిపిస్తుంది. పేకేటి శివరాం, శంకర, వెంకటసుబ్బయ్యాలే వారు నటించిన పాత్రలకు విధిగా అవసరమనిపించదు. పద్మనాభయ్య నటన బాగున్నది.

ఏవగింపు కలిగించని శృంగారం వున్నది. అందుకు సరిపడే నృత్యాలు న్నవి. డబ్బు చేసిపెట్టడానికి అవి కొంత ఉపయోగపడవచ్చు. మొత్తంమీద ఈ నేషనల్ ఆర్టు థియేటర్సువారి పాండురంగ మహాత్మ్యం చిత్రాన్ని ఆంధ్రులు ఆదరిస్తారు. అయితే పాటల రికార్డింగ్‌లో ఇంకా కొంచెం శ్రద్ధ వహించివుంటే "చెబితే చెవికెక్కిందా గురుగురూ" లాంటి పాటలు జనంలో నలిగే అవకాశం ఎక్కువయ్యేది. ★

—వి. ఎస్. వ]

---

## "ఇంద్రజిత్"

చంద్రికా ఫిలింస్‌వారి తొలి కానుక 'ఇంద్రజిత్' చిత్ర నిర్మాణాన్ని దర్శక నిర్మాత ఎల్. వి. ప్రసాద్ నవంబరు 17 వ ప్రారంభోత్సవం చేశారు. ఆరోజున పాటల రికార్డింగు జరిగింది. మాటలూ పాటలూ సముద్రాల వ్రాస్తున్నారు. సంగీత దర్శకుడు అశ్వత్థామ.

ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు, ఎస్. వరలక్ష్మి, సుమ్మడి, కాంతారావు, వి. హేమలత పాల్గొంటున్నారు. ఛాయాగ్రహణం సి. నాగేశ్వరరావు. కళ సూరన్న, దర్శకుడు రజనీకాంత్.

* * *

# లలితకళలా, రాజకీయాలా

(53-వ పేజీ తరువాయి)

కుంటూరా?

నా : ఇది చాల చిన్న ప్రశ్నగాని, జవాబు ఇవ్వాలంటే చాలాఉంది; ఒక్కొక్క పాత్ర, ఒక్కొక్క చిత్రంలో ఒక్కొక్క తరహాగా ఉంటుంది. విభిన్న తత్వాలతో ఏవిధంగానూ, పోలిక, సందర్భం లేక భిన్నప్రకృతుల్లో ఉంటే ఈ పాత్రలు నటుణ్ణి మానసికంగానూ, శారీరకంగాను మెలిపెట్టేసి అతని మేధస్సును ఎంత మథిస్తాయో చెప్పలేను. ఈ భిన్నప్రకృతిగల పాత్రల ప్రదర్శనలో నేనెంతజాగ్రత్తగా ఉన్నా ఎంత మెలకువతో ప్రవర్తించినా,



మద్రాసు నగరానికి మేయరుగా ఎన్నికలయిన ప్రథమ మహిళ శ్రీమతి తారా చెరియన్.

ఒక పాత్రయొక్క శక్తి, ప్రభావం మరొక పాత్రపై పడుతూనే ఉంటాయి. ఆ సందర్భంలోనే ఆయా చిత్ర దర్శకులు నన్ను సరైన మార్గంలో పెడుతూ నాతో సహకరిస్తూ వచ్చారు.

మో : నాటకాల్లో డైలాగులన్నీ కంఠతా పెడతారుకదా; సినీమాల్లోకూడా అలాగే చేస్తుంటారా?

నా : తప్పకుండాను. నాటకాల్లో యింకా అప్పుడప్పుడు ప్రాంప్టర్ మీద ఆధారపడే సమయాలైనా ఉంటాయి' చిత్రాల్లో అదేమీ లాభంలేదు. పూర్తిగా డైలాగ్ వస్తేనే దానికి అనువైన హావ, భావ ప్రదర్శన, ఉచ్చారణలోని స్థాయిక్రమం బాగుంటేది.

మో : మీరు అటు కాశ్మీర్, ఇటు సింహళం పర్యటించారుగదా అక్కడ ఎవరైనా నిర్మాతలను కలుసుకున్నారా? మీ అనుభవాలు ఏమిటి?

నా : హిమాలయపర్వత శోభను తిలకిస్తూ, సుందరతరమైన కాశ్మీర్ లోయలు చూస్తూ, మధురానుభూతి పొందాను. ప్రకృతి సౌందర్యాన్ని చూస్తూ, సింహళీయుల అద్భుతమైన ఆత్మీయతను, వారి ఆతిథ్యాన్ని, అభిమానాన్ని చూరకొన్నాను. కేవలం విశ్రాంతి కోసం, మానసికానందంకోసం పర్యటించాను. ఎక్కడా నిర్మాతల్ని కలుసుకోలేదు, చిత్రపరిశ్రమ విషయం ప్రస్తావించలేదు.

మో : మీ రెప్పుడైనా హాలీవుడ్ వెళ్ళాలనుకుంటున్నారా?

నా : అనుకోవడమేమిటి? వెళ్లితీరాను. చిత్రపరిశ్రమకు జన్మస్థానం. అదీగాక అన్ని రంగాల్లోనూ, బాగా పురోగమించిన ఆ కళాకేంద్రం దర్శించాలని ఎవరికుండదు?

మో : మీరు ఇంగ్లీష్ చిత్రాలు కూడా చూస్తూ ఉంటారనుకుంటాను. వాటిని చూసి నటీనటులు నేర్చుకోవలసిన విషయాలేమయినా ఉంటాయంటారా?

నా : ఇంగ్లీష్ చిత్రాలు సాంకేతికంగా చాలా అభివృద్ధిచెందిన మాట వాస్తవం. వాళ్ళల్లో గొప్ప నటీనటులున్నారు. నటన, దేశకాల పాత్రలను బట్టి ఉన్నప్పుడే ఔచిత్యం ఉంటుంది. సంప్రదాయాల కనుకూలంగా పాత్రను పోషించే సందర్భంలో నటుడు ప్రత్యేక కృషి చేయాలి. అనుకరించడం అంతటా కుదరదు.

మో : మీ అభిమాన ఇంగ్లీష్ నటీనటులు ఎవరు?

నా : చార్లెస్ బోయర్, గ్రెగరీపెక్, ఇంగ్రిడ్ బెర్గ్‌మన్.

మో : నటీనటులు కళాకారులుగా మాత్రమే ఉండాలా కాక రాజకీయాల్లో కూడా పాల్గొనడం మంచిదంటారా?

నా : రాజకీయ పరిజ్ఞానం ఉండటం అవసరమే గాని, రాజకీయాల్లో మునగడం మాత్రం మంచిది కాదనుకుంటాను. కళాసేవ తపస్సులాంటిది. ఏ మాత్రం చలించినా తపోభంగమయినట్లే. రాజకీయాల్లో, పార్టీలు, ముఠాలు, కక్షలూ తప్పవు. వీటన్నిటికీ అతీతమయిన కళాకారుడు తన కళద్వారా ప్రజాదరణ పొందగలుగుతాడు. దేశంలో రాజకీయ చైతన్యం, ప్రజాజీవనంలో అభివృద్ధి గమనిస్తూ ఉండాలే గాని, ఎప్పటికీ రాజకీయాలలో దిగరాదు. కళాసేవ అతని జీవిత పరమావధి. తద్వారా ప్రజాసేవ, కళాకారుని జీవితాశయం.

మోహన్ : చాలా సంతోషం. సెలవండి నాగేశ్వరరావు—సెలవండి. ★

(వాయిస్ ఆఫ్ అమెరికాలో ప్రసారితం)



ఫాక్స్ సెయిల్ ఫిలింస్ వారి 'స్నేహితులు' చిత్రంలో పాడుతున్న టి. ఎం. బాబు.

# ఎర్రగులాబి

(10-వ పేజీ తరువాయి)

అని శ్రీమతినే చూపించమన్నాను.

శ్రీమతి ఆకొమ్మా ఈకొమ్మా వత్తిగించి చివరి పలవ కొమ్మను ముందుకు వంచి "కనుపించిందా?" అంది. "ఏదీ ఎక్కడా" అన్నాను, ఏమీ కనుపించకపోవడంతో. "అదేనండీ! అదిగో ఆయెత్తుగా మొదటికల్లా ఉన్నాయి చూశారూ, పసుపుపచ్చ రంగులో. అవే మొగ్గలు. బాగా పెరిగాక ఎర్రగా వస్తాయి! యింతకూ కనిపించాయా?" అంది నావేపుతిరిగి. ఒకటో క్లాసు కుర్రాడికి ఓనమాలు దిద్దిస్తూ ఒకసారిరాకపోతే రెండోసారి మరింత విపులంచేస్తూ చెప్పేటప్పుడు పెట్టే పోజులో "హమ్మయ్య" అనుకుని శ్రీమతి కళ్ళల్లోకి చూశాను, ఎక్కడన్నా గ్రద్దపోలికలున్నాయేమోనని, లేకపోతే యింకా వారంరోజులగ్గాని మొగ్గలు గావుకదా అవి అప్పుడే యెలాకనుపించాయి?

ఈ వారంరోజులూ నిద్రపోకుండా, యింటిదగ్గర ఉండే సమయంలో అధికభాగం ఆ చెట్టుదగ్గరే ఉండేవాళ్ళం. మొగ్గ ఏపటికి విడుస్తుంది. ఎందుకు? రాత్రికేవిడుస్తుంది. అసలు రాత్రి నిద్రపోయే వేళకే రేకులు ఒక్కొక్కటే విడుస్తుంటాయి. ఒక రాత్రి వేళకి అన్నీ విడుస్తాయి!

అన్నట్టు, ఆ ఒక్క గులాబీనిఏం చెయ్యడం? శ్రీమతి ఎలాగూ తలలో పెట్టుకోందామని చూస్తూ ఉంటుంది. వీల్లేదు. ఓంప్రథమంగా పూసినపువ్వు ఒక ఆడదాని తల్లోకెక్కడమా? ముందు దేవుడికిచ్చేయ్యాలి. మూడున్నరకు లేస్తేగాని లాభంలేదు. అయినా వెధవది మత్తు యెక్కువ. లేవగలనో లేనో? పోనీ యీ అలవాటయినా యీనాటిది గనుకా? చిన్నప్పుడు చదువుకొనే రోజుల్లోనుండీ వస్తూనేఉంది. పరీక్షల్లోనైనా పెందరాళే లేచిన పాపాన పోలేదు గదా! అలారం పెడ్తే...ఎక్కడిదీ? నిన్ననేగా యిబ్రహీం వాచి హాస్పిటలులోకి వెళ్ళింది. పోనీ గడియారం లేకపోతే నేం? ఎదురింటి సుదర్శనంగారి కోడిపుంజు సరిగ్గా నాలుగింటికే అరుస్తుంది. అబ్బ అరుపు వినిపిస్తుందో లేదో? కాస్త ఆకలిగాఉంటే... అసలే ఆయన పిసినిగొట్టు. కోడికి తిండి కూడా సరిగ్గా పెట్టేరకం కాదు. అయినా అవన్నీ తనకెందుకు?

ఈ ఒక్క రాత్రికి కోడినితెచ్చి మంచానికి కడితే! అమ్మో! ఈ సంగతి ఎవరికైనా తెలిసే కులం ఉంటుందా?...ఆ! వీధి అరుగుమీద ఈ రాత్రికి నిద్రపోతే కోడికూత గట్టిగా వినిపించి తెల్లారకట్టే తెలివి వచ్చేస్తుంది. కాని శీతకాలపు చలి రోజులు. మంచుగడ్డలాంటి చలిలో... అరుగుమీద...ఒక్కడినే నిద్రపోవడమే! మేఘం దట్టంగా అలముకొంది. వర్షం జల్లు ప్రారంభిస్తే తడిసి ముద్దయిపోనూ?... ఏమయితేనేం! ఈ ఒక్క రాత్రి యెలాగో గడిపేస్తే సరి. రాత్రికి భోజనం చెయ్యకుండాఉంటే కాస్త వేగిరంగా తెలివివస్తుందంటారు. కాని ఎలా? భోజనం మానివేద్దామా అంటే ఈ జీవి ఊరుకోవద్దూ? అందులో ఈ వేళ వేపుడుకూర! కాస్త జిహ్వకి పసందుగా ఉంటుంది కూడాను! మరైతే యేం చెయ్యడానికీ తోచదేంఖర్మ! ఆరు నూరైనా నూరు ఆరైనా ఈ వేళ వీధిలోనే నిద్రపోవాలి. మీద వర్షంజల్లు పడుతూఉంటే, మంచులాంటి చలి కొరుకుతూ ఉంటే తెలివైనా వేగంగా వస్తుంది.

ఎలా అయితే నేం ఆ రోజు సినిమాకి సెకండ్ షో ఫ్రీ పాస్ లభించినా వెళ్ళకుండా—తీరా వెళ్ళితే తెల్లారుఝామునే తెలివిరాదని, వర్షంలో తడిసి గడకట్టి ప్రొద్దున్నే సుదర్శనంగారి పెంపుడుకోడి ధర్మమా అని నాలుగింటికే లేచి సగం మాత్రమే తెరుచుకున్న కళ్ళతో దొడ్లోకి వెళ్ళిచూస్తె గులాబీమొక్క మొదలకంటా పెకలించేసి ఉంది. దాంతో కళ్ళు పూర్తిగా విచ్చుకున్నాయి.

ఆత్రుతగా శ్రీమతి దగ్గరకు పరుగెత్తుకొచ్చాను. ఇంకా శ్రీమతి నిద్రలో "కొయ్యడానికి వీల్లేదు" అంటోంది. మా మూర్తిగాడి మర్ఫీ రేడియో స్టాయిలో. శ్రీమతిని నిద్రనుండి లేపేసరికి తాతలు దిగొచ్చారు.

"ఎందుకూ" అంది లేస్తూనే. దొడ్లోకి తీసుకెళ్ళి మొక్క చూపించి "ఈ పనంతా కాలేజిపిల్లే చేసి ఉంటుం" దన్నాను. శ్రీమతి మరికాస్త దగ్గరకు వెళ్ళి "అడుగోనండోయీ! ఇది మరింకెవరి పని గాదు. అదే చేసింది!" అంటూ ఎదుటి కన్నంలోకి చూపించింది. అమాంతంగా ప్రక్కనున్న బండరాయి దానిమీద ఎత్తివేదామనిపించింది. నా ప్రయత్నం ముందే పసిగట్టిన పందికొక్కు ముందే జారుకుంది.

అయినా అదేం చేసింది? మా శ్రీమతినే అనాలి. అసలు విషయం ఆతర్వాత చెప్పినది. లేకపోతే ఉల్లిపొట్టువేస్తే గులాబీ అంటు బాగా ఎదుగుతుందని యెవరో చెప్తే ఉల్లిపాయల్నే మొక్కచుట్టూ పాతిందట! అది పసిగట్టిన పందికొక్కు ప్రేళ్లతో సహా మొక్కను దొలిచేసింది.

బాగా తెలారేక తిరిగి మొక్క పాతుతూంటే కిటికీలోంచి కాలేజిపిల్ల కిలకిలా నవ్వుతూంటే నిజంగా ఏడుపే వచ్చింది.

★

# అఖిలాంధ్ర బాలల పరిషత్తు

(7 వ పేజీ తరువాయి)

సాంస్కృతిక ప్రతినిధివర్గాలను విదేశ పర్యటనలకుపంపిస్తున్నట్లే, బాలప్రతినిధి వర్గాలను కూడా పంపించాలని ప్రభుత్వాన్ని కోరుతూ ఆరో తీర్మానం. జాతీయ విస్తరణ అభివృద్ధి మండలులద్వారా కిసాన్ సంఘాలను, మహిళాసంఘాలను ప్రోత్సహిస్తున్నట్లే, గ్రామాల్లో బాలసంఘాలను కూడా స్థాపించి ప్రోత్సహించాలని ప్రభుత్వాన్ని కోరుతూ ఏడవ తీర్మానం. జన్మదినోత్సవ సందర్భంలో ప్రధానమంత్రికి శుభాభివందనలు తెలుపుతూ ఎనిమిదో తీర్మానం.

ఉత్సవంలో పాల్గొని కార్యక్రమాన్ని విజయవంతంగా నిర్వహించిన కొన్ని సంఘాలు, పిల్లలు.

1. చిత్తూరు, శ్రీ మహాత్మాగాంధీ బాలసంఘం. వరూధిని (గేయ నాటిక), కోయనృత్యం ప్రదర్శించారు. పాల్గొన్నవారు గీతాపద్మిని, రాజేశ్వరి, వత్సల, కస్తూరి, ప్రభావతి, భాస్కరి.

2. రాజమండ్రి:—'శాంతిదూత' నాటిక ప్రదర్శించిన వై. యజ్ఞనారాయణ శర్మ, జె. రామమోహన్, వి. రాఘవరావు వి. ప్రభాకరరావు.

3. ఓతాడ, శ్రీరామలింగేశ్వర బాలసంఘం. ప్రదర్శనలు: శివపూజ, చిట్టిపొట్టి, సర్పనృత్యం. పాల్గొన్నవారు టి. వసుంధర, టి. ప్రభావతి, ఝాన్సీ లక్ష్మీబాయి, బి. సుబ్బలక్ష్మి; (పేబాక్) బి. సత్యవతి.

4. ఏలూరు, బాలభారతి: విశ్వామిత్ర–మేనక (నృత్యనాటిక), సినిమాపిచ్చి (నృత్యనాటిక) త్రిలింగ దేశం మనదేనోయి (నృత్యం). ప్రదర్శనల్లో పాల్గొన్నవారు: కె. ప్రసూన, జె. వాణి, పి. చెల్లాయి, పి. సీత, జె. ఉషారాణి.

5. గుడివాడ, బాలానందసంఘం; పాల్గొన్నవారు: కె. రాధాకృష్ణ, ఎ. శ్రీ లక్ష్మి, టి. లక్ష్మీరాజ్యం, పి. శ్రీమతి, ఎమ్. పద్మజ, ఎస్. గోపాలకృష్ణ, సి. హెచ్. మురళి, ఎమ్. రాజేశ్వరరావు, పుండరీకాక్షరావు, గోవర్ధన్ చంద్, ఎ. రంగశాయి, డి. విద్యాధరరావు.

6. మలకపేట (హైదరాబాదు) అంధ బాల పాఠశాల విద్యార్థులు – బుర్రకథ ప్రదర్శనం.

7. గుంటూరు, వికలాంగుల శరణాలయం: బుర్రకథ ప్రదర్శనం.

8. గుంటూరు, సంక్షేమ విస్తరణ కార్యకర్తలు: సంఘ సంక్షేమగీతాలు.

9. చంద్రగిరి, వివేకానంద బాలసంఘం సభ్యులు.

★

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at
The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street. Madras-1. Editor S. Sambhu Prasad



నీటితో ఆట

ఫొటో : ఎస్. కె. విఠల్—మద్రాసు]